అపరాధ పరిశోధన అనుబంధం—56

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మూడు రాత్రులు!

రచన : వసుంధర

## 19 గంటలు?

రచన : సంపత్

## విష పురుగు!

రచన : పోలవరపు ఆనందరావు

## తలనరికిన శవం?

రచన : విద్వాన్ షీలాదేవి

'అంగారక' - రెండవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—56
ఆగస్టు, 1978
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. పి. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గెడా రంగారావు

# మూడు రాత్రులు!

వసుంధర

విసుక్కుంటూ తలుపుతీసి ఎదురుగా కనబడ్డ వ్యక్తిని చూసి చిరాగ్గా - "ఎవర్నువ్వు?" అన్నాడతను.

"నా పేరు జోగినాథం. నీతో చిన్నపనుండి వచ్చాను-" అన్నాడవతల వ్యక్తి.

జోగినాథం తన పేరుగా చెప్పుకుంటున్న వ్యక్తి బట్టలు మాసి ఉన్నాయనడం కంటె వళ్ళి ఉన్నాయనడం సమంజసంగా ఉంటుంది. చూడ్డానికి పిచ్చివాడిలా, బికారి వాడిలాగున్నా డతను. ఇటువంటి వ్యక్తి తనను నువ్వనడం ఆ ఇంట్లో అతనికి కోపం తెప్పించింది—"నువ్వు నన్ను నువ్వంటావా?" అన్నాడు.

"తప్పేముంది? నువ్వు నన్ను పిల్చినట్లుగానే నేను నిన్నూ పిలిచాను."

"నీకూ నాకూ పోలికేమిటి?"

"ఆ అనుమానం నాకూ ఉంది. ఆ విషయం ఇప్పుడే తేల్చేసుకోవచ్చు. మీ ఇంట్లో పవర్ ఉందా?" అనడి

గాడు జోగినాథం.

"ఉంది—యేం?"

"నాకు షవర్ బాత్ చేయాలనుంది."

"నీ బ్రతుక్కి—దాక్కీ—లే తక్కువయింది." అంటూ ఆ వ్యక్తి అదే పనిగా నవ్వసాగాడు. జోగినాథం పిచ్చివాడై యుంటాడని అతనిలో నమ్మకం పెరగసాగింది.

"నిజమే నువ్వు చెప్పింది. తలంతా చిరాగ్గా ఉంది. మీ ఇంట్లో షవర్ బాత్ చెయ్యనిస్తావా?" అన్నాడు జోగినాథం.

"చెయ్యనివ్వను-"అన్నాడతను.

"ఓరి నీ - ఓ పావుగంట నేను షవర్ బాత్ చేస్తే నీ సొమ్మేం పోయింది? ఈ మాత్రం వితరణ లేదా నీకు?" అన్నాడు జోగినాథం.

"వితరణకు పాత్రత పాటించాల్సుంటుంది గదా-"

"పాత్రతకు కొలబద్ద ఏమిటి? వేషమా? నువ్వు మీ ఇంట్లో షవర్ బాత్ చెయ్యనిచ్చి, ఓ జత బట్టలిచ్చావంటే నిన్ను మించిపోతాను. అప్పుడు నీకే అనిపిస్తుంది. జోగినాథం అంత గొప్పవాడికి ఆతిధ్యమిచ్చే అర్హత నీకున్నదా అని?"

"నా దానంతో గొప్పవాడివి అయ్యేవాడిని నన్నెలా మించగలవు?"

"నీ చేతి కంత మట్టి ఓ మామిడి టెంకా ఇస్తే నీకై నువ్వు మామిడాకులూ, మామిడి పళ్ళూ చేయగలవా? లేవు. కానీ ఆ టెంకను మట్టిలో పాతిపెడితే అది మహా వృక్షమై నువ్వు చేయలేని పనులు చేయగలుగుతుంది."

అతను వినుగ్గా - "నీతో మాట్లాడుతూ కూర్చునే వ్యవధిలేదు నాకు. ఇంకో యింట్లో ప్రయత్నించు...."

అన్నాడు.

"నువ్వు కూర్చోలేదులే - నిలబడే ఉన్నావు. అది సరే కానీ నేను కారణ జన్ముణ్ణి. నే నెవరింట్లోనైనా స్నానం చేస్తానంటే అది వారిని అనుగ్రహించడ మన్న మాట! నా అనుగ్రహం పొందే అదృష్టం చాలా కొద్ది మందికి వస్తుంది. ఆ కొద్దిమంది జాబితాలో చేరే అవ కాశం ఈ జన్మకు నీకు వస్తుందో లేదో-" అంటూ జోగి నాథం అక్కణ్ణించి కదల బోయాడు.

అతని ముఖం ఎర్రగా అయింది. వెళ్ళిపోతున్న జోగి నాథాన్ని వెనక్కు పిలిచాడు. లోపలకు రమ్మన్నాడు - "ఫరవాలేదు. అదృష్టవంతుడివే నువ్వు-" అంటూ జోగి నాథం ఆ ఇంట్లో ప్రవేశించాడు.

అతను తలుపులువేసి - "ఒక్క నిముషం అక్కడ నిలబడు-" అంటూ లోపలకు వెళ్ళాడు. తిరిగి వచ్చిన అతని చేతిలో బెల్టు ఉంది. ఊహించని వేగంతో అతను జోగినాథాన్ని బెల్టుతో కొట్టాడు. జోగినాథం క్రింద పడిపోయాడు. అతను లేకబోతూంటే మళ్ళీ రెండు బెల్టు దెబ్బలు తగిలాయి. అతనికి లేవడానికి ప్రయత్నించలేదు.

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలియక పిచ్చివా గుడు వాగుతున్నావు. నేను సాధారణంగా ఎవరినైనా చేత్తోనే అనుగ్రహిస్తాను. కానీ నీ వళ్ళంతా మురికి. నీ దగ్గర వాసన. నిన్ను తాకకుండా వీలైనంత దూరం నుంచి అనుగ్రహించాలని బెల్టు వాడాను. ఇంకెప్పుడూ ఎవరింటికీ పవర్ బాత్ కు వెళ్ళకు. వెళ్ళినా తలతిక్కగా మాట్లాడకు -" అని జోగినాథం లేస్తూండడం గమనించి మరో రెండు బెల్టు దెబ్బలు వేశాడు.

జోగినాథం అతను విసిరిన బెల్టును ఒడుపుగా పట్టి

తనవైపు లాగాడు. అతనిది ఊహించక పోవడం మూలాన చేతిలో పట్టులేదు. బెల్టు జోగినాథం చేతిలోకి వచ్చింది. అతని కళ్ళలో భయం కనపడింది.

"భయపడకు. నేను కారణ జన్ముణ్ణి. అందుకే షవర్ బాత్ కు నీ ఇంటికి రావాలని బుద్ధి పుట్టింది. నీలో క్రూరత్వం వెర్రి తలలు వేస్తోంది. నీ కథ తెలుసుకుని నీ అంతు తేల్చేదాకా స్నానంచేసే అదృష్టం నాకెలాగూ ఉండదు. ఈ బెల్టు నీ దగ్గరే వదిలేస్తాను. దీన్ని నామీద ఉపయోగించినందుకు నువ్వు అదే పనిగా దుఃఖించే రోజు రాకపోదు—" అని తలుపు తీసుకుని బెల్టు అక్కడ పారవేసి, విసురుగా వెళ్ళిపోయాడు జోగినాథం.

# 2

"పాలవాడొచ్చినట్లున్నాడండీ - లేస్తాను—" అంది సునీత.

"ప్లీజ్ లేదు. అలాగే కదలకుండా పడుకో—నేను పాలు పోయించుకు వస్తాను—" అంటూ గోవిందరావు లేచి వెళ్ళి పాలుపోయించుకుని పక్కలోకి వచ్చాడు. ఇది యించుమించు ప్రతి రోజూ జరిగేదే!

ఉదయం మెలకువ వచ్చేక బలమైన కౌగిట్లో ఓ అర్ధగంటైనా సునీతను బంధించి ఉంచితే కానీ గోవిందరావుకు తృప్తిగా ఉండదు. వారికి మెలకువ వచ్చే సమయమూ పాలవాడొచ్చే సమయమూ ఒకటే కావడంతో రోజూ అతనికి ఇబ్బందిగా ఉంటోంది.

పాలు పోయించడానికి తను లేచి వెడతానని సునీత అంటుంది. ఆమె లేచి వెళ్ళాలంటే బట్టలు సవరించుకుని వెళ్ళాలి. అందుకు అయిదు నిముషాలైనా పడుతుంది. కానీ అదంత ముఖ్య సమస్యకాదు. ఒక పర్యాయం లేచి

బట్టలు సవరించుకున్నాక సునీత మరి పక్కలోకి రాదు. అందుకే గోవిందరావు ఆ బాధ్యత తను స్వీకరించాడు.

ఈ దంపతులది ప్రేమ వివాహం. ప్రేమదా౽ా బాగానే గడిచినా వివాహం అంత సాఫీగా జరగలేదు. అందంలోనూ, చదువులోనూ, సంపదలోనూ గోవింద రావుకు అన్ని విధాలా దీటు వచ్చే వ్యక్తి మరొకడు న్నాడు. అతని పేరు రామస్వామి. అతను సునీతకు బావ.

సునీత పుట్టినప్పుడే రామస్వామికి భార్య పుట్టిందని అంతా అనుకున్నారు. పుట్టినప్పట్నించీ కూడా సునీత అంటే రామస్వామికి ప్రాణంగా ఉండేది. భార్య అనే పదానికి అర్థం తెలియని వయసులో కూడా ఆమె తనకు భార్య అని అంతా అంటూంటే అతిఆనందించేవాడు. ఆ పదానికి అర్థం తెలిశాక అతనామెను ప్రేమించడం మొదలు పెట్టాడు.

రామస్వామి తండ్రి ఇల్లరికపుటల్లుడు కాకపోయినా మామగారుండే ఊళ్లోనే అతని ఉద్యోగముండడమూ, అతనికి స్వంత ఇల్లు లేకపోవడమూ, అతని మామగారికి స్వంతిల్లు ఉండడమూ కారణంగా పెళ్ళయినప్పట్నించీ అతని మకాం మామగారింట్లోనే! అయితే ఆ యింట్లో అతను వేరే వాటాలో ఉంటున్నాడు. ఈ వేరు వాటాలు రామస్వామి తండ్రికే కానీ రామస్వామికి లేవు. ఈ కారణంగా అతనూ, సునీతా చిన్నప్పట్నించీ కలిసే పెరిగారు.

సునీతకు వయసు పెరిగిన కొద్దీ అందాలు సంతరించు కుంది. పదహారేళ్ళు వచ్చేసరికి ఆమె బంగారు బొమ్మలా ఉండేది. ఆమె అందాన్నే తన అదృష్టంగా గుర్తించి సంబర పడుతూండేవాడు రామస్వామి.

అయితే రామస్వామి గురించి సునీత ఆలోచన ఇంకో విధంగా ఉండేవి. తన ఎదురుగా ఉంటూ, తనతో పాటే కలిసి పెరుగుతూ, తనకు తెలిసిన వ్యక్తి కాక మరే అందాల రాజకుమారుడో తనకు భర్త కావాలని ఆమె కోరుకుంటూండేది. కానీ తన మనసులోని ఈ రకమైన ఆలోచనలను అందరితోనూ చెప్పడానికామె భయపడింది.

గోవిందరావుతో సునీత పరిచయం రామస్వామివల్లనే జరిగింది. గోవిందరావు రామస్వామి క్లాసుమేటు. అన్నింట్లోనూ అతను ఫస్టుగా వస్తూంటాడని రామస్వామి మరదలికి తరచుగా చెబుతూండేవాడు. రామస్వామికి గోవిందరావంటే చాలా ఇష్టం. తరచుగా కంబైన్డ్ స్టడీస్‌కి అతను గోవిందరావు ఇంటికైనా వెడుతూండేవాడు. లేదా గోవిందరావుని తనింటికైనా రప్పించుకుంటూండేవాడు.

రామస్వామి గోవిందరావు గురించి చెప్పిన విశేషాలు సునీత మదిలో చెరగని ముద్రలయ్యాయి. అతనిపట్ల ఆమెలో ఆరాధనా భావం కలిగి పెరగసాగింది. దానికి తోడు గోవిందరావు చాలా అందంగా ఉంటాడు. చదివే నవలలు, చూసే సినిమాలు ఆమెకు అతనిపై ప్రేమను పుట్టించ సాగాయి. ఆ ప్రేమ, ఆరాధన ఆమె కళ్ళలో ప్రతిఫలించగా — తెలివైన గోవిందరావు త్వరలోనే అర్థం చేసుకోగలిగాడు. అతనికీ అందాల సునీతపై మోజు మళ్ళింది. తన ప్రయత్నాలు వీలున్నప్పుడల్లా చేసి చూశాడు. ఫలితంగా ఇద్దరూ పరస్పరం ప్రేమించుకోసాగారు.

ఈ సంగతి రామస్వామి ఊహించనైనా ఊహించ

లేదు. సునీత ఎప్పటికీ తనదే అని అతను చాలా నమ్మకంగా ఉన్నాడు. తన మిత్రుడి పైన అతడికి ఏపాటి అపనమ్మకం కూడా లేదు. అయితే ఒక రోజున అతను ఇద్దర్నీ సినిమా హాల్లో చూసి ఆశ్చర్యపోయాడు. తన్ను తాను నిగ్రహించుకుని గోవిందరావుతో ఏకాంతంగా మాట్లాడాడు__తర్వాత!

అప్పుడు గోవిందరావు ఎమ్మెస్సీ ఫైనలియర్ చదువుతున్నాడు. సునీత బీయస్సీ మొదటి సంవత్సరం చదువుతోంది.

"ఒరేయ్ నువ్విలా ప్రవర్తిస్తావని నేననుకోలేదు..." అన్నాడు రామస్వామి.

"తప్పు చేసే స్వభావం కాదు నాది__" అన్నాడు గోవిందరావు.

"నా మరదల్ని తీసుకుని సినిమాకు వెడతావా? అది తప్పు కాదంటావా?"

"అందులో తప్పేముంది? ఆమెను నేను ప్రేమించాను..."

రామస్వామి తడబడి__"సునీత నాకు కాబోయే భార్య. తెలుసునా?" అన్నాడు.

"ఆ విషయం సునీత నడిగేవా?" అన్నాడు గోవిందరావు.

రామస్వామి స్నేహితుడితో అంతకు మించి మాట్లాడలేదు. తర్వాత అతను సునీతను కలుసుకున్నాడు__

"ఈ విషయం ఇంట్లో చెప్పకు బావా!" అంది సునీత.

"ఎందుకని?"

"ఆయన కుద్యోగం వచ్చేదాకా పెళ్ళి మాటలు కుదరవు గదా__పెళ్ళి సంగతి మాట్లాడ గలిగేవరకూ

మా ప్రేమ సంగతి ఇంట్లో తెలియడం ఇష్టంలేదు—" అంది సునీత.

"మా ప్రేమ అంటున్నావ్—నా ప్రేమ సంగతి మరిచి పోయావా?"

"నేను నిన్ను ప్రేమించడంలేదు..." అంది సునీత.

"కానీ నేను నిన్ను ప్రేమిస్తున్నాను—ఆ సంగతి నీకు తెలుసు..."

"అందుకు నేనేం చేయగలను? నీ ప్రేమ సంగతి చెప్పుకోడమే కానీ నా ప్రేమ సంగతి తెలుసుకుందుకు ఎప్పుడేనా ప్రయత్నించావా నువ్వు!"

"లేదనుకో—కానీ నేను తప్పు అభిప్రాయంలో ఉన్నానని తెలిసినపుడు నువ్వు సరిచేయాలి—అది నీ బాధ్యత!"

"నేను నిన్ను ప్రేమిస్తాననుకోవడం నీ అహంకారం. అందంలో, పర్సనాలిటీలో, తెలివి తేటల్లో నిన్ను మించిన వాళ్ళు బోలెడు మందున్నారు. అయినా నువ్వు గుర్తించ లేదు. గోవిందరావుగార్ని నువ్వే నాకు స్వయంగా పరిచయం చేశావ్. అన్నివిధాలా నీ కతీతుడైన ఆ మనిషిని నాకు పరిచయం చేయడంలో ఉన్న ధైర్యమే నీ అహంకారాన్ని ఋజువు చేస్తోంది. ఇకపోతే చెప్పాల్సిందేముంది?"

రామస్వామి సునీత ఇలా మాట్లాడుతుందని అనుకో లేదు. అతను విషయాన్ని పెద్దల దాకా తీసుకువెళ్ళాడు. ఆ విధంగా ఆదిలోనే ఈ విషయాన్ని పరిష్కరించగలనని అతననుకున్నాడు.

రామస్వామి తండ్రికి చాలా కోపం వచ్చింది. సునీత తలిదండ్రులు కూడా ఈ విషయంలో కూతుర్ని కొప్ప

డ్డారు.

రామస్వామిని పెళ్లి చేసుకోమన్నా, గోవిందరావుని పెళ్ళి చేసుకోనివ్వకపోయినా ఆత్మహత్య చేసుకుంటా నంది సునీత. ఒక్కర్తే ఆడపిల్ల ఆమె! ఇంట్లో పెద్దా చిన్నా అంతా అన్ని గొడవలూ పడ్డాక—సునీత ఇష్టా నికి వ్యతిరేకంగా ఏమీ జరుగదని రామస్వామికి తేలి పోయింది. అయితే అతను కొంత వ్యవధికోరి—ఆ వ్యవ ధిలో సునీత మనసు మార్చాలనుకున్నాడు.

ఎమ్మెస్సీ పరీక్షలై పోయాయి. గోవిందరావు యూని వర్సిటీకి ఫస్టుగా వస్తే తను నాల్గవ వాడుగా వచ్చాడు రామస్వామి. ఇద్దరూ చాలా సంస్థలకు అప్లికేషన్సు పెట్టారు. ఇంటర్వ్యూలకు వెళ్ళివస్తున్నారు.

ఈ మధ్య కాలంలో రామస్వామి సునీతను తనవైపు తిప్పుకోవడానికి అనేక రకాల ప్రయత్నాలుచేసి విఫలు డయ్యాడు. సునీత తనకు దక్కదని రూఢి అయేక ఒక రోజు అతను అవకాశం చూసుకుని ఆమెను బలవంతంగా అనుభవించబోయాడు.

అతన్నించి తప్పించుకునేందుకు సునీత శారీరకబలంతో కొన్ని వృధాప్రయత్నాలుచేసి—ఆఖరికి చేతులు జోడించి ప్రార్థించింది. అదీ పని చేయకపోగా ధైర్యంచేసి అతనికి లొంగినట్లు నటించి, తన మనసు మారినట్లు నమ్మించి, అతన్ని తప్పించుకుని గదిలో పెట్టి తలుపు గొళ్లెంవేసింది. తర్వాత ఇంట్లోని వారందరికీ జరిగింది చెప్పింది.

రామస్వామి తండ్రి కొడుకుని వెనకేసుకొచ్చాడు. సునీత తండ్రి రామస్వామిని నిష్ఠూరాలాడాడు. ఆ తర్వాత సునీత పొరపాటున కూడా ఏకాంతంగా రామ స్వామికి దొరకలేదు.

గోవిందరావుకీ, రామస్వామికీ ఒకే పరిశోధనా సంస్థలో ఉద్యోగాలు వచ్చాయి. గోవిందరావు పెళ్ళికి సుముఖుడయ్యాడు. సునీతకూ అతనికీ వివాహానికి ముహూర్తం నిశ్చయమయింది. దాంతో రామస్వామిలో బాగా వేడి పుట్టింది.

అతను సునీత దగ్గరకు వెళ్ళి—"నిన్ను ప్రేమించినందుకు జీవితంలో చాలా అన్యాయమై పోయాను. ఎలాగూ పెళ్ళిచేసుకు వెళ్ళిపోతున్నావు. నీకు వరసైన వాణ్ణి, స్వయానా బావను చిన్నతనంనుంచీ నిన్ను భార్యగా భావించుతున్న వాణ్ణి. ఒక్కసారికి నన్ను కరుణించి నాదానివికా. ఈ ఒక్క ఉపకారానికి జీవితాంతం నీకు ఋణపడి ఉంటాను—"అన్నాడు.

సునీత అసహ్యంగా అతని వంక చూసి—"పెళ్ళి నిశ్చయమైనాక ఏ వరస ఉన్నా నేను నీకు చెల్లెలివంటిదాన్ని. నన్నలాగే చూడ్డం నేర్చుకో—" అంది.

రామస్వామికి చాలా కోపం వచ్చింది - "నేననుకున్నది సాధించి తీరతాను. నీ కర్మకాలింది. జీవితంలో నాకు సుఖం లేకుండా చేశావు. నీకూ సుఖం లేకుండా నేను చేస్తాను. నాకాకుండా పోయినందుకు నిన్ను కూడా గోవిందరావు కాకుండా చేస్తాను.."అన్నాడు.

"అంటే ఏం చేస్తావేమిటి?" అంది సునీత నిరసనగా.

"నా విషయంలో గోవిందరావు చేసిన విధంగా అతని విషయంలో నేనూ చేస్తాను. మీరిద్దరూ కలిసి నాప్రేమను నిలువునా హత్యచేశారు. మీ ఇద్దరి ప్రేమనూ హత్య చేస్తాను. మీరు చేసిన హత్యలో రక్తం కనబడటం లేదు. కానీ నా హత్యలో ఎర్రటి రక్తం చిందుతుంది..." అన్నాడు రామస్వామి.

సునీత భయపడలేదు, "హత్యలు చేయాలనుకునే మన స్తత్వం మంచిదికాదు. చచ్చిన వాళ్ళ ప్రాణం క్షణంలో పోయినా — చంపిన వాళ్ళ ప్రాణాలు మాత్రం జీవితాంతం నలుగుతూనే ఉంటాయి–" అంది.

ఆ తర్వాత సునీతకూ, గోవిందరావుకూ పెళ్ళయింది. గోవిందరావు సునీత మెడలో తాళి కడుతూంటే రామస్వామి దిగులుగా చూస్తూ ఉండి పోయాడు.

జీవితంలో స్వర్గాన్ని చవి చూస్తోంది. సునీత గోవిందరావుకు అన్ని మంచి లక్షణాలతో పాటూ, పెళ్ళయ్యాక కూడా భార్యను ప్రేమగా చూసుకునే లక్షణం ఉంది. అతను లేకుండా క్షణమైనా బ్రతకలేని స్థితి సునీతకు వచ్చేసిందంటే – అందుకతని ప్రేమనురాగాలే కారణం.

# 3

మంచంమీద పడుకుని నవల చదువుకుంటోంది సునీత.

కథ మాంచి పట్టులోవున్న సమయంలో ఎవరో తలుపులు దబదబా బాదారు. చిరాగ్గా లేచింది సునీత. ఆ సమయంలో తలుపులు బాదేదెవరో ఆమెకు అర్థంకాలేదు.

"ఎవరువారు?" అని విసుగ్గా అరుస్తూ ఆమె తలుపులు తీసింది. ఒకవ్యక్తి చటుక్కున లోపల జొరబడి—"అర్జంటుగా తలుపులు వేసేయ్!" అన్నాడు.

అతన్ని చూసి "నువ్వా?" అంది కంగారుగా సునీత.

"అవును నేనే! ముందు తలుపులు వేసేయ్. నేను చాలా పెద్ద ప్రమాదంలో వున్నాను" అన్నాడు రామస్వామి.

సునీత వెంటనే తలుపులు వేసేసింది. రామస్వామి పరిస్థితి చూడగానే ఆమెకు చాలా జాలి కలిగింది. అతను మనిషి కంగారుగా కనబడుతున్నాడు. శరీరం కొద్దిగా

వణుకుతోంది. కళ్ళలో భయం కనబడుతోంది.

"ఏమిటి ప్రమాదం? ఆఫీసునించే వస్తున్నావా?" అంది సునీత.

"లేదు. ఆఫీసుకు సెలవు పెట్టాను. నేనిప్పుడో పెద్ద ప్రమాదంలో ఇరుక్కున్నాను. నన్ను రక్షించడం నీ చేతుల్లోవుంది." అన్నాడు రామస్వామి.

"నేను నిన్ను రక్షించడమా?" ఆశ్చర్యంగా అంది సునీత. అప్పటికి రామస్వామి వెళ్ళి అక్కడేవున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు. సునీత తనూ వెళ్ళి యెదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"నిజానికి నేను ఏ నేరమూ చేయలేదు. కానీ పరిస్థితులలా వచ్చాయి. ఓ వారం రోజులపాటు మీ ఇంట్లో నాకు ఆశ్రయం కావాలి. నేనిక్కడుంటున్నట్లు రెండో కంటివాడికి తెలియకూడదు. నా రాకపోకలు రహస్యంగా చేస్తూంటాను. మీరూ వాటి విషయంలో రహస్యాన్ని కాపాడాలి."

"ఎందుకిదంతా?"

"నేను నిరపరాధినని నిరూపించుకుందుకు నాకో వారం రోజులు గడువు కావాలి. ఆ గడువు సమయంలో నా నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోగలను. అంతవరకూ మీవంటి దగ్గర బంధువులే నాకు సాయపడాలి."

సునీత ఆలోచనలో పడింది. తననొక పర్యాయం ఏకాంతంలో అతడు బలవంతం చేయబోయిన దృశ్యం ఆమె కళ్ళముందు మెదుల్తోంది. ఒక్కసారి తనకులాంగి పొమ్మన్న అతని అర్థింపు, బెదిరింపు ఆమె చెవులలో గింగురుమంటోంది. కాని అతనిప్పుడున్న దయనీయమైన పరిస్థితి—

"ఆలోచించకు సునీతా! నన్నిప్పుడో గదిలోవుంచి గొళ్లెం పెట్టేయి. కాలక్షేపానికి ఏ పక్కింటి పిన్ని గారినో పిలిచి మీ ఆయన వచ్చేదాకా కబుర్లుచెప్పకో" అన్నాడు రామస్వామి.

"అలాయెందుకు చేయడం?"

"అది నీకూ నాకూకూడా మంచిది. నేను ఈఇంట్లోకి రావడం ఎవ్వరూ చూడలేదు. కానీ నా గురించి యెవ రయినా వెతికేటప్పుడీ యింటికి రావచ్చును. ఈ ఇంట్లో మరోవ్యక్తి లేడన్న నమ్మకం చుట్టుప్రక్కల అందరి లోనూ కలగాలి. నేను గదిలోనే వుంటాను. కానీ నేనిక్కడ లేనట్లు బలమైన సాక్ష్యంవుండాలి."

సునీత క్షణం ఆలోచించి "నీ పాడుబుద్ది అర్థమైంది నాకు. నిన్ను గదిలో గొళ్ళెంపెట్టి పక్కింటి పిన్నిగారితో కబుర్లు చెబుతూ కూర్చుంటే ఆయనవస్తే ఏమనుకుంటారు? నువ్వు నాకోసం వచ్చావనీ, అనుకోకుండా పక్కింటా విడ వస్తే నిన్నావిధంగా దాచేననీ ఆయన భావించి నన్ను వదిలిపెట్టేస్తారనా?" అంది.

"సునీతా ప్లీజ్!" అన్నాడు రామస్వామి బాధగా. "నేను నిన్ను ప్రేమించిన నేరానికి నాకు దుష్టత్వాన్ని ఆపాదించకు. నీ అనుమానం నిరాధారమైనది. ముందు నువ్వు ఒప్పుకుంటే అన్ని విషయాలూ నీ భర్తతోకూడా ఆలోచించుదామనుకుంటున్నాను. వాడికి తెలియకుండా నేనేదో చేస్తాననుకోకు."

తను అనవసరంగా తొందర పడిందేమోనని బాధ పడింది సునీత. ఆ తర్వాత ఆమె అతను చెప్పిన విధం గానే చేసింది.

# 4

గోవిందరావుని చూస్తూనే రాజేశ్వరమ్మ త్వరత్వరగా లేచి వెళ్ళిపోయింది.

"ఎప్పుడూ లేనిదీరోజింత సేపు కబుర్లు పెట్టావేమిటి? నేనింట్లోకి వచ్చేసరికి నువ్వు ఒంటరిగా వుండాలని తెలియదూ?" అన్నాడు గోవిందరావు భార్యను కౌగిట్లో బంధిస్తూ.

సునీత జరిగిందంతా చెప్పి తలుపు గొళ్ళెం చూపించింది. గోవిందరావు ఆశ్చర్యంగా విని, "అవును—వాడు పదిహేనురోజులు ఎర్న్డ్ లీవుకు అప్లై చేశాడు. ఐతే ఏదో ప్రమాదంలోవున్నట్లు నాకు చెప్పలేదు" అన్నాడు.

సునీత వీధితలుపులు వేసి వచ్చింది. గోవిందరావు గది గొళ్ళెం తీసాడు. గదిలోంచి రామస్వామి నవ్వుతూ బయటకు వచ్చాడు. "గట్టిగామాత్రం మాట్లాడకండి. ఇంట్లో నేనున్నట్లు ఎవ్వరికీ తెలియకూడదు. ఇది అజ్ఞాతవాసంకూడా కాదు. అదృశ్యవాసం" అన్నాడతను.

"అసలు కథేమిటో చెప్పు" అన్నాడు గోవిందరావు.

"చెప్పడానికి కథేమీ లేదు. చాలా కష్టాల్లోవున్నాను. ఇప్పుడేమీ వివరించలేను. అయినవాళ్ళుగా ఓ వారం రోజులు ఆదరించగలిగితే ఆదరించండి. మీ ఋణం ఈ జన్మకు తీర్చుకోలేననుకుంటాను" అన్నాడు రామస్వామి.

"ఇది నీయిల్లు" అన్నాడు గోవిందరావు. సునీత మాత్రం మౌనంగా ఊరుకుంది.

"నీ కిష్టంలేదా?" అన్నాడు రామస్వామి, సునీతను.

"మీరుకూడా ఓ వారంరోజులు ఆఫీసుకు సెలవు పెట్టకూడదూ?" అంది సునీత.

గోవిందరావు ఆలోచనలో వుండగా రామస్వామి

అన్నాడు. "అలా అయితే నా ప్లానంతా అప్‌సెట్ అవుతుంది. మీ ఆయన ఉత్తినే సెలవుపెట్టి యింట్లో కూర్చుంటే అందుకేదో కారణముందనే అనుకోవాలి. నేను మీ ఇంట్లో ఉంటున్నానని లవలేశంకూడా ఎవరికీ అనుమానం కలక్కూడదు."

"అలా అనుమానం కలిగితే ఏమౌతుంది?" విసుగ్గా అన్నాడు గోవిందరావు.

"చాలా కష్టాలలో వున్నాను. ఇప్పుడేమీ చెప్ప లేను. అయిన వాళ్లుగా...."

"సరే అలాగేలే—కానీ..." అన్నాడు గోవింద రావు.

"నన్ననుమానించవద్దు. నువ్వు వెళ్ళేటప్పుడే గదికి గొళ్లెంపెట్టి వెళ్లు. తాళంమాత్రం వెయ్యవద్దు. ఎవరయినా ఇంటికివస్తే లోపల మనుషులుండగా ఓ గదికి తాళంవేసి ఎందుకున్నదన్న అనుమానం వస్తుంది?" అన్నాడు రామస్వామి.

"సరేలే, కానీ యిదంతా దేనికి?"

"చాలా కష్టాలలో వున్నాను. ఇప్పుడేమీ చెప్ప లేను. అయిన వాళ్ళుగా..."

"తప్పకుండా ఆదుకుంటాంలే బాబూ"—అన్నాడు గోవిందరావు. రామస్వామి వ్యవహారమేమిటో అతనికి అంతుబట్టలేదు.

## 5

సునీతను దగ్గరగా తీసుకొని, "జీవితాంతం మనమిద్దర ఇలాగే..." అని ఏదో అనబోతుండగా భర్తను వారించి "హుష్, ఇంట్లో బావవున్నాడు" అంది.

"ఉన్నాడని నాకూ తెలుసులే. కానీ వాడు వింటే వచ్చిన నష్టమూ లేదు. పైగా వాడికి ఉపయోగం కూడా. మనింట్లో మూడో మనిషున్నట్లు యెవ్వరికీ అనుమానం రాకూడదు" అన్నాడు గోవిందరావు.

"అదిసరే__కానీ బావ విషయం మీకేమైనా తెలిసిందా?"

"ఏమీ చెప్పందే ఎలా తెలుస్తుంది?"

"చెప్పలేదనుకోండి. కానీ మీరు చాలా తెలివయిన వారు కదా..."

"చదివింది గుర్తుంచుకోవడంలోనే నా తెలివితేటలు"

"అంతే ఐతే అమెరికన్ స్కాలర్‌షిప్ మీకెలా గొస్తోంది?"

"అప్పుడే వస్తోందని అనేయకు. దానికి చాలా పెద్ద పోటీవుంది. మన సంస్థనించే ఇద్దరమునాం" అన్నాడు గోవిందరావు.

"ఇద్దరంటే యెవరు? బావేగదా. మీ యిద్దర్లో మీ ముందు బావెలాగూ చాలడు? అందుకేగా స్వయంవరంలో నేను మిమ్మల్నెన్నుకున్నాను?" అంది సునీత.

"అది నీ స్వయంవరం సంగతి. ఇక్కడంతా ఇంటర్వ్యూపైన ఆధారపడి వుంటుంది. రామస్వామి ఇంటర్వ్యూలు బాగా చేస్తాడు" అన్నాడు గోవిందరావు.

"అక్కడికి మీకు చేతకానట్టు. ఇంటర్వ్యూకమిటీలో మీ డైరెక్టరున్నాడుట గదా — ఆయనకు మీరంటే యెలాగూ అభిమానం" అంది సునీత.

"ఆయనకు నేనంటే కాదు. మా సంస్థంటే అభిమానం. మా ఇద్దర్లో ఒకరికి తప్పకుండా స్కాలర్‌షిప్ వస్తుంది. వచ్చినవాడు చాలా అదృష్టవంతుడు. రెండేళ్ల

ట్రయినింగు, నెలకు వెయ్యి డాలర్లు. జాగ్రత్తగావుంటే రెండేళ్ళలోనూ లక్ష రూపాయలు వెనకేసుకు రావచ్చు. అదీగాక మనమిద్దరమూ హీరో హీరోయిన్లలా ఫారిన్ జీవితం గడపొచ్చు'' అన్నాడు గోవిందరావు.

"అదిసరే, బావసంగతి చెప్పలేదు. నాకేదో భయంగా వుంది. అతనికి నామీద చిన్నప్పట్నించీ ఆశ వుందని మీకూ తెలుసు. అలాంటప్పుడు రోజల్లా అతనితో వంటరిగా ఉండడం నాకిష్టంలేదు'' అంది సునీత.

"నాకూ యిష్టంలేదు కానీ ఆ సంగతి చెప్పడానికి మొహమాటంగా ఉంది. అందుకింకేదయినా యేర్పాటు చేసుకోవాలి'' అని క్షణం ఆలోచించి, "లత తెలుసు గదా నీకు!'' అన్నాడు గోవిందరావు.

"మీ ఆఫీసులో పనిచేస్తున్న టైపిస్టు రాధ చెల్లెలేగా?''

"అవును. ఆమె కాలేజీకిప్పుడు సెలవులు. నీవంట్లో ఆరోగ్యంగా లేదనీ, నేను లేనంతసేపూ ఓ నాలుగు రోజులు నీకు కంపెనీగా ఉండమనీ రిక్వెస్ట్ చేస్తాను. లతకు నువ్వంటే చచ్చేటంత ఇష్టం. ఎగిరి గంతేసి ఒప్పుకొంటుంది'' అన్నాడు గోవిందరావు.

తీరుబడి సమయంలో పుస్తకాలు చదువుకోవడం సునీత అలవాటు. కబుర్లతో కాలక్షేపం చేయడం ఆమెకు చాలాచిరాకు. లతకు కబుర్లంటే చాలా ఇష్టం. ఇరవై నాలుగ్గంటలూ ఏదో ఒకటి వాగుతూ నేవుంటుంది. సునీతకు లతంటే బోరు. కానీ యిప్పుడు గత్యంతరమున్నట్లులేదు.

"ఏమిటో సరదాగా, సుఖంగా జీవిస్తున్నాం—''
అని నిట్టూర్చింది సునీత.

"ఇప్పుడు మాత్రం సరదాకీ, సుఖానికీ తక్కువేమి వచ్చింది?" అంటూ సునీతను దగ్గరగా తీసుకొన్నాడు గోవిందరావు.

# 6

సునీత చటుక్కున భర్తపక్కలోంచి లేచి, "పాల వాడొచ్చాడు" అంది.

"నువ్వు పడుకో, నేను వెళ్ళివస్తాను..." అన్నాడు గోవిందరావు.

"ఈ వేళ్టికలా కుదరదు. బావకు పెందరాళే కాఫీ అలవాటు."

"ఏమైనా చేయగలను కానీ ఈ త్యాగం మాత్రం చేయలేను" అన్నాడు గోవిందరావు. కానీ బట్టలు సరి చేసుకొని వెళ్ళిపోతున్న భార్యనతను వారించలేదు. ఏమైనా అతిథి మర్యాద గృహస్థ ధర్మంకదా!

సునీత పాలుపోయించుకు వచ్చేసరికి రామస్వామి స్నానం చేయడంకూడా ఐపోయింది. రాత్రి అతను ఫ్రీగా మసలడంకోసం అతనిగది తలుపుకు గొళ్ళెం వేయలేదామె. అతన్ని చూస్తూనే, "సారీబావా! లేచేసరికి ఆలశ్యమైపోయింది. నీకు పెందరాళే కాఫీ అలవాటు గదా!" అంది సునీత బాధగా.

"నా అలవాట్లింకా గుర్తున్నాయా నీకు!" అన్నాడు రామస్వామి ఆనందంగా.

"ఎందుకుండవు?" అని అక్కణ్నించి వెళ్ళిపోయింది సునీత. ఆమె కాఫీ కలిపేసరికి భర్త కూడా ముఖం కడుక్కొని వచ్చాడు. ముగ్గురూ కాఫీ తాగడమవగానే పని మనిషివచ్చి తలుపు తట్టింది. చటుక్కున తనగదిలోకి దూరాడు రామస్వామి. అప్పుడే సునీతకు గుర్తొచ్చింది

తనబావ పనిమనిషి కళ్ళబడకూడదని. ఐతే అదెలా సాధ్యం? అదిప్పుడు ఇల్లంతా తిరిగి ఊడుస్తుంది. అంట్ల గిన్నెలు తోముతుంది.

పోనీ అని బావగది ఊడవ్వద్దని చెబుదామంటే ఎందు కని అడుగుతుంది. అలాంటి అనుమానాలెవ్వరికీ రాకూడ దని బావన్నాడు. ఈ విషయాన్నామె రహస్యంగా భర్తనడిగితే "ఇందులో నీకు కంగారెందుకు? వాడి సంగతి వాడే చూసుకుంటాడు" అన్నాడు.

ఐతే ఆ తర్వాత జరిగిన విషయమామెకు నవ్వు పుట్టిం చింది. పనిమనిషి ఇల్లూడుస్తూంటే రామస్వామి తన చాకచక్యాన్నంతా ప్రదర్శించి గొల్లస్థంభాలాటలోలాగ గదులుమారి పనిమనిషికి తన ఉనికి గురించిన అనుమానం కలక్కుండా చూసుకొన్నాడు.

ఆ వింత సన్నివేశాన్ని సునీతతోపాటు గోవిందరావు కూడా ఆనందించి పనిమనిషి వెళ్ళిపోయాక "ఈ తమాషా అంతా దేనికో నాకూ చెప్పగూడదూ? విని ఆనందిస్తాను" అన్నాడు.

"మీకు తమాషాలాగుంది కానీ ఇది నాకు జీవన్మరణ సమస్య. చాలా కష్టాల్లో ఉన్నాను. ఇప్పుడేమీ చెప్ప లేను. అయిన వాళ్ళు..." అని అతనింకా ఏదో అనబో తోండగా _ "పొరబాటు నాదే _ ఇంక అడగనులే_" అన్నాడు గోవిందరావు.

పని మనిషి వెళ్ళి పోయేక సునీత త్వరత్వరగా వంట చేసింది. భోజనాలు ముగ్గురూ కలిసే జేశారు. గోవిందరావు వెళ్ళిపోబోయే ముందు రామస్వామిని గదిలో పెట్టి గొళ్ళెం వేయడం మరిచి పోలేదు.

భర్త వెళ్ళిపోగానే సునీత తొందరగా ఇల్లు సర్దుకుంది.

ఏ పని చేస్తున్నా గదిలో ఉన్న బావ ఆమె కళ్ళముందు మెదుల్తూనే ఉన్నాడు.

అతనిక్కడికి ఎందుకు వచ్చాడూ, ఏం చేయదల్చుకున్నాడు అన్న ప్రశ్నలకన్నా ఒంటరిగా ఒక్కడినీ గదిలోపెట్టి గొళ్ళెం వేశామన్న బాధ, జాలి ఆమెలో ఎక్కువగా ఉన్నాయి. అయితే తనకు తానై గొళ్ళెం జోలికి వెళ్ళదల్చుకోలేదామె. రామస్వామి ప్రమాదకరమైన మనిషని ఆమెకు తెలుసును.

భర్త వెళ్ళి అరగంటైనా లత రాలేదు. మొదటిరోజు_ అతనింకా వెళ్ళాలి. రాధతో మాట్లాడాలి. లతకు విషయం తెలియ జెయ్యాలి. రేపట్నించయినా ఆమె పెందరాళే రావచ్చు. లత గురించి అబద్ధం చెప్పాలనుకుంటున్నా ఆమె కిప్పుడు నిజంగానే ఒంట్లో బాగున్నట్లులేదు.

మరో అర్ధగంటకు రామస్వామి గదిలోంచి కొన్ని శబ్దాలు వినిపించాయి. అవి తనను పిలవడానికి సంకేతంగా సునీతకు తోచింది. కొద్ది క్షణాలు తటపటాయించి ఆమె ధైర్యం తెచ్చుకుని తలుపులు తీసింది.

“అర్జంటుగా మరుగు దొడ్డికి వెళ్ళాలి. నీకు శ్రమ ఇచ్చినందుకు మన్నించు_” అన్నాడు రామస్వామి. ఆమె జవాబు కోసం ఎదురు చూడకుండా అతను వేగంగా వెళ్ళిపోయాడు.

రామస్వామి పరిస్థితికి సునీతకు చాలా జాలి కలిగింది. ఆమె ఇంకా ఆ అవస్థలో ఉండగానే ఎవరో వీధి తలుపులు తట్టారు. సునీత వెళ్ళి తలుపులు తీసింది.

“నమస్కారమండీ!” అంటూ ప్రవేశించింది లత. సునీత ఆమెను చూస్తూనే నీరసంగా ముఖం పెట్టేసింది.

అందుకు నటన అవసరంలేదు. ఆ మనిషితో సాయంత్రం భర్త వచ్చేవరకూ వేగాలన్న భావన అప్రయత్నంగానే ఆమె ముఖంలోకి నీరసాన్ని తీసుకు వచ్చింది.

"మీరేమీ అనుకోకండీ - కబురు తెలియగానే ఉన్న దాన్ని ఉన్న పళంగా పరుగెట్టుకొచ్చాను. ఇంకా కొన్ని కాలకృత్యాలుండి పోయాయి.." అంది లత. ఆమె ముఖం చూస్తూనే ఆమె అవసర మేమిటో తెలిసి పోతోంది.

సునీత చెవులు సునిశితంగా పనిచేస్తున్నాయి. మరుగు దొడ్డికని వెళ్ళిన బావ ఇంకా వచ్చినట్లులేదు. ఇప్పుడు లతనెలా ఆపాలి?

సునీతకు మనుషుల్ని కబుర్లలో పెట్టి మభ్యపెట్టడం చేతకాదు. అయినా ఏదో ప్రయత్నంచేస్తూ లతను వంటింటి వైపుకు నడిపించింది. అలా వెళ్ళేటప్పుడు రామస్వామి ఉండే గది వైపు చూసింది. ఆ తలుపులింకా తెరిచే ఉన్నాయి. అంతసేపు అతను మరుగు దొడ్లో ఎందుకుండిపోయాడో అనుకుంది ఆమె మనసులో.

"ఇప్పుడు వంటిల్లు చేరవలసిన సమయం కాదండీ -" అని లత అక్కణ్ణించి చటుక్కున పరుగెత్తింది. ఆమెనెలా వారించాలో తెలియక సునీత ఊరుకుంది.

ఓ అయిదు నిముషాల అనంతరం లత ప్రశాంతంగా తిరిగి వచ్చింది. ఆమె ముఖంలో ఆశ్చర్యం, భయంలాంటి భావాలేమీ లేవు. ఆమె అంత ప్రశాంతంగా ఉండడం చూసి సునీత కాశ్చర్యం కలిగినా, ఆ ఆశ్చర్యాన్ని ప్రకటించుకునే దారి లేక ఊరుకున్నదామె.

తన మనసులోని అనుమానాన్ని నివృత్తి చేసుకోవడం కోసం ఆమె తనూ ఒకసారి బాత్రూం గదిలోకి

వెళ్ళింది. అది ఇంట్లో ఒకభాగంగా ఉంటోంది. బాత్రూం లెట్రిన్ కంబైన్డ్‌గా ఒక విశాలమైన గదిలో ఉన్నాయి.

సునీత ఆ గదిలోకి వెళ్ళి వెళ్ళగానే అక్కడ రామస్వామి కనిపించాడు. ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. తలుపులు వేయమన్నట్లు సౌంజ్ఞ చేశాడతను. అప్రయత్నంగా తలుపులు వేసిందామె. రామస్వామి ఆమెను సమీపించి–"ఆ అమ్మాయెవరు? ఎందుకొచ్చింది?" అని నెమ్మదిగా అడిగాడు.

సునీత చెప్పింది. రామస్వామి ముఖం ఎర్రబడింది – "నానుంచి రక్షణ కోరుతున్నా వన్నమాట!" అన్నాడు.

"భర్త చాటు ఆడదాన్ని. ఆయన కనుమానం రాకుండా కాపాడు కోవడం నాకు అవసరం –" అంది సునీత.

"గోవిందరావీ విధంగా నీకు కాపలా పెట్టడం నిన్నూ నీ మంచితనాన్నీ అవమానించినట్లు ఫీలవడం లేదా నువ్వు?" అన్నాడు రామస్వామి.

"లేదు –" అంది సునీత.

"కానీ ఇది నాకు అవమానమే! స్వయానా మరదలువి నువ్వు. అయినా పెళ్ళి చేసుకోలేకపోయాను. నీ ఇంటికి ఆశ్రయం కోరి వచ్చాను. గదిలో బందీనయ్యాను. అంతే కాదు. ఓ ఆడపిల్ల కాపలా కూడా." అన్నాడు రామస్వామి "సునీతా – ప్లీజ్! అసలే కష్టాల్లో ఉన్న నేను ఈ అవమానాన్ని భరించలేను.ఆ పిల్లను పంపించేసేయ్."

"అది సాధ్యం కాదు –" అంది సునీత.

"సాయంత్రం నీ భర్తతో ఈ విషయం మాట్లాడతాన్లే. ఇలాంటి విషయాల్లో నీకంటె వాడే నయం!" అన్నాడు రామస్వామి.

"ఆ పిల్ల బాత్రూంలోకి వస్తే కళ్ళబడకుండా ఎలా తప్పించుకున్నావ్?" అంది సునీత.

"అది నువ్వడక్కూడదు. నేను చెప్పకూడదు. దీన్ని బట్టి నాశక్తి సామర్థ్యాలు తెలుసుకో. నేను నిన్నేదైనా చేయదల్చుకుంటే - ఆ పిల్ల ఉన్నా చేయగలను -" అన్నాడు రామస్వామి.

"సరే కానీ - రోజల్లా లెట్రిన్లో ఉంటే మాకు చాలా ఇబ్బంది. నువ్వు నీ గదిలో కెళ్ళి తలుపులు కేర వేసుకుంటే, ఎలాగో అలా నేను వచ్చి గొళ్ళెం పెట్టేస్తాను. కానీ లత తిన్నగైనది కాదు. ఇల్లంతా తిరుగుతుంది. నీ గదిలోకి మేము రావాలనుకుంటే గొళ్లెం కాస్త చప్పుడు చేస్తాను. ఏ మంచం క్రిందకైనా దూరు-" అంది సునీత.

ఆమె రామస్వామి జవాబు కోసం ఆట్టే ఎదురు చూడకుండా బయటకు వెళ్ళింది. తర్వాత లతను తీసుకుని వంటింట్లోకి వెళ్ళింది. వెంటనే కబుర్లు మొదలుపెట్టేసింది లత.

"కాస్త కాఫీ పుచ్చుకుంటారా? లేకపోతే భోంచేసేస్తారా?" అంది సునీత.

లత దానికి వెంటనే సరైన జవాబివ్వలేదు. తనకు కాఫీ ఎంతగా అలవాటై పోయిందో, ఎన్నిసార్లు తాగినా తనకు మామూలుగానే ఎలా ఉంటుందో, భోజనానికి కాఫీ ఎలా అడ్డురాదో వగైరాలు చెబుతూ వాటికి సపోర్టుగా ఉదాహరణలు కూడా చెబుతోంది.

"అయితే కాఫీ కలుపుతాను. తర్వాత భోంచేద్దురుగాని" అంది సునీత.

"అలాగే కానీ - అసలే మీకు ఒంట్లో బాగోలేదు,

మీరు నాకు కాఫీ కలిపివ్వడమేంటి? మీరలా కూర్చోండి. నేను కాఫీ కలుపుకు తాగేస్తాను. బైదిబై మీకూ_డా" అని లత ఇంకాయేదో అనబోతూండగా "రోజుకు రెండుసార్లే నేను కాఫీ తాగుతాను. రెండుసార్లకూ ఓ పూటైనా గ్యాపుండాలి" అంది సునీత.

"అంటే మా పెద్దమ్మగారిలా అన్నమాట!" అంటూ లత తన పెద్దమ్మగారి గురించి చెప్పడం మొదలుపెట్టింది. ఈలోగా సునీత వెళ్ళి రామస్వామి వున్న గదితలుపులు వేసివచ్చింది. లత ఆమెకు వినబడేలా స్వరంపెంచి మాట్లాడుతూనేవుంది.

# 7

"నాకు కాపలాగా లతని పెట్టడం నాకు నచ్చలేదురా" అన్నాడు రామస్వామి.

గోవిందరావు తడబడి "అబ్బే అలాంటిదేమీలేదు. సునీతకు నిజంగానే వంట్లో బాగుండడంలేదు. సాయంగా ఉంటుందని లతకు కబురుపెట్టాను. ఇది మాకు కొత్త కాదు" అన్నాడు.

"కానీ ఇప్పుడు సునీత ఆరోగ్యం బాగానే వున్నదని నా అనుమానం. నిజంగా బాగోలేకపోయినా__నేను ఇంట్లోకి వచ్చినప్పుడే లతని పిలిపించడం నాకూ, సునీతకూ కూడా అవమానం."

"నాకేమీ అవమానంలేదు"అంది సునీత ఖచ్చితంగా.

"అవేం మాటలు సునీతా!" అన్నాడు గోవిందరావు. అతను క్షణం ఆలోచించి "సరే నిన్ను బాధ పెట్టడం నాకిష్టంలేదు. రేపట్నించి లత రాదు."

"నువ్వుచాలా మంచివాడవురా. నువ్వు నన్నుగదిలో పెట్టి తలుపు గొళ్ళెం వేసేయ్. మళ్ళీ నువ్వు తిరిగొచ్చే

దాశా గదిలోనే వుంటాను'' అన్నాడు రామస్వామి.

''అదిమాత్రం నీకూ అవమానంకాదా!'' అన్నాడు గోవిందరావు.

''కాదు. ఎందుకంటే ఇంట్లో ఫ్రీగా తిరగటం నాకూ ఇష్టంలేదు. ఇంట్లో ఇంకో మనిషున్నాడన్న భావం ఎవరికీ కలగకూడదు. లతను నువ్వు బయటనుంచి రప్పించడంవల్ల ఈ ఇంట్లో నా ఉనికి గురించి అనుమానం రేకెత్తే అవకాశంకూడా వుంది. అదే_సునీత యే పొరుగింటి పుల్లమ్మతోనో కబుర్లు చెబుతూ కూర్చుంటే నాకు అభ్యంతర ముండదు'' అన్నాడు రామస్వామి.

''అసలేం జరిగింది. ఎందుకిదంతా?'' అన్నాడు గోవిందరావు.

''చాలా కష్టాల్లో వున్నాను. ప్రస్తుతానికేమీ చెప్పలేను. వినవాళ్ళు...''

''సరేలే'' అన్నాడు గోవిందరావు. తన విసుగును బయటకు ప్రదర్శించకుండా మనసులోనే దాచుకున్నాడు.

రాత్రి భోజనాలై పడుకున్నాక ''నాకేదో బెంగగా ఉంది'' అంది సునీత భర్తతో.

''రేపు ఆఫీసుకు వెళ్ళేప్పుడే చెప్పేస్తాను లతను రావద్దని. వాడు చాలా అఫెండవుతున్నాడు'' అన్నాడు గోవిందరావు.

''మీరుమాత్రం సందేహించకుండా గదికి గొళ్ళెం పెట్టి మరీ వెళ్ళండి'' అంది సునీత.

మర్నాడలాగే చేసి వెళ్ళాడు గోవిందరావు. అతను వెళ్ళేక పనులు చూసుకుని ఓ నవల చదువుతూ కూర్చుంది సునీత. చాలావరకు రామస్వామి గదిలోంచి అలికిడేమీ వినపడలేదు. నవలమీద బాగా దృష్టిపడ్డాక రామస్వామి

గదిలోంచి సంకేత శబ్దం వినిపించింది సునీతకు. సునీత వెళ్ళి గొళ్ళెం తీయబోయింది.

"తలుపు తీయక్కర్లేదు. కాస్త కాఫీ తెచ్చిపెట్టు-చాలు" అన్నాడు రామస్వామి.

తలుపు తీయకుండానే సునీత వెనక్కు వెళ్ళింది. మధ్యాహ్నానికని ఆమె ఫ్లాస్కులో పోసిన కాఫీసిద్ధంగా ఉంది. అది ఓ గ్లాసులోపోసి ఆమె మళ్ళీ గదిదగ్గరకు వచ్చి గొళ్ళెంతీసి తలుపులు తోసింది.

సునీత తలుపులు తోసేసరికి లోపల యెవ్వరూ కన బడలేదు. ఆమె గదంతా పరీక్షించి ఆఖరికి మంచంకింద కూడా చూసింది. రామస్వామి గదిలో లేదు.

# 8

సాధారణంగా గోవిందరావూ,గోపీనాథ్ మధ్యాహ్నం గోవిందరావు ఆఫీసు కెదురుగా ఉన్న కాంటిన్ లో కలుసుకుని కాఫీ తాగుతుంటారు. వారు చిన్ననాటి నుండి స్నేహితులు కాకపోయినా, గత ఆరు నెలలుగా అనుకోకుండా పరిచయ మైనప్పట్నించీ ఆ ప్రమిత్రుల్లా మసలుకుంటున్నారు. గోపీనాథ్ పోలీస్ ఇన్ స్పెక్టర్.

ఆరోజుకూడా ఇద్దరూ యెప్పటిలాగే కబుర్లు చెప్పు కుంటూండగా అక్కడికి హఠాత్తుగా రామస్వామి వచ్చేడు. అతన్నిచూసి గోవిందరావు చాలా ఆశ్చర్య పడ్డాడు. అత నేదో అనబోతూండగా రామస్వామి తనే చొరవగా "హలో గోవిందరావ్! ఇక్కడుంటావని అనుకున్నాను. అర్జంటుపనిమీద ఈ ఊరొచ్చాను. ఇంకో అరగంటలో వెళ్ళిపోతాను. మీ యింటికి రాలేక పోయినందు సునీత నేమీ అనుకోవద్దని చెప్పు. ఈముక్క చెప్పడం కోసమే నీ దగ్గరకొచ్చాను" అన్నాడు.

గోవిందరావు పరిస్థితి నర్థం చేసుకున్నాడు. రామస్వామికి సహాయపడే ఉద్దేశంతో "వారం రోజులుగా నీకోసం యెదురుచూస్తున్నాం. నువ్వు రాకపోతే సునీత ఏమయినా అనుకుంటుంది. ఓసారి ఇంటికి వెళ్లకూడదూ?" అన్నాడు.

"కుదిరితే తప్పక వెళ్ళివుండేవాడినే కదా" అని వెళ్ళిపోయాడు రామస్వామి.

"ఎవరతను?" అన్నాడు గోపీనాథ్.

చెప్పాడు గోవిందరావు. తనకూ, రామస్వామికీ మధ్య జరుగుతున్న కథ చెప్పాలా అనిపించింది గోవిందరావుకి. ఐతే యెంత మిత్రుడయినప్పటికీ గోపీనాథ్ పోలీస్ ఇనస్పెక్టరన్న విషయం గుర్తుకువచ్చి ఆ కోరిక బలవంతాన చంపుకున్నాడతను.

ఆ సాయంత్రం అతను ఇంటికి వెళ్ళగానే భార్యతో "రామస్వామి వచ్చాడా?" అనడిగాడు. సునీత అతని వంక ఆశ్చర్యంగా "బావ యింట్లో లేడని మీ కెలా తెలుసు?" అనడిగింది.

గోవిందరావు భార్యకు తన అనుభవం చెప్పేక, సునీత తన అనుభవం భర్తకు చెప్పింది.

"ఐతే నువ్వు తలుపు తీయకుండా రామస్వామి మాయమయ్యాడంటావ్? ఇది నేను నమ్మలేను. ఇంకా నీతో చెప్పి యెలాగో బయటపడ్డాడని అనుకుంటున్నాను..." అన్నాడు గోవిందరావు.

"అదెలా సాధ్యమో మీరే చెప్పాలి. రండి, ఆ గదికి కెడదాం" అంది సునీత. ఇద్దరూ ఆ గది దగ్గరకు వెళ్ళగానే, "వాడు లేకపోయినా గదికి గొళ్ళెమెందుకు?" అన్నాడు గోవిందరావు.

"ఆ గదికి గొళ్లెం పెట్టే అలవాటు మనకు యెప్పుడూ ఉన్నట్లుండాలికదా."

"బాగా నేవుంది" అంటూ గొళ్లెం తీసాడు గోవింద రావు. అతను తలుపులు తీయగానే, "హలో-కులా సానా?" అంటూ పలకరించాడు రామస్వామి.

అతన్ని లోపల చూస్తూనే భ్రాన్తపడిపోయింది సునీత. గోవిందరావు రామస్వామివైపూ, సునీతవైపూ మార్చి మార్చి చూసాడు. భార్యముఖంలో కొట్టవచ్చినట్లు కన బడుతున్న ఆశ్చర్యం అతన్ని విచలితుణ్ణి చేసింది.

"ఏమిటీ మాయ? గదిలోనుంచి యెలా మాయ మయ్యావ్. మళ్ళీ తిరిగి ఎలావచ్చావ్?" అంది సునీత.

"అవి నాకు సంబంధించిన జాగ్రత్తలు." అన్నాడు రామస్వామి.

"బాగా నేవుంది కానీ, ఈరోజు నీ సంగతేమిటో తేల్చిచెప్పు. చాలా కష్టాల్లో వున్నాను. అంటూ పాత పురాణాలు విప్పకు. మా ఇంట్లో నాలుగురోజులుండ దల్చుకున్న పక్షంలో ఏ ఉద్దేశ్యంతో నువ్వు మా ఇంట్లో చేరినదీ చెప్పాలి" అన్నాడు గోవిందరావు.

"ఈరోజు రాత్రి భోజనాలవద్ద అన్నీ చెబుతాను. కానీ నేను ఎంత చెబితే అంతే వినాలి. అంతకంటే యెక్కువ అడక్కూడదు" అన్నాడు రామస్వామి.

"ఎంతో కొంత - అసలంటూ మొదలు పెడితే!" అన్నాడు గోవిందరావు.

భోజనాల కూర్చున్నప్పుడు రామస్వామి ముక్త సరిగా అన్నాడు. "నన్నిప్పుడీ పనిమీద మన ఆఫీసే నియోగించింది. ఒక దేశద్రోహి బండారం బయటపెట్టే ప్రయత్నంలో వున్నాను. నా సమాచార ముపకరించేది

పోలీసులకే అయినా, ప్రస్తుతం పోలీసులక్కూడా నేనేం చేస్తున్నానో తెలియకూడదు. ఇలా యింకా మూడురాత్రులు గడిపితేచాలు. ముచ్చటగా మూడు రాత్రులు...ఆ తర్వాత నేననుకున్న పని సాధించగలుగు తాను..."

సునీత మనసులో "క్షణక్షణమూ గండంగా ఉన్న ఈ మనిషితో ఇంకా మూడురోజులు గడపడం కష్టం. ఏమైనా ఈరాత్రి ఆయనకు నచ్చచెప్పి బయటకు పంపించే యాలి. రేపట్నించి ఫ్రీగా ఉండాలి" అనుకుంది.

గోవిందరావు భోజనం పూర్తిచేసి, "నాకు నిద్ర వస్తోంది..." అన్నాడు. సాధారణంగా ఎదుటివ్యక్తితో మాట్లాడ్డం యిష్టం లేనప్పుడు అతనలాగంటాడు. ఆ విషయం తెలిసిన సునీత మనసులో నవ్వుకుంది.

గోవిందరావు, రామస్వామి తమతమ గదుల్లోకి వెళ్ళి పోయారు. సునీత వంటిల్లు సర్దుకుని పడుకోబోయేముందు నీరసం తగ్గడానికి తను తీసుకుంటున్న టానిక్ తాగింది. అది రోజులా లేదని ఆమెకు అనిపించింది. ఆమె నిద్ర పోవడానికి వెళ్ళేసరికి గోవిందరావు మంచి నిద్రలో వున్నాడు. ఆమె యెంత ప్రయత్నించినా అతను లేవ లేదు. ఆమెకు వళ్ళంతా తేలిపోతున్నట్లుగా యేదోలా వుంది.

అదే సమయంలో గదిలో బెడ్ లైట్ ఆరిపోయింది. తిరుగుతున్న ఫ్యాను ఆగిపోయింది. గదంతా చిమ్మచీకటి. కళ్ళు పొడుచుకున్నా ఏమీ కనబడటంలేదు. ఆ సమయంలో యెవరో ఆమెగది తలుపుతట్టారు.

సునీత తలుపుదాకా వెళ్ళి "బావా" అంది.

"ఔను – నేనే – ఒక్కసారి తలుపు తీస్తావా?" అన్నాడు రామస్వామి.

సునీత తలుపుతీసింది.

"ఇంట్లో బ్యాటరీ లైటుందా?" అన్నాడు రామస్వామి.

"లేదు..." అంది సునీత.

"ఐతే యెలా? నేను బాత్రూమ్‌కి వెళ్ళాలి. ఇల్లంతా చిమ్మ చీకటిగావుంది" అన్నాడు రామస్వామి.

"ఐతే మా మంచం దగ్గర తలుపుదిక్కున ఉన్న బల్ల మీద అగ్గిపెట్టె ఉండాలి. ఈ చీకట్లో నేనవన్నీ వెతికి తేలేను. నేను గుమ్మందగ్గర నించుంటాను. నువ్వు అగ్గిపెట్టె తెచ్చుకో..." అంది సునీత.

రామస్వామి తడుముకుంటూ మంచం దగ్గరకు వెళ్ళాడు. అక్కడ ఒకటి రెండు నిముషాలు తచ్చాడాడు.

"ఏం చేస్తున్నారక్కడ?" అంది సునీత.

"అగ్గిపెట్టె దొరకలేదు" అన్నాడు రామస్వామి.

సునీత కదిలి తనూ మంచం దగ్గరకు వచ్చింది. అప్పుడే ఆమెకు వెళ్ళిపోతున్న రామస్వామి అడుగుల చప్పుడు వినిపించింది. "అగ్గిపెట్టె అక్కర్లేదులే, నే పోతున్నాను" అన్న రామస్వామి మాటలు గుమ్మం అవతలనుంచి వినిపించాయి.

సునీత వెళ్ళి తలుపులు వేసేసింది. మళ్ళీ ఆమె మంచం మీదకు వచ్చేసింది. నిజం చెప్పాలంటే రామస్వామి అక్కడున్నంత సేపూ ఆమె మనసును నిగ్రహించుకొంది. శరీరమంతా ఏదో తేలిపోతున్నట్లు ఉందామెకు. మంచం మీద పడుకుని భర్తకు దగ్గరగా జరిగింది. అతనిమీద చేయివేస్తే ఈ పర్యాయం కొద్దిగా కదిలాడతను.

సునీత భర్తను తనవైపుగా తిప్పుకుంది. బలంగా దగ్గరగా హత్తుకుంది. అతనిలో చలనం కలుగుతున్నట్లుగా గుర్తించి ఉత్సాహంగా "ఏయ్!" అంది భర్త చెవిలో.

# 9

మరునాడు గోవిందరావు రామస్వామిని గదిలో పెట్టి తలుపు గొళ్లెం పెట్టి వెళ్ళిపోయాడు.

సునీత చిల్లరపనులన్నీ పూర్తిచేసుకుని ఓ నవల పట్టుకొని కూర్చుంది. ఆలోచనలన్నీ రామస్వామిమీదనే ఉండడం వల్ల ఆమె నవలమీద దృష్టి పెట్టలేకపోయింది. కాసేపటికి రామస్వామి గదిలోంచి పిలుపు రానేవచ్చింది.

పిలుపు వినగానే సునీతకు భయంవేసింది. రామస్వామి దగ్గరకు వెళ్ళడం ఆమెకంత ఇష్టంలేదు. మనసులో కాస్త భయంకూడా లేకపోలేదు. ఐనా మొండి ధైర్యంతో లేచివెళ్ళి అతని గది గొళ్లెం తీసిందామె.

"ఇలారా, నీకో ముఖ్యవిశేషం చెప్పాలి" అన్నాడు రామస్వామి.

సునీత అతన్ని సమీపించి, "ఏమిటది?" అంది.

"మొదటిరాత్రి బాగా సుఖపెట్టావు నన్ను. రెండో రాత్రి యింకా రంజుగావుండాలి" అన్నాడు రామస్వామి.

సునీత ముఖం యెర్రగా అయిపోగా, "ఏమిటి నువ్వనేది?" అంది.

"రాత్రి అగ్గిపెట్టెకోసం అడిగినట్లు నీ గది తలుపులు తీయించానా-తర్వాత నేనా గదిలోంచి వెళ్ళలేదు. నీతో ఖుషీ చేశాను." అన్నాడు రామస్వామి తాపీగా.

"పిచ్చిపిచ్చి మాటలాడకు" అంది సునీత కోపంగా.

"ఋజువులున్నాయి. ఉదయం నువ్వు లేచేసరికి నీ గది తలుపులు తీసివున్నాయా, లేదా?" అన్నాడు రామస్వామి.

ఆ మాట నిజమే కావటంతో సునీత తడబడింది. తలుపులు దగ్గరగా వేసివున్నా గడియతీసి వుంది. బహుశా

భర్త ఏ రాత్రయినా బయటకు వెళ్ళి మళ్ళీ వేయడం మర్చి పోయుంటాడేమో ననుకుంది కానీ దాన్ని గురించి అంత సీరియస్‌గా ఆలోచించలేదు.

"ఆ తర్వాత, కరెంటు పోయింది చూశావా, అది మన ప్రతాపమే. మెయిన్ ఆఫ్ చేశాను" అన్నాడు రామస్వామి.

సునీత ముఖంలో కంగారు కనపడింది.

"కరెంట్ పోగొట్టి తలుపుతట్టాను. నీ మొగుడు తాగే మంచినీళ్ళలో నేను కలిపిన మత్తుమందు అతనికి గాఢనిద్ర రప్పించింది. అగ్గిపెట్టె వంకతో నీ గదిలోకి వచ్చి, నీ మొగుణ్ణి జాగ్రత్తగా మంచం దింపి కింద పడుకోబెట్టాను. వెళ్ళిపోతున్నట్లు నటించి గదిలోనే ఉండిపోయి, మంచంమీద నీ మొగుడు స్థానంలో పడుకున్నాను. నువ్వు తాగేమందులో నేను కలిపిన బ్రాందీ బాగానే పనిచేసింది. మంచి నిషాలోవున్న నీకు నేను నీ మొగుడిలాగే అనిపించాను. లేడా గుర్తించే తెలివీ, ఓపికా కూడా నీలో నశించాయి...."

రామస్వామి చెబుతూంటే, "నువ్వింత దుర్మార్గుడివని నేననుకోలేదు..." అంటూ సునీత కూలబడిపోయి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

రామస్వామి ఆమెను సమీపించి కళ్ళుతుడిచి "జరిగిందెలాగూ జరిగిపోయింది. ఇదేమీ నీ మొగుడుకి తెలియదు. నేను చెప్పను. జీవితంలో ఓ రెండ్రోజులునన్ను సుఖపెట్టు" అన్నాడు.

"దుర్మార్గుడా, అబద్దాలు చెప్పి నన్ను వశపర్చుకుందామనుకుంటున్నావా?" అంది సునీత కొద్దిగా వెక్కుతూనే.

"నేను చెప్పేవి అబద్ధాలుకావని నీకూ తెలుసు. ఐనా మనసును మభ్యపెట్టుకుందుకు ప్రయత్నిస్తున్నావు. తిరుగు లేని ఇంకో రెండుసాక్ష్యాలు చెబుతాను. నీ వీపుకు కాస్త క్రిందుగా సిరాతో నీపేరు రాశాను. నీ పరికిణీమధ్యలో చిన్న ముక్క కత్తిరించి నా దగ్గరుంచుకున్నాను. ఇంకా చెప్పాలంటే..."

అతను చెబుతూంటే వినలేక చెవులు మూసుకున్నా సునీత బలం తగ్గిపోయింది. ఐదు నిముషాల్లో అతను చెప్పినవన్నీ నిజమని ఆమె గ్రహించేసింది. ఆమె ఆ కఠోర సత్యాన్ని గ్రహించేక అతనామెను దగ్గరగా లాక్కుని ముద్దుపెట్టుకుంటే ఆమె వారించనయినా వారించలేకపోయింది.

"నేను నీకు వరసకు బావను. నిన్ను పెళ్ళి చేసుకో వాలనుకున్న వాణ్ని. అయిదు భర్తలున్న ద్రౌపది ఎలా చెడ్డదికాదో నువ్వూ అంతే. ఈ రెండురోజులూ నన్ను సుఖపెట్టు. మళ్ళీ నిన్నిలాటి కోరకలు కోరను" అన్నాడు రామస్వామి.

"నాకు తెలియనిస్థితిలో చేసిన తప్పు తెలిసి చేయ లేను" అంది సునీత.

"చేయక తప్పదు. ఇది నా ఆజ్ఞ. నేనిప్పుడు నీ భర్తను" అన్నాడు రామస్వామి.

సునీత అతని ధైర్యంచూసి ఆశ్చర్యపోయింది. ఒక నాడు బలవంతంగా తన చేయిపట్టుకునేందుకు భయపడ్డ బావకు తనీనాడు యెంత లోకువయిపోయింది?

"నా బ్రతుకన్యాయమైపోయింది" అంటూ మళ్ళీ ఏడ్చింది సునీత.

"అలా నాకనిపించడంలేదు. అన్యాయమంటూ జరి గితే అది నాకే జరిగింది. ఏడుపులు కట్టిపెట్టి యీ రెండు

రోజులూ నన్ను బాగా సుఖపెట్టు. ఆ తర్వాత నా బాధ నీకుండదు'' అన్నాడు రామస్వామి.

ఆ సాయంత్రం భర్తతో యెప్పటిలా ఫ్రీగా ఉండలేకపోయింది సునీత.

ఆమె మనసులో రకరకాల భావాలు కదలాడుతున్నాయి. శారీరకంగా తను మలినమైపోయింది. తన ఇష్టానికి వ్యతిరేకంగా తనింకో మగవాడితో భర్తతో మసిలే విధంగా మసిలింది. ఇప్పుడేం చేయాలి తను? జరిగింది భర్తకు చెప్పి క్షమార్పణ అడగాలా? లేక యేమీ యెరుగనట్లు ఊరుకోవాలా?

జరిగింది తెలిస్తే భర్త తనను క్షమిస్తాడన్న నమ్మకమామెకు లేదు. చెప్పకపోతే మనసులో ఏదో బాధ!

ఒకవేళ భర్త తనకులాంటి తప్పు చేస్తే!

ఈ ఆలోచన వచ్చేక సునీత మనసు తేలికపడింది. ఇలాంటి తప్పులు చేసిన చాలామంది మగవాళ్ళ గురించి ఆమె వింది, వాళ్ళందర్నీ భార్యలు క్షమించారు. కానీ ఇలా తప్పు చేసిన ఏ ఆడదీ భర్త చేత క్షమింపబడలేదు. కారణమేమిటి? సమాజంలో ఆడదానికున్న స్థానమా?

తనకుతానై ఏ తప్పు చేయలేదు కాబట్టి తను మంచిదేనని సునీత అనుకుంది. కానీ ఈరోజు రాత్రి మాత్రం తనకు తానై తప్పు చేయాలి. ఇలా యింకా రోజని అంటున్నాడు బావ. కానీ అలా అని నమ్మడానికిలేదు. ఒకసారి రుచి మరిగిన మగవాడు మళ్ళీమళ్ళీ ప్రయత్నిస్తూనే వుంటాడు.

అయినా ఆడది యెంత బలహీనురాలు? ఇష్టం లేని మగవాడికి ఒకసారి లొంగిపోయాక, మళ్ళీ ప్రతిఘటించక పోవడమేమిటి? అందుకు బలహీనత, జాలి, కరుణ, ప్రేమ–వీటిలో ఏమిటి కారణం?

# 10

'కావ్య' మన్నాడు గోవిందరావు.

మంచంమీద సునీత. సునీత గుండెల్లో కత్తి. ఆమె శరీరం మంచుకంటె చల్లగా వుంది.

"సునీతా!" హృదయవిదారకంగా అరిచాడు గోవిందరావు. ఒక్క క్షణంలో అతను తేరుకుని గదిలోంచి బయటకు వచ్చాడు. రామస్వామి కోసం చూశాడు. ఆ గదిలో అతను లేడు. అతని ఆలోచనలు పరిపరి విధాల పోయాయి.

ఆదేపనిగా పాలవాడు తలుపు తడుతూంటే గోవిందరావుకి మెలకువ వచ్చింది. మత్తుకళ్ళు విడకుండానే— "నువ్వు కదలకు సునీతా, నేను వెళ్ళి పాలు పోయించుకు వస్తాను" అని కళ్ళు తెరిచాడు. కళ్ళముందు కనబడ్డ భయంకర దృశ్యమది!

గోవిందరావు పరుగెత్తుకుని వీధిగుమ్మం దగ్గరకు వెళ్ళి పాలవాడితో, "హత్య!" అని అరిచి అక్కణ్ణించి వీధిలో కెళ్ళిపోయాడు. పాలవాడు తెల్లబోయి కంగారుపడి చేతిలోని పాలచెంబు ఎత్తేశాడు.

ఓ అరగంటలో గోవిందరావు పోలీసుల్ని వెంటబెట్టుకుని వచ్చాడు. ఇన్‌స్పెక్టర్ గోపీనాథ్ అతనితోపాటు వచ్చాడు.

పోలీసులు ఇల్లంతా తిరిగారు. రకరకాలుగా పరిశోధించారు.

"నా అనుమానం రామస్వామిపైనే వుంది. గతకొద్ది రోజులుగా అతడు మా యింట్లోనే వుంటున్నాడు..." అన్నాడు గోవిందరావు.

గోవిందరావు వంక చిత్రంగా చూశాడు గోపీనాథ్, "రామస్వామి ఎవరు?"

రామస్వామి కథ చెప్పాడు గోవిందరావు.

గోపీనాథ్ హత్యగురించి ఆచూకీ తీయడంకోసం పాల వాడినీ, పనిమనిషినీ, చుట్టుప్రక్కలవాళ్ళనూ రకరకాల ప్రశ్నలు వేశాడు. పనికివచ్చే సమాచారమేదీ లభించ లేదు. కానీ ఆయింట్లో భార్యాభర్తలను మినహాయిస్తే మూడోవ్యక్తి యెవరూవున్నట్లు యెవ్వరికీ తెలియదు.

"రామస్వామి అంటే ఒకవేళ ఆరోజు మనకు కన బడిన వ్యక్తియేనా?" అంటూ గోపీనాథ్ అడిగాడు గోవిందరావుని. అతను అవునన్నాడు.

"మిస్టర్ గోవిందరావ్! నీ నోటితో నువ్వే చెప్పావ్ అసలుసంగతి. అతను నీ యింటికికూడా రాలేదన్నావు. ఊళ్ళోలేడని చెప్పావు...నీ కథ కొంచెం అనుమానంగా వుంది. నీపట్ల నాకు సానుభూతి ఉన్నప్పటికీ నా బాధ్య తను తాత్కాలికంగా నిర్వహించక తప్పదు. నువ్వు పోలీస్ స్టేషన్‌కి రావాలి..." అన్నాడు గోపీనాథ్.

గోవిందరావు తెల్లబోయి "వాట్...ఇన్స్పెక్టర్ నేను నా ప్రాణానికి ప్రాణమయిన సునీతను హత్య చేస్తానా?" అన్నాడు. ఊహించుకుందు కూడా ఆ విషయం భయంకరంగా ఉన్నట్లు అతని ముఖంచూస్తే తెలుస్తుంది.

"అలాగని నేననడంలేదు. కానీ..." అని ఊరు కున్నాడు గోపీనాథ్.

అయితే ఆ తర్వాత గోవిందరావుపైన కేసు బలపడింది. ఆ యింట్లో మూడోమనిషి మసిలిన ఛాయవున్నట్లు లేదని అంతా అన్నారు. గోవిందరావు గోపీనాథ్‌తో అన్న మాటలూ విషయాన్నింకా బలపరుస్తున్నాయి. ప్రస్తుతం రామస్వామి ఊళ్ళోలేడు.

సునీత హత్య చేయబడిన కత్తిపిడిమీద గోవిందరావు వేలిముద్రలు మాత్రమే ఉన్నాయి. ఆ ఇంట్లో రామస్వామి మసిలాడని గోవిందరావు చెబుతున్న ప్రాంతాల్లో వున్న వేలిముద్రలు ఒక్క పనిమనిషివి మాత్రమే.

గోవిందరావు మనసులో "రామస్వామీ! సునీత అంటూండేది నీకు మా ఇద్దరిపైనా పగవున్నదని. పకడ్బందీగా నువ్వు పథకం వేసుకుంటూంటే అందుకు తెలివి తక్కువగా మా పూర్తి సహకారాన్నిచ్చాము. సునీత, నేనుకూడా ఈ దెబ్బతో ఫినిష్! అయినా సునీత చనిపోయాక నాకుమాత్రం ఈ లోకంతో పనియేముంది?" అనుకున్నాడు. ఆ తర్వాత అతను తనగురించి యింకేమీ చెప్పుకోలేదు.

గోపీనాథ్ కు కొరకనిదల్లా ఒక్కటే. హత్యకు కారణం! అది గోవిందరావుని అడిగితే, "సునీతవంటి ప్రాణప్రదమైన మహా ఇల్లాలిని నేను చంపేనన్న ఆరోపణ వచ్చినప్పుడు అంగీకరించమంటే అంగీకరించగలను కానీ, కారణం ఏమి కల్పించి చెప్పగలను? అదీ నువ్వే వెతుకు. ఆమె శీలానికి కళంకం ఆపాదించనంత కాలం అది ఏ కారణమైనా అంగీకరిస్తాను" అన్నాడు.

ఆ సమయంలో రామస్వామి ఊరినుంచి తిరిగివచ్చాడు. జరిగిన హత్యసంగతి విని గుండెలు బాదుకున్నాడు. గోవిందరావును కలుసుకుని, "నీ అనుమానంతో యెంత పని చేశావురా?" అన్నాడు. ఆశ్చర్యంగా గోపీనాథ్ అడిగినదానికి, "అవును ఇన్స్పెక్టరుగారూ_సునీత పరమ పతివ్రత అయినా వీడికి మా ఇద్దరిమీదా అనుమానం. వరసకు బావను కావడమూ, కలసి ఒకింట్లో పెరగడమూ అందుకు కారణాలు. వీడి అనుమానాల కారణంగానే

నేను సునీత యింటికి వెళ్ళడంకూడా మానుకున్నాను. ఏదో ఒకరోజున ఈయన నన్ను చంపినా చంపేస్తారు. ప్రతిరోజూ మనకేదయినా సంబంధముందా అని అడిగి వేధిస్తూంటారు_ అని ఓ పర్యాయం సునీత నా దగ్గర భోరున ఏడ్చింది'' అన్నాడు రామస్వామి.

గోపీనాథ్‌కిప్పుడు విషయం పూర్తిగా అర్థమయినదని పించింది. రామస్వామి మాటలతనికి నమ్మదగ్గవిగా తోచాయి. ''ఇంటికి రాలేనందుకు సునీతనేమీ అనుకో వద్దని చెప్పు'' అని అతను తనకళ్ళముందే ఓ పర్యాయం గోవిందరావుకు చెప్పాడు.

సునీతకూ రామస్వామికీ సంబంధముందన్న అనుమానం గోవిందరావులో బలంగావుంది. రోజూ దానిగురించే వేధి స్తూండేవాడు. ఒకపర్యాయం ఆమె విసిగిపోయి, ''ఔను ఉంది, ఏం చేస్తారు?'' అని అంటే, ఆవేశంలో గోవింద రావామెను హత్యచేసి వుంటాడు. ఇన్స్పెక్టర్ గోపీ నాథ్ ఈ కారణాన్ని గోవిందరావుకు చెబుతూంటే, ''అలా అనుమానించే వాడినయితే సునీతనూ, రామ స్వామినీ ఒకేఇంట్లో ఎందుకుంచి వెడతాను?''అన్నాడు.

''ఇదో అబద్ధమా?'' అన్నాడు రామస్వామి. అతను గోపీనాథ్ ప్రశ్నలకు జవాబిచ్చి అక్కణ్నించి వెళ్ళి పోయాడు.

రామస్వామి వెళ్ళిపోయిన రెండునిముషాలకు పోలీస్ స్టేషనులో ఓవ్యక్తి అడుగుపెట్టాడు. ఆవ్యక్తి చూట్టానికి పిచ్చివాడిలా బికారివాడిలా ఉన్నాడు.

''నా పేరు జోగినాథం'' అన్నాడతను.

''ఏవిటి నీకిక్కడ పని!'' అన్నాడు గోపీనాథ్.

"రామస్వామి నాకు తెలుసు. ఓరోజు వాడింట్లో స్నానం చేద్దామని వెళ్ళాను. నన్నవమానించాడు. వాడి లోని క్రూరత్వం పసిగట్టాను. ఆ క్షణంనుంచీ ఈ క్షణం వరకూ వాడిననుసరిస్తూనే ఉన్నాను. వాడెప్పుడెప్పుడు యెక్కడెక్కడ ఉంటున్నదీ నాకు తెలుసు. ఈ హత్య సంగతి విన్నాక ఇది వాడిపనే అనిపించింది.

వాడిదగ్గర ఓ శక్తివంతమైన అయస్కాంతముంది. దాని సాయంతో వాడు యినుప చువ్వలనువంచి మళ్ళీ మామూలుగా చేయగలడు. పొరుగూర్లో గదిలో తలుపులు వేసుకొని పడుకొని అయస్కాంతం సాయంతో బయటపడి ఇక్కడకు వస్తున్నాడు. ఆ విధంగా పొరుగూరులో వాడికి ఎలిబీ లభిస్తోంది. వాడు పొరుగూరుకి ఏ టాక్సీలో వెళ్ళాడో అక్కణ్ణించి యిక్కడికెలా వచ్చాడో అన్నీ వివరంగా చెప్పగలను.

వీడు మూడురాత్రులు గోవిందరావు ఇంట్లో వున్నాడు. హత్య జరిగినరోజురాత్రి పన్నెండు గంటలకా ఇంట్లోంచి బయటపడ్డాడు. హత్యచేస్తాడని తెలిసుంటే అదికూడా ఆపగలిగి ఉండేవాడిని. ఆ ఇంట్లోంచి బయటపడి వాడే దారిన నడిచాడో, ఏ టాక్సీ యెక్కాడో ఆ వివరాలన్నీ నేనిస్తాను..." అన్నాడు జోగినాథం.

* * *

"నేను చెప్పానుగా – దుష్టశిక్షణ కోసం అవతరించిన వాణ్ని నేను. నువ్వు నామీద బెల్టు ఎత్తినప్పుడే అనుకొన్నాను నీకు మూడిందని. అప్పుడే చెప్పానుగదా. బెల్టును నామీద ఉపయోగించినందుకు దుఃఖించే రోజు వస్తుందని. అది వచ్చింది. నీకు కాకపోయిన సునీతను

చంపి, ఆ నేరాన్ని గోవిందరావు మీదకునెట్టి, ఆమె రితా వెళ్ళే ధాన్నకూడా దక్కించుకుందామనుకున్నావు. కానీ దురదృష్టం నా రూపంలో నిన్ను వెంటాడింది'' అన్నాడు జోగినాథం.

రామస్వామి తల వంచుకున్నాడు. అనుకోని విధంగా తను పట్టుబడడంతో అతను విధిలేక పోలీసులవద్ద జరిగిన దంతా చెప్పేశాడు.

''నా సునీత నాకు దక్కకపోయినా, ఆమెను చేజే తులా నేనే చంపుకొన్నానన్న అపవాదు పాల్పడకుండా నన్ను కాపాడారు. మీ ఋణమెలా తీర్చుకోవాలో తెలియడంలేదు...'' అన్నాడు గోవిందరావు.

''ఎప్పుడూ యిలాంటి దుర్మార్గులకు ఆశ్రయమీయ వద్దు. అదేమో నీతిపాఠం. ఇంక నాకు మీవల్ల జరగవల సిన ఉపకారమొకటుంది. ఈ రామస్వామి ఇంట్లో నేను షవర్ బాత్ చేయవలసివుంది. ఆ కోరిక తీర్చండి చాలు'' అన్నాడు జోగినాథం.

-: అయిపోయింది :-

# 19 గంటలు

## సంపత్

ఢిల్లీలోని మిలిటరీ హెడ్‌క్వార్టర్స్‌లో ఇంటలిజన్స్ విభాగంముందు హడావిడిగా వచ్చి ఆగుతున్నాయి రకరకాల కార్లు. దిగుతున్న ప్రతి ఒక్కరి ముఖంలో ఆదుర్దా, ఆశ్చర్యం ప్రస్ఫుటిస్తోంది.

అందరూ కాన్ఫరెన్స్ హాలులోకి దారితీశారు.

ఆ సమావేశానికి ముఖ్యమయిన అధికారులే వచ్చారు. విదేశాంగశాఖ కార్యదర్శి, హోమ్‌శాఖ కార్యదర్శి, మరి కొందరు యితర అధికారులు, ఎయిర్‌ఫోర్స్, ఆర్మీఇంటలిజన్స్ అధికారులుకూడా సమావేశం కావటంతో వారు చర్చించబోయే విషయం ముఖ్యమైనదే అయుండాలని ప్రతివారికీ అవగతమయింది.

కొద్దిసేపు తరువాత హాలు తలుపులు బంధించబడ్డాయి. హోమ్‌శాఖ కార్యదర్శి లేచి గొంతు సవరించుకొని చెప్ప సాగాడు.

"జంటిల్మన్! మీరందరిని యిలా అర్థాంతరంగా పిలి

పించటంలోగల అంతరార్థం మీరీపాటికి గ్రహించే వుంటారు. మనకి ఎక్కువ టైంలేదు గనుక క్లుప్తంగా ముగిస్తాను.

బొంబేనుంచి ఢిల్లీ బయలుదేరిన విమానాన్ని కొందరు దుండగులు హైజాక్ చేశారు. గతంలో మన విమానాన్ని పాకిస్తాన్ మళ్ళించి కాల్చివేసిన సంఘటన మీకు గుర్తుండే వుంటుంది. ఆ సంఘటన దరిమిలా ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్టుల్లో సెక్యూరిటీ ఎక్కువచేశాం. ఐనా దుండగులు యెలాగో విమానంలో ప్రవేశించ గలిగారు,

ఆ విమానంలో భారతీయులు నలభై రెండు మంది. ఆఫ్రికన్స్ యిద్దరు, అరబ్స్ పదిహేనుమంది, పాకిస్తానీయులు పధ్నాలుగురు, ఆఫ్ఘన్స్ ఏడుగురూ ఉన్నారు. వీరుగాక మిగిలిన ఆరుగురు విమాన సిబ్బంది. పైలెట్స్ యిద్దరు, ఎయిర్ హోస్టెసెస్ యిద్దరు, ఒక ఫస్టుఆఫీసర్, ఒక ఫ్లైట్ ఇంజనీర్.

మొత్తం ఈ ఎనభై ఆరుగురు ప్రాణాలు ఆ దుండగుల చేతులలో వున్నాయి. ఈ 86 గురిలోనే దుండగులు కూడా వున్నారని మరిచిపోవద్దు.

ఇక ఆ దుండగులు ఎందరో, వారి ఆయుధాలేమిటో, వారి కోరికలేమిటో తెలియదు. కనుక దీని విషయమై ఎటువంటి చర్యలు తీసుకోవాలో ఆలోచించవలసినదిగా కోరుతున్నాను.''

కొన్ని క్షణాలపాటు ఆ హాలులో నిశ్శబ్దం ఆవరించింది.

## 2

''గయ్ం!'' మని శబ్దంచేస్తూ మేఘాలమీదుగా ఎగురుతోంది విమానం.

పైలెట్ రామక్రిష్ణన్, కో-పైలెట్ జోగీందర్‌లు తాము ఎదురుతిరిగి సాధించేది యేమీ లేదని గ్రహించి మౌనంగా విమానాన్ని నడుపుతున్నారు. అయినా వారి మనస్సులో దుండగులను యెలా యెదుర్కోవాలా అన్న ఆలోచన మాత్రం నశించలేదు.

ముఖ్యంగా రామక్రిష్ణన్, నివురుగప్పిన నిప్పులా ఉండి, యేమాత్రం సందుచిక్కినా తమ వెనుక నిలబడివున్న "నెంబర్ త్రీ" మీదకు లంఘించడానికి సిద్ధంగా ఉన్నాడు.

'నెంబర్ త్రీ'గా పిలవబడుతున్న అతనికి ముప్ఫయేళ్ళలోపే వుంటుంది వయసు. ముఖం కన్పించకుండా నల్లటి మాస్క్ వేసుకున్నాడు. కళ్ళు, నోరు, ముక్కు మాత్రం కనబడుతున్నాయి. నల్లరంగు ఉలన్ పాంట్, అదేరంగు స్వెటర్ ధరించాడు.

మిగిలిన దుండగులుకూడా అదే వయస్సులో అదే డ్రెస్సులో వున్నారు. ఒకరినొకరు నెంబర్లతోనే పిలుచుకుంటున్నారు.

నెంబర్ త్రీ కూడా పైలెట్ కాక్‌పిట్‌లో అలెర్ట్‌గానే వున్నాడు. పైలెట్లుగాని, ఫస్ట్ ఆఫీసర్ మూర్తిగాని తనమీదకు దుమికే అవకాశం యివ్వకుండా జాగ్రత్త పడుతున్నాడు వెయ్యికళ్ళతో కాపలాకాస్తూ.

లోపల ప్రయాణీకులను భయంకరమైన మనఃస్థితి ఆవరించింది. తమకిక నూకలు చెల్లినట్లే నన్న భావం వ్యాపించి నిరాశా నిస్పృహాలతో వేలాడిపోయారు. సీట్లకు అంటిపెట్టుకుపోయిన వారిని నెంబర్ టూ బంధిస్తున్నాడు కదలనీయకుండా.

నెంబర్ ఫోర్ పైలెట్ కాక్‌పిట్‌కి యెదురుగావున్న

సీట్లమధ్య డోరవద్దగర లేవెటరీకి దగ్గర నిలుచుని కాపలా కాస్తున్నాడు. నెంబర్ ఫైవ్, నెంబర్ వన్‌లు మాత్రం అటూయిటూ తిరుగుతూ అందరినీ గమనిస్తున్నారు.

"నెంబర్ వన్" స్పీకర్‌లో విన్పించింది నెంబర్ త్రీ గొంతు.

నెంబర్ వన్ కాక్‌పిట్‌లోనికి పోయాడు. నెంబర్ త్రీ అతనికి తామున్న స్పాట్ చెప్పి, మైక్రోఫోన్ యిచ్చాడు.

'జోథ్‌పూర్' నుంచి వారికి కాంటాక్ట్ అందింది. విమానం హైజాక్ చేయబడిందన్న విషయం తెలియగానే అన్ని ఎయిర్‌పోర్టులకీ ఆ విషయం తెలియచేయబడి, దానిని ట్రేస్ చేయవలసిందిగా కోరారు అధికారులు.

"జోథ్‌పూర్ కంట్రోలింగ్ స్టేషన్ కాలింగ్" అంటూ అరుస్తున్నాడు ట్రాఫిక్ కంట్రోలర్.

"మిస్టర్ కంట్రోలర్!" తాపీగా అన్నాడు నెంబర్ వన్.

"మేము ప్రస్తుతం పాకిస్థాన్ దిశగా ప్రయాణంచేయవలసి వుంటుంది. వెంటనే వారి అనుమతి సంపాదించండి. ఎలా సంపాదిస్తారో మాకు అనవసరం. లేకపోతే ఏమవుతుందో మీకు తెలుసు."

"అలాగే! అలాగే!" కంగారుగా అన్నాడు కంట్రోలర్. "మీరెందుకు హైజాక్ చేశారు? మీకేంకావాలి?"

"అది తరువాత చెబుతాను. ముందు భారతదేశం వదలాలి. అరగంటలోపు మాకు ఏ విషయమూ తెలపాలి" అంటూ స్విచాఫ్ చేశాడు నెంబర్ వన్.

ఈ సంభాషణ వింటున్న పైలెట్స్ ముఖాలు తెల్లగా పాలిపోయాయి. పాకిస్థాన్! ఈ కుట్రలో పాకిస్థాన్‌కి

భాగముందా? ఉంటే వాళ్ళ అనుమతి ఎందుకు?

అప్పుడు సమయం రాత్రి ఒకటిన్నరదాటి అయిదు నిముషాలయింది.

## 3

ఇస్లామాబాద్ ఎయిర్‌పోర్ట్ రాడార్ రేంజ్‌లోకి ప్రవేశించింది విమానం.

నెంబర్ వన్, పైలెట్ కాక్‌పిట్‌లోనే వుండి స్వయంగా డైరెక్షన్స్ యిస్తున్నాడు. అతని ఆర్డర్స్, తుపాకి పట్టుకున్న విధమూ చూస్తుంటే – యిటువంటి వ్యవహారాలలో అతనికి మంచి అనుభవం వుండాలని భావించాడు రామకృష్ణన్.

హైజాక్ చేయబడిన విమానంలో తమ దేశీయులు కూడా వున్నారని తెలియడంతో పాకిస్తాన్ కూడా భారత దేశానికి సహాయపడటానికి ముందుకువచ్చింది.

అధికారులకి ఆదేశాలు వెళ్ళాయి. ఆ విమానం ఎక్కడ దిగుతుందో, దానిని ఎలా ట్రేస్ చేయాలో అని ప్రతి వారూ మథన పడుతున్నారు.

మైక్రోఫోన్‌ని తీసుకున్నాడు నెంబర్ వన్. "747 కాలింగ్! 747 కాలింగ్" అని అన్నాడతను.

"రిసీవింగ్ యువర్ మెసేజ్, ప్రొసీడ్ ఓవర్!" అని విన్పించింది ఇస్లామాబాద్ ఎయిర్‌పోర్ట్‌నుంచి.

"ఈ విమానం పూర్తిగా మా ఆధీనంలోవుంది. భారతదేశం మీకన్నీ వివరంగా చెప్పేవుంటుంది. మాకు కావల్సింది మీ ఎయిర్‌రూట్‌లో ప్రయాణించటానికి అనుమతి మాత్రమే. ఇంకేమీ పిచ్చిపనులు చేయకండి. మమ్మల్ని అనుసరించటంగాని, మా గురించి వెతకడం గాని జరిగితే..." అంటూ నవ్వాడు నెంబర్ వన్.

అదిరిపోయాడు గ్రవుండ్ కంట్రోలర్. "నో! నో! మీరు స్వేచ్ఛగా పోవచ్చు. ఎటువెళ్ళాలో చెప్పండి. రూట్ని క్లియర్ చేస్తాం!"

అదేక్షణంలో "డామిట్! మనం క్రిందికి దిగక తప్పదు!" అన్నారు పైలెట్ రామక్రిష్ణన్.

చటుక్కున ఫోన్ కట్ చేసి "వాట్?" అని అరిచాడు నెంబర్ వన్.

"ఫ్యూయల్ ఐపోయింది!" అన్నాడు రామక్రిష్ణన్.

"అప్పుడే ఎలా అయిపోయింది? ఎక్సెస్ ఉంటుందిగా!"

"ఉంటుంది, నిజమే కాని పాకిస్తాన్ అనుమతికోసం గంటపైలాంగ్ రౌండ్సు చక్కర్లు కొట్టాం!" పెడసరంగా జవాబిచ్చాడు అతను.

విసుగుదల కన్పించింది నెంబర్ వన్ ముఖంలో. నెంబర్ త్రీకి అప్పగించి పాసింజర్స్ కాబిన్ లోకిపోయాడు. నెంబర్ టూతో ఏదో రహస్యంగా చర్చించి తిరిగి కాక్ పిట్ లోకి రాబోయాడు.

"సర్!" అన్న ఎయిర్ హోస్టెస్ పిలుపువిని ఆగి చూశాడు.

"పాసింజర్స్ అంతా భయపడుతున్నారు. ఇఫ్యూ గివ్ మీ పర్మిషన్... వారికి బ్రేక్ ఫాస్ట్ సర్వ్ చేస్తాను. ఇట్స్ నియర్లీ డాన్!" అంది ఎయిర్ హోస్టెస్ సులక్షణ.

భృకుటి ముడిచి ఏదో ఆలోచించుకుని "ఓ. కె! డోంట్ ట్రై ఎనీథింగ్!" అని నెంబర్ టూ, ఫైవ్ లకు సైగ చేసి లోనికిపోయాడు.

అదే చాలనుకుని సర్వీస్ రూంలోకి నడిచింది సులక్షణ. ఆమె వెనుకే వచ్చాడు నెంబర్ ఫైవ్.

పేపర్ కప్స్‌లో కాఫీ, టీ, జ్యూస్ మొదలయినవి నింపి ఒక ట్రేలోవుంచి బయటపడింది.

"టేక్ యువర్ సెల్ఫ్ సమ్‌థింగ్ ప్లీజ్!" అంది నెంబర్ ఫైవ్‌తో. వద్దన్నట్లుగా తలూపాడతను.

ఒక్కొక్క పాసింజర్ దగ్గరికిపోయి వారికేం కావాలో కనుక్కొని అందించసాగింది. ప్రాణభయంతోనున్న వారి కవి సహించవని ఆమెకి తెలుసు. వారినా మెంటల్ షాక్‌నుంచి డైవర్ట్ చేయాలంటే గత్యంతరం లేదు.

అయిపోయినపుడల్లా లోనికిపోయి నింపుకొని వస్తోంది సులక్షణ. ఆమెని వెయ్యికళ్ళతో గమనిస్తూనేవున్నాడు నెంబర్ ఫైవ్.

లోపల నెంబర్ వన్ ఇస్లామాబాద్ గ్రౌండ్ కంట్రోలర్‌తో మాట్లాడుతున్నాడు.

"ఐడోంట్ లైక్ యువర్ బ్లడీ సజషన్స్! ఐవాంట్ ఫ్యూయల్. క్రిందికి దిగినవెంటనే యెవరూ మాదగ్గరకు రాకూడదు. నేనే మరలా మీతో కాంటాక్టు అవుతాను. అండర్‌స్టాండ్!"

"బట్ మిస్టర్! విమానం క్రిందకి దిగగానే యే ప్రమాదమూ సంభవించకుండా అంబులెన్స్, ఫైర్ బ్రిగేడ్ రావటం రివాజు. మీరిలా..."

"షటప్! విమానం తగలబడ్డాసరే! ఒక్క ఫ్యూయల్ టాంకర్ తప్ప వేరేమీ రాకూడదు. అదయినా నేను అనుమతి యిచ్చిన తరువాతే!" అరిచాడు నెంబర్ వన్.

"ఓ.కె! ఓ.కె!" కంగారుగా అన్నాడు కంట్రోలర్.

మైక్ కట్‌చేసి నిశ్వశించాడు నెంబర్ వన్. ఎడమచేతిని జుట్టులోనికిపోనిచ్చి దువ్వుకున్నాడు.

స్పీకర్‌లో హెచ్చరించగానే ప్రయాణికులందరూ

సేఫ్టీ బెల్టులు బిగించుకున్నారు.

అతనితోపాటు, అతని అనుచరులుకూడా నిలుచునే ఏదో ఆధారం పట్టుకుని నిలబడ్డారు.

# 4

ఢిల్లీలో మిలిటరీ క్వార్టర్స్‌లో సీక్రెట్ కాన్ఫరెన్సులు జరుగుతున్న హాలుముందు వచ్చి ఆగాయి రెండుకార్లు.

ఒక కారులోంచి బ్రిగేడియర్ విశ్వనాథ్, మేజర్ ప్రకాష్‌లు, రెండోదాంట్లోంచి కెప్టెన్ చంద్రకాంత్, డిసౌజా, కుమారసాహ్నిలు దిగారు.

వారికోసం వెయిట్ చేస్తున్న ఒకరు వారిని లోనికి తోడ్కొనిపోయారు. అందరికి పరిచయం చెయ్యబడిన తరువాత వారికి విషయం వివరించబడింది.

మధ్యలో పొలికేక పెట్టింది ఫోను. హోమ్‌శాఖ కార్యదర్శి ఫోనులో విన్న సంగతి అందరితో చెప్పాడు.

"ప్లేన్ ఫ్యూయల్ అయిపోవటంతో ఇస్లామాబాద్‌లో దిగటానికి అనుమతి కోరుతున్నారట దుండగులు. అందుకు పాకిస్తాన్ అంగీకరించింది."

ఆర్మీచీఫ్, బ్రిగేడియర్ వంకచూసి "దట్స్ ద మాటర్! మా అందరి ఆశలు మీమీదే వున్నాయి. గతంలోకూడా హిమాలయాలలో 'సీక్రెట్ టౌన్'ని నాశనం చేసి మనదేశం పరువు కాపాడారు. (ఏప్రెల్ '77 సప్లిమెంట్) మీరే మాకిప్పుడు సలహా నిచ్చేవారు!" అన్నాడు.

ఆయన వుద్దేశ్యం అర్థమయింది విశ్వనాథ్‌కి. ఆయనకి సలహా యిచ్చేటంత గొప్పవాళ్ళు కాదు తాము. ఆయన అలా అన్నాడంటే అర్థం ఈ వ్యవహారంలో జోక్యం కల్పించుకోమనే. కాని ఎలాగ? ఏ విధంగా?

"మీ అభిప్రాయం" అన్నట్లు తన సహచరులవంక చూశాడు బ్రిగేడియర్.

"ఇలా భయపడి వాళ్ళ షరతులకి అంగీకరిస్తే వదులు తారని నమ్మకమేమిటి? రేపు యిలాంటిదే మరొకటి జరిగితే? నో...వాళ్ళకి బుద్ధి చెప్పవలసిందే!" అన్నాడు చంద్రకాంత్.

మిగిలిన వాళ్ళుకూడా అదే తమ అభిప్రాయమన్నట్లు తలూపారు.

డెసిషన్ అయిపోయింది. ఇక కార్యాచరణలోకి దిగడమే తరువాయి.

కాని ఏ విధంగా? అసలు లోపలవున్న దుండగులు ఎంతమంది? వాళ్ళదగ్గరున్న ఆయుధాలేమిటి? అన్న అనుమానాలు ఉద్భవించాయి.

## 5

తెల్లవారు ఝాము. సన్నగా కురుస్తున్న మంచును చీల్చుకుంటూ క్రిందకు దిగుతోంది విమానం.

ఆ మంచులో రన్‌వేగాని, సిగ్నల్ లైట్సుగాని స్పష్టంగా కన్పించలేదు.

ఆ వాతావరణంలోకూడా చెమటలు పడుతున్నాయి పైలట్స్ యిద్దరికి. ఈ పరిస్థితిలో లాండ్ కావడం కష్టమైన పనే!

ఎడమచేత్తో వీల్ పట్టుకొని, కుడిచేతిని థ్రోటిల్ (Throttle) మీద ఉంచాడు రామక్రిష్ణన్. జోగిందర్ కుడిచేతితో వీల్ పట్టుకుని, ఎడమచేతిని థ్రోటిల్ మీద ఉంచాడు.

వారి ముందున్న డయల్స్‌లో ఒకటి తగ్గిపోతున్న ఆల్టిట్యూడ్‌ని సూచిస్తోంది.

చెవులకున్న ఇయర్‌ఫోన్స్‌లో గ్రవుండ్ కంట్రోలర్ డైరెక్షన్స్ వినబడుతున్నాయి.

థ్రోటిల్‌ని నెమ్మదిగా ఒకే లెవల్లో ముందుకు జరుపుతున్నారు యిద్దరు. ముందుకు వాలి పక్షిలా వాలుతోంది విమానం. నెంబర్ వన్, నెంబర్ త్రీలు తూలిపడకుండా గట్టిగా పట్టుకుని నిలుచున్నారు.

రన్‌వేని తాకాయి టైర్లు. కీచుమంటూ 'వే'ని రాచుకొని వేగంగా పరుగుతీయ సాగాయి అవి.

పైలెట్స్ చేతులు థ్రోటిల్‌ని వదిలి బ్రేక్స్ మీదకు దారితీశాయి.

రన్‌వేకి అటూయిటూ వున్న సిగ్నల్ లైట్సు డైరెక్షన్స్ ఇస్తున్నాయి. కొంతదూరం పరుగెత్తిన అనంతరం బ్రేక్సు అప్లై చేశాడు రామక్రిష్ణన్.

మరో ఐదు నిముషాలనంతరం ఇంజన్స్‌తో బాటు ఆగిపోయిన విమానం ఒంటరిగా నిలబడివుంది.

# 6

పైలెట్ కాబిన్‌నుంచి దూరంగా కనబడుతున్న విమానాశ్రయ భవనాలను గమనిస్తున్నాడు నెంబర్ వన్. మిగిలిన నలుగురు లోపల కాచుకుని ఉన్నారు.

ప్రయాణీకులకు తాము యెక్కడ దిగినదీ అర్థంగాక తెల్లబోయి చూస్తున్నారు. పరిసరాలను గుర్తుపట్టడానికి ప్రయత్నిస్తున్నారు మరికొందరు.

చుట్టూ అద్దాలమీద మంచు పేరుకుంటోంది పల్చగా.

తన అనుచరులను హెచ్చరించి, రేడియోఫోన్ స్విచ్ ఆన్ చేశాడు నెంబర్ వన్.

"హియర్ మీ కేర్‌ఫుల్లీ!" ఒక్కొక్కమాటే స్పష్టంగా, మెల్లిగా పలుకుతున్నాడు నెంబర్ వన్.

"ప్రస్తుతం మా చేతులలో రివాల్వర్లు, స్టెన్‌గన్స్, గ్రెనేడ్స్ సిద్ధంగా వున్నాయి. అవి ప్రయాణీకులకు గురి పెట్టబడివున్న సంగతి మీరు గ్రహించగలరు.

ఇప్పుడు టైం సరిగ్గా అయిదుగంటలా ముప్పైఒక్క నిముషం అయింది. అయిదూ యాభైకి ఆయిల్ టాంకర్ ఒక్కటే... రిపీట్ ఆయిల్ టాంకర్ ఒక్కటే బయలుదేరి విమానాకి ఎదురుగా, అంటే పైలెట్ కాబిన్‌కి ఎదురుగా రావాలి. విమానానికి ఇరవై అడుగుల దూరంలో ఆగాలి.

లోపల డ్రయివర్ తప్ప ఇంకెవ్వరూ ఉండకూడదు. సరిగ్గాఆరుగంటలకి విమానాన్ని సమీపించి ఫ్యూయలింగ్ జరపాలి. తిరిగి వెళ్ళేటప్పుడు ఇదే విధంగా పోవాలి. ఈలోగా వెనకనుంచిగాని, ప్రక్కనుంచిగాని మమ్మల్ని సమీపించటానికి ప్రయత్నించకండి. అండర్‌స్టాండ్."

"ఆల్ రైట్! మీ మాటలు టేప్ చేశాం. మీరు కోరిన ప్రకారం జరుగుతుంది." హామీయిచ్చాడు అతను.

అంతా నెంబర్ వన్ చెప్పినట్లే ప్రవర్తించారు అధికారులు. రీఫ్యూయలింగ్‌కి సరిగా ముప్పైఅయిదు నిముషాలు పట్టింది. ఈ అరగంట కాలమూ ముళ్ళమీదున్నట్లు గడిపారు దుండగులు.

రామక్రిష్ణన్‌లో తిరగబడాలన్న కోరిక మరింత బలపడసాగింది. ఏదో ఒకటి చేసేయాలన్న ఉద్దేశ్యంతో వున్నాడతను.

ఫ్యూయలింగ్ ముగించి టాంకర్ తిరిగి వెళ్ళిపోసాగింది. ఆ సమయంలోనే నెంబర్ వన్ కళ్ళు రెండు సెకనులు పాటు దానిమీదే కేంద్రీకృతమయ్యాయి.

అవకాశం కోసం కాచుకొనివున్న రామక్రిష్ణన్ ఎగిరి

తుపాకీ పట్టుకొన్న నెంబర్ వన్ చేయిమీద కొట్టాడు.

దిమ్మెరపోయి రివాల్వర్‌ని వదిలేశాడు నెంబర్ వన్.

అతడిమీదకు దూకాడు రామకృష్ణన్. పిడికిలి బిగించి అతని పొట్టలో గుద్దాడు. పొట్ట పట్టుకొని వాలిపోయాడు నెంబర్ వన్. అతన్ని పైకిలేపి మరొక కిక్ యిచ్చాడు.

'దబ్బు'మని కాక్‌పిట్ తలుపులకి గుద్దుకొని బయటకు దొర్లాడు నెంబర్ వన్.

'కెవ్వు' మన్నారు పాసింజర్స్.

ఢన్ ఢన్ ఢన్...మంటూ గర్జించాయి నెంబర్ ఫోర్, టూల చేతిలోని స్టెన్‌గన్స్.

భయంకరమైన చప్పుడుతో దద్దరిల్లిపోయిందివిమానం. గుమ్మంలో నిలుచునివున్న రామక్రిష్ణన్ వళ్ళు తూట్లుపడి పోయింది.

# 7

"యా అల్లా! వాటీజ్ ఇట్!" మైక్రోఫోనులో తనకు వినబడిన శబ్దాలను తలుచుకుంటూ కంగారుగా అడిగాడు గ్రవుండ్ కంట్రోలర్.

"పైలెట్ యెదురు తిరిగాడు. చంపేశాం!" క్లుప్తంగా అని, ఫోన్ కట్ చేసి, నోటికి అయిన రక్తంని తుడుచుకున్నాడు నెంబర్ వన్.

"మిస్టర్! ఇప్పుడీ విమానాన్ని యెలా నడపడం?" అని ప్రశ్నించాడు జోగీందర్.

"నెవర్ మైండ్! నెంబర్ ఫైవ్‌వున్నాడు" అనటంతో ఈ వంకతోనయినా ఇక్కడ ఆగిపోవచ్చనుకున్న జోగీందర్ ఆశ అడియాస అయింది.

లోపల ప్రయాణికులస్థితి మరింత హృదయ విదారకంగా తయారయింది. చాలామంది భయంతో స్పృహ

కోల్పోయారు. ఒకరిద్దరికి వాంతులయాయి, రామక్రిష్ణన్ శవం చూసి.

సులక్షణ బుర్ర శూన్యం అయిపోయినట్లయింది.

నంబర్ వన్ పిలవగానే నంబర్ ఫైవ్ వెళ్ళి పైలెట్ సీటులో కూర్చున్నాడు.

"అన్నా! మాపని ముగిసింది. క్లియరెన్స్ యివ్వండి. ఆఫ్ఘనిస్తాను వైపు పోవాలి!" అని మైక్రోఫోనులో చెప్పాడు నంబర్ వన్.

అయిదునిముషాల తరువాత క్లియరెన్స్ యిచ్చారు. జోగీందర్ యింజన్స్ స్టార్ట్ చేశాడు.

గర్ గర్ మంటూ తిరగ నారంభించాయి ఎడమరెక్క చివరవున్న ఇంజను ప్రొపెల్లర్స్. దాని తరువాత కుడి రెక్క రెండవ ఇంజను స్టార్టయింది. పిదప యెడమ రెక్కలో మిగిలిన రెండోయింజను తిరగనారంభించింది. ఇక నాలుగోయింజను మిగిలింది.

జోగీందర్ చేతులు గబగబ స్విచస్ నొక్కుతున్నాయి. కాని ఆ ఇంజను స్టార్టు కావటంలేదు. గబగబా యేవో నొక్కుతున్నాడు. లాభం లేకపోయింది.

అనుమానంగా చూస్తున్నాడు నంబర్ వన్.

"సమ్థింగ్ రాంగ్!" అన్నాడు జోగీందర్ చివరకి.

ఉరిమినట్లు చూసి "నంబర్ ఫైవ్! నువ్వు ట్రయ్ చెయ్" అన్నాడు నంబర్ వన్.

అతని ప్రయత్నంకూడా బూడిదలోపోసిన పన్నీరు అయింది. ఇంజను స్టార్టు కావటంలేదు.

"కొంపదీసి ఈ మూడింటిలోనే వెళ్ళుదామనడు గదా!" అనుకున్నాడు జోగీందర్.

ఆ ఆలోచన వారికి వచ్చినట్లులేదు.

విమానం కదలలేదు. లోపల స్వప్నాలోవున్న ప్రయాణీకులకు ఇది గమనించే ఓపిక లేదు. శూన్యదృక్కులను చూస్తున్నారు.

# 8

సర్రుమంటూ రెండు మిలిటరీ జీపులు వచ్చి ఆగాయి ఆ విమానం ప్రక్కగా.

లోపల నుంచి అయిదుగురు మనుషులు దిగారు. వారి దుస్తులు ఆ చీకటిలో కలిసిపోయినట్లున్నాయి.

"బ్రిగేడియర్! మీరు కోరిన ఏర్పాట్లు చేశాము. ఇప్పుడు మీ అయిదుగురి ప్రాణాలేకాక, ప్రయాణీకుల ప్రాణాలు, మన దేశం పరువూ క్లిష్టపరిస్థితిలో వున్నాయి. వారికేదయినా అయితే ఏమవుతుందో బాగా తెలుసు. కనుక బి కేర్‌ఫుల్! విష్ యు బెస్ట్ ఆఫ్ లక్!" అని కరస్పర్శ చేశాడు ఆర్మీచీఫ్.

తల వూపి విమానం ఎక్కారు అయిదుగురు. వారి కోసమే ఏర్పాటు చేయబడిన ఆ స్పెషల్ ప్లేన్ మరి కొద్దిసేపటి తరువాత గాలిలోకి లేచింది.

* * *

స్టార్టయిన యింజన్స్ ఆగిపోవటం గమనించి, విస్తుపోయింది సులక్షణ. ఏం జరిగింది?

"హలో! హలో!" అంది మైక్రోఫోన్ స్పీకర్.

"ఏమిటి?" చిరాగ్గా ప్రశ్నించాడు నంబర్ వన్.

"క్లియరెన్స్ యిచ్చాం! ఇంకా బయలుదేరరేమిటి?" అన్నాడు.

"జస్ట్ సమ్ రిపేర్."

"మెకానిక్స్‌ని పంపమంటారా?"

"నో! మేము సరిజేసుకోగలం." కఠినంగా అన్నాడు

నంబర్ వన్.

"మీరా! అవి చాలా సున్నితమైన యంత్రాలు. ఏ వైర్ తెగినా..."

"షటప్! ఐ నో యిట్!" గర్జించాడు నంబర్ వన్.

చెవుల తుప్పు వదిలినట్లయింది గ్రౌండ్ కంట్రోలర్ కి.

"నంబర్ ఫైవ్! ఆ యింజన్ ని బాగుచేయగలమా?" అని ప్రశ్నించాడు.

"ఏ సంగతీ పరీక్షిస్తేగాని చెప్పలేను!"

ఏదో ఆలోచించి "వెంటనే వాన్ ఒకటి, భారీది పంపండి. డ్రయివర్ ఒక్కడే వుండి, యిందాక ఆయిల్ టాంకర్ వచ్చిన విధంగానే రావాలి!" అంటూ ఫోన్ లో ఆజ్ఞలు జారీ చేశాడు నంబర్ వన్.

అన్నట్లుగానే ఏడు నిముషాల తరువాత ఒక వ్యాన్ వచ్చి ఆగింది. డ్రైవర్ క్రిందకి దిగి నిలుచున్నాడు.

"నంబర్ టూ! చెకప్!" అన్నాడు కాబిన్ స్పీకర్లో నంబర్ వన్.

వెనుకనున్న డోర్ తెరుచుకుని నంబర్ టూ క్రిందకి జంప్ చేశాడు.

అప్పటికి వుదయం అగటంవల్ల మంచు తెరలు కరిగి పోతున్నాయి. పల్చని ఎండ మంచు తెరలని చీల్చుకొని ప్రసరిస్తోంది.

డ్రైవర్ దగ్గర ఆయుధాలేమీ లేవని తెల్సుకొని నంబర్ వన్ కి సైగ చేశాడు 'టూ'.

"మిస్టర్ పైలెట్! నంబర్ ఫైవ్. గో! క్విక్!" అన్నాడు.

"సారీ! ప్రయాణీకులతోపాటు ఫ్లైట్ ఇంజనీర్ వున్నాడు. అతన్ని పంపండి" అన్నాడు జోగిందర్.

నంబర్ ఫైవ్ పాసింజర్ కాక్ పిట్ లోకి నడిచి, సులక్షణద్వారా ఫ్లైట్ ఇంజనీర్ ని తీసుకొని బయట పడ్డాడు.

ఈలోగా నంబర్ టూ డ్రైవర్ ద్వారా వ్యాన్ ని చెడిపోయిన రెక్క ముందు క్రిందుగా ఆపించి, డ్రైవర్ ని కొద్ది దూరంలో దిగి నిలబెట్టాడు.

వ్యాన్ పైకి ఎక్కి యింజన్ ని పరీక్షించసాగారు ఫ్లైట్ ఇంజనీర్, నెంబర్ ఫైవ్ లు. అరగంట ప్రయత్నం అనంతరం డిఫెక్టుని కనుక్కోగలిగారు. దానిని సరిజేసి వూపిరి పీల్చుకున్నారు. మధ్యలో ఆగిపోతుందన్నభయం మాత్రం ఫ్లైట్ ఇంజనీర్ మెహిందర్ సింగ్ కు కలగక పోలేదు.

వ్యాన్ క్రిందకు దిగి జేబులో చేయి పెట్టుకున్నాడు మెహిందర్ సింగ్.

తమవద్ద ఆయుధాలు ఏమీ లేవన్న సంగతి వాళ్లెప్పుడో చెక్ చేసి గ్రహించారు.

"మె ఐ స్మోక్?" అన్నాడు మెహిందర్.

తలూపాడు నంబర్ టూ. జేబులో నుంచి సిగరెట్ పాకెట్ తెరిచి, ఒకదానిని నోట్లో వుంచుకుని, సిగర్ లైటర్ తో వెలిగించుకున్నాడు.

అతనివల్ల ప్రమాదం లేదని తీర్మానించుకొని అడుగులు వేశాడు నంబర్ టు.

ప్యాకెట్టు జేబులో వుంచుకోబోయి క్రిందకి జార విడవటం అతను గమనించలేదు గాని, డ్రైవర్ మాత్రం చూసి కళ్ళు విప్పార్చాడు. ఏమిటది? ఏదో పడిపోయింది.

విమానం వెళ్ళిన తరువాత దానిని చూశాడు. సిగరెట్ పాకెట్. లోపల అయిదు సిగరెట్లు మాత్రం వున్నాయి.

# 9

"బ్రిగడియర్! మెసేజ్ వచ్చింది" అని పిలిచాడు పైలెట్ స్పీకర్లో.

విశ్వనాథ్ లేచి పైలెట్ కాక్‌పిట్‌లోకి నడిచాడు.

"హలో బ్రిగేడియర్! విమానం యింజన్‌లోని డిఫెక్టును బాగుచేసుకున్నారట. ఆ దుండగులలో ఒకడు, మరో మనిషి—వాళ్ళు చెప్పిన పోలికల ప్రకారం ఫ్లైట్ ఇంజనీర మెహిందర్ సింగ్ క్రిందకి దిగి సరిచేశారట" అని చెప్పాడు ఆర్మీచీఫ్.

"డామిట్!" అనుకున్నాడు విశ్వనాథ్. తన పని ఇస్లామాబాద్‌లోనే పూర్తవుతుందని అతను ఆశిస్తున్నాడు యింతవరకు.

తిరిగి విన్పించింది ఆర్మీ చీఫ్ గొంతు.

"అంతేగాదు! తిరిగి వెళ్ళేటప్పుడు మెహిందర్ చేతిలో నుంచి సిగరెట్ పాకెట్ జారి పడటం గమనించి, దానిని చూశాడు డ్రైవర్. దానిలో అయిదు సిగరెట్లు వున్నాయట. అతను కావాలనే క్రిందకి జార విడిచాడని డ్రైవర్ అంటున్నాడట."

అది వినగానే అనేక ఆలోచనలు ఉవ్వెత్తున లేచాయి విశ్వనాథ్ మదిలో.

అయిదు సిగరెట్లు! దేనిని సూచిస్తున్నాయి? లోపల వున్న దుండగుల సంఖ్యనా? లేక తాము ప్రయాణించే దూరాన్నా? లెక ఏదయినా టైమ్ లిమిట్‌నా?

"ఇంతకీ... వారి కోరిక లేమిటో తెలియచేశారా?" అన్నాడు విశ్వనాథ్.

"ఇంకా లేదు" అన్నాడు ఆయన.

# 10

హైజాక్డ్ విమానం పాకిస్తాన్ భూభాగం దాటి ఆఫ్ఘనిస్తాన్ ఎయిర్ ఫీల్డ్‌లోనికి ప్రవేశించింది.

ఈ విషయం ఆఫ్ఘన్ అధికారులకి తెలియజేసి, ఆ క్షణం నుంచి ఇండియన్ అఫీషియల్స్‌తో కాంటాక్టు అయివుండవలసిందిగా కోరింది పాకిస్తాన్. ఇండియా కూడా సహాయాన్ని అర్థించటంతో సహాయానికి ముందు వచ్చింది ఆఫ్ఘన్ ప్రభుత్వము.

వెంటనే హైజాక్డ్ విమానం కోసం ప్రయత్నాలు జరిగాయి. అప్పటి కప్పుడు కాబూల్ విమానాశ్రయాన్ని ఖాళీ చేయించి రాబోయే విమానం కోసం ఎదురుచూడసాగారు ఆఫ్ఘన్ అధికారులు.

విమానం కాబూల్ ఎయిర్‌పోర్ట్ రాడార్ రేంజ్ లోనికి ప్రవేశించటంతోనే అక్కడ టెన్షన్ పెరిగింది.

"హలో! హలో! దిసీజ్ కాబూల్ గ్రౌండ్ కంట్రోల్. యువర్ ఐడెంటిటీ ప్లీజ్!" అంటూ తనని తాను పరిచయం చేసుకున్నాడు గ్రౌండ్ కంట్రోలర్. వెంటనే జవాబు వచ్చింది. తామెవరో తెలియజేసి, డైరెక్షన్స్ యిచ్చి, "వుయ్ వాంట్ క్లియరెన్స్ టు ఆఫ్రికా! వాంటెడ్ వెదర్ రిపోర్ట్, విండ్ డైరెక్షన్స్" అంటున్నాడు నెంబర్ ఫైవ్.

చెడిపోయిన ఇంజను కూడా ఎటువంటి ట్రబుల్ ఇవ్వలేదు. నెంబర్ వన్ ముఖంలో ఇప్పుడు నెర్వస్‌నెస్ పోయి ప్రశాంతత కనబడుతోంది.

"నెంబర్ వన్!" అని వెనకనుంచి నెంబర్ టూ గొంతు వినబడటంతో వెనుదిరిగాడు నెంబర్ వన్. అతని చెవిలో ఏదో చెప్పాడు నెంబర్ టూ. ఇద్దరూ పాసిం

జర్స్ కాబిన్‌లోకి పోయారు.

సులక్షణ లేచి నిలుచుని ఉంది. ఆమె ముఖం తెల్లగా పాలిపోయి వుంది. పెదాలు అదురుతున్నాయి.

"యస్.వాట్ యు వాంట్?" అన్నాడు నెంబర్ వన్.

"మిస్టర్! పాసింజర్స్‌కి మెంటల్ షాక్ తగిలింది. ముఖ్యంగా యిద్దరి పరిస్థితి మరీ సీరియస్‌గా ఉంది. ఫస్ట్ ఎయిడ్ చేశాను. కాని వారికి వెంటనే మెడికల్ ఎసిస్టెన్స్ కావాలి. ప్లీజ్!" అంది ఆమె దీనంగా.

నెంబర్ వన్ పడిపోయివున్న యిద్దరు మనుషులను పట్టి మరీ పరీక్షించాడు. ఆమె చెప్పింది నిజమే నన్పించింది. ఒళ్ళు సలసల కాగుతోంది వారికి. పల్స్ మరీ బలహీనంగా కొట్టుకుంటోంది.

మిగిలిన పాసింజర్ల వంక చూశాడు వన్.

అందరి పరిస్థితి అంతే అయినా, వారిద్దరికంటె ఫరవాలేదు.

కాక్ పిట్‌లోకి నడిచి మైక్రఫోన్ చేతిలోకి తీసుకున్నాడు నెంబర్ వన్.

"మేమిక్కడ లాండ్ అవదల్చుకున్నాం. లోపల సిక్ పీపుల్ యిద్దర్ని దించాలి. అంబులెన్స్‌తో రెడీగా ఉండండి. నేను చెప్పేవరకు ఎవరూ విమానాన్ని సమీపించకూడదు. అండర్ స్టాండ్!" అని చెప్పాడు.

నోట్ చేసుకుంటున్న అతని మాటలు, వివరాలు ఎప్పటి కప్పుడు భారత ప్రభుత్వానికి అందించబడుతున్నాయి. అవి విమానంలో వస్తున్న బ్రిగేడియర్ బృందానికి తెలియ చేయబడుతున్నాయి.

## 11

"మైగాడ్!" అరిచాడు జోగిందర్.

ఉలిక్కిపడి చూశారు అందరు అతని వంక.

"వాట్ హేపెండ్?" కరుగ్గా ప్రశ్నించాడు నెంబర్ వన్.

"వీల్ లాండింగ్ అవుటాఫ్ ఆర్డర్‌లోవుంది. బెల్లీ లాండింగ్ చేయాల్సి వుంటుందేమో!" అన్నాడు జోగిందర్.

నెంబర్ ఫైవ్ చెక్ చేసి ఆ విషయం ధృవపరచటంతో గుండాగినట్లయింది నెంబర్ వన్‌కి.

విమానం దిగబోయే ముందు అడుగున బెల్లీలోవున్న తలుపులు తెరుచుకోవాలి. లోపలకి ముడుచుకు పోయిన వీల్స్ బయటికి సాగాలి. అలాగే వెనుక కూడా. అవి ఫిక్స్ అయిన తరువాతే దిగాలి.

ఈ ప్రాసెస్ అంతా రివర్స్‌గా సాగుతుంది పైకి లేచిన తరువాత. ఈ సిస్టమ్ అంతా ఒక దాంతో ఒకటి ముడిపడి ఉన్నందువల్ల మధ్యలో ఏ అవాంతరం వచ్చినా మొత్తం అంతా గల్లంతయ్యే అవకాశం ఉంది.

అటువంటి పరిస్థితులలో చేసేది బెల్లీ లాండింగ్. అంటే వీల్స్ లేకుండా దిగడం. ఏ ఇసుకమీదనో నేల మీదనో. నిజానికీ లాండింగ్ సిస్టమ్ అంటే ప్రాణాల మీద ఆశవదులుకొని చివరి ప్రయత్నం అన్నమాటే!

"ట్రై! ట్రై!" అరుస్తున్నాడు నెంబర్ వన్.

నెంబర్ ఫైవ్, జోగిందర్‌లు శత్రుత్వాన్ని మరిచి కూడా వీల్స్ తెరవటానికి విపరీత ప్రయత్నాలు చేస్తున్నారు. అరగంట ప్రయత్నం మీద ముందు వీల్స్ మాత్రం వచ్చాయి.

ఈ విషయం తెలియగానే విమానాశ్రయ అధికారులు అదిరి పోయారు. బెల్లీ లాండింగ్ అంటే గత్యంతరం లేక, ఆశచావక క్రిందికి దిగే ప్రయత్నం అని వారెరు

గనిది కాదు.

"దిగకుండా పోతేనో?" అన్న ఆలోచన కూడా రాకపోలేదు నెంబర్ వన్‌కి. కాని తమ డెస్టినేషన్‌లో మాత్రం ఈ సిస్టమ్ పని చేస్తుందని గ్యారంటీ ఏమిటి?

అతనెటూ తేల్చుకునే లోపే క్రిందకి దిగ నారంభించింది విమానం.

జోగిందర్, నెంబర్ ఫైవ్‌ల చేతులు థ్రోటిల్ మీద, హాఫ్ సర్కిల్‌గా ఉన్న వీల్ మీద స్థిరంగా ఉన్నాయి.

జోగిందర్ కళ్ళముందు ఏటవాలుగా రన్‌వే గోచరిస్తోంది. క్షణక్షణానికి రన్‌వేని సమీపిస్తోంది.

రెండు క్షణాల తరువాత రన్‌వేని తాకాయి ముందు వీల్స్. కొంతదూరం పరిగెత్తిన తరువాత వెనుక వీల్స్ తాకటమే తరువాయి. అదే క్షణంలో ఇద్దరు వీల్‌ని బలంగా ఎడమవైపుకి తిప్పేస్తారు. వెనుక భాగం నేల మీదకి వాలక ముందే ప్రక్కనున్న ఇసుక లోనికి దిగింది విమానం.

వెనుక ఫ్యూజ్‌లేజ్ నేలని తాకేలోపే కొంతదూరం దూసుకుపోయి, ఇసుకలో కొంత కూరుకుపోయింది విమానం.

సడన్‌గా ఆగటంతో ముందుకి తూలిపడ్డాడు, నెంబర్ ఫైవ్‌తోసహా అందరూ. ప్రయాణికుల కేకల సంగతి చెప్పనక్కరలేదు.

చుట్టూ లేచిన ఇసుక తెరల మాటున పెద్ద కుదుపుతో ఆగిపోయింది విమానం.

## 12

విమానం నేలని తాకీ తాకటంతోనే పరుగులు పెట్టాయి అంబులెన్స్, ఫైవ్ బ్రిగేడ్ వాన్స్. అది

ఏ క్షణంలో నయినా పేలిపోవచ్చు. లేదా మంటలలో మాడిపోవచ్చు.

కాని సగం దూరం కూడా పోకముందే "స్టాప్! స్టాప్!" అంటూ గోల పెట్టాడు గ్రౌండ్ కంట్రోలర్.

"ఎందుకు?" అని వాకీ - టాకీలో ప్రశ్నించారు అంబులెన్స్, ఫైర్ ఇంజన్ అధికారులు.

"విమానంని సమీపించవద్దని ఆజ్ఞాపిస్తున్నారు. వెడితే విమానాన్నే పేల్చేస్తా మంటున్నారు. కం బాక్. హారియప్," అరుస్తున్నాడు అతను.

వెనక్కి తిరగక తప్పలేదు. ఈ విషయం తెలిసిన బ్రిగేడియర్ బృందం చకితులయ్యారు.

"డేర్ డెవిల్స్!" అనుకున్నాడు ప్రకాష్, విమానంని నడిపిన పైలెట్స్‌ని తలుచుకుని.

వాన్స్ వెనక్కి మళ్ళటం చూసి తృప్తిగా తలాడించాడు నంబర్ వన్.

వాన్స్ వెనుదిరిగిన తరువాత నంబర్ ఫైవ్ వంక పరిశీలనగా చూశాడు. అతని ప్రాణాలుపోయి ఎంతో సేపు అవుతోంది. ముఖం అంతా రక్తమయం అయిపోయి భయంకరంగా ఉంది.

జోగిందర్‌కి గాయాలు తగిలినా, నాడి ఆడుతూనే ఉంది బాగా. ఫస్టు ఆఫీసర్ మూర్తి కూడా బాగానే వున్నా స్పృహ కోల్పోయాడు.

కాక్‌పిట్ తలుపులు తెరుచుకొని పాసింజర్స్ కాబిన్‌లోకి వచ్చాడు. పాసింజర్సంతా అడ్డదిడ్డంగా పడిపోయి కనబడుతున్నారు. అతని సహచరులు తలో మూలపడి వున్నారు. బహుశా దెబ్బతినకుండా నిలదొక్కుకుంది నంబర్ వన్నే అయివుండాలి.

వెంటనే నంబర్ వన్ తన మనుషులకు స్పృహ తెప్పించే ప్రయత్నంలో మునిగిపోయాడు.

నంబర్ ఫైవ్ మరణించాడని విని దిగ్భ్రమ చెందారు వాళ్ళు.

"ఎన్ని కష్టాలు పడయినా మన కార్యం సాధించాలి." అన్నాడు గంభీరంగా నంబర్ వన్.

అప్పటికే ఎయిర్ హోస్టెస్ 'దీప'కి కూడా స్పృహ వచ్చింది. వచ్చీ రావటంతోనే 'సులక్షణ'కి తెలివి రప్పించింది.

సులక్షణ తెలివి రాగానే చేసిన మొదటిపని సీరియస్ కండిషన్‌లో ఉన్న ఇద్దరు ప్రయాణీకులను పరీక్షించటం. వారిద్దరు ప్రాణాలుకోల్పోయి చాలా సేపవుతుంది.

అదే సమయంలో ఎవ్వరో 'కెవ్వ'న అరచిన అరుపుకి విమానం అంతా దద్దరిల్లి పోయింది.

అదిరిపడి చూశారు హైజాకర్స్.

ఒకమూల ఉన్న పాసింజర్ ఒకత్తె గిలగిల కొట్టుకుంటోంది.

నిస్సహాయంగా నంబర్ వన్ వంక చూసింది సులక్షణ.

అతని ముఖంమీద చిరాకు, కోపం కనబడుతోంది. నిరాశని పోగొట్టుకోవటానికి విపరీతంగా ప్రయత్నిస్తున్నాడని తెలుస్తోంది.

ఏదో నిశ్చయం చేసుకుని కాక్‌పిట్‌లోకి నడిచాడు.

"నేను చెప్పేది జాగ్రత్తగా వినండి..." అంటూ ఫోన్‌లో చెప్ప నారంభించాడు.

## 13

ఉదయం పదిగంటల ఇరవై ఆరునిమిషాలయింది.

కాబూల్ విమానాశ్రయం చడీచప్పుడు లేకుండా,

ఎర్రని ఎండలో భయంకరమయిన నిశ్శబ్దంలో మునిగిపోయి ఉంది. దూరంగా ఆగివున్న హైజాక్డ్ విమానం తళ తళ లాడుతూ మెరుస్తోంది.

అత్యవసరమయిన సర్వీసుల్ని తప్ప, మిగిలిన వాటిని రద్దుచేశారు అధికారులు. ప్రతివారిలోనూ ఆందోళన, ఆదుర్దా గూడుకట్టుకొని వున్నాయి.

అప్పుడే విమానాశ్రయం భవనాలనుంచి ఒక తెల్లని అంబులెన్స్ బయటకువచ్చి ఆగిపోయివున్న విమానం దిక్కుగా పరుగెత్త నారంభించింది. లోపల ఒకే ఒక మనిషి ఉన్నాడు.

మరికొద్ది సేపటి తరువాత విమానం రియర్ డోర్ కి కొద్ది దూరంలో రన్ వే మీద ఆగిపోయింది. డ్రయివర్ క్రిందకి దిగి తలమీద చేతులు పెట్టుకొని నిలబడ్డాడు, అంబులెన్స్ తలుపులు తెరిచి.

నంబర్ వన్ కాక్ పిట్ లోనే ఉన్నాడు.

తెరిచి ఉన్న రియర్ డోర్ కి అటూ యిటూ సిద్ధంగా నిలుచుని వున్నారు నంబర్ ఫోర్, నంబర్ త్రీలు.

నంబర్ టూ అందరినీ కవర్ చేస్తున్నాడు.

"ఊ!" అని నంబర్ టూ సైగ చేయటంతో సులక్షణ, దీపలు డోర్ దగ్గరికి నడిచి క్రిందకి దిగారు. అంబులెన్స్ దగ్గరకుపోయి స్ట్రెచర్ తెచ్చారు. దానిలో సీరియస్ గా ఉన్న పేషంటుని ఉంచి మరల క్రిందకి తీసుకుపోయారు. వాళ్ళిద్దరు వెళ్లేటప్పుడే హెచ్చరించాడు నంబర్ టూ.

"మిస్! అంబులెన్స్ తోపాటు వెళ్ళిపోవటానికి ప్రయత్నించకండి. అది మీకే ప్రమాదం!" అని. తలూపారు యిద్దరు.

అలాగే రామక్రిష్ణన్ శవాన్ని, చనిపోయిన ఇద్దరి

శవాలని కూడా అంబులెన్స్ లోనికి చేర్చటం జరిగింది.

దీప, సులక్షణలు విపరీతంగా అలసిపోయారు. అంబులెన్స్ తలుపులు మూయబడ్డాయి. దీప, సులక్షణలు విమానం దగ్గరికి వస్తున్నారు.

అదే క్షణంలో కదిలింది అంబులెన్స్. మరుక్షణమే దీప చప్పున వెనుదిరిగి దానివైపు పరుగెత్తింది.

"దీపా!" అని అరచిన సులక్షణ కేక, "ఢన్"'మన్న రివాల్వర్ శబ్దంతో కలిసిపోయింది.

వీపులో గుండుతో రన్ వేమీద బోర్లాగ పడిపోయింది దీప. రక్తం ధారలయింది.

అంబులెన్స్ క్షణకాలం ఆగి, తిరిగి బయలుదేరింది.

నిలువు గుడ్లేసుకుని చూస్తున్న సులక్షణ భారంగా విమానంలోనికి నడిచింది. ఆమె లోనికి రాగానే తిరిగి తలుపులు బంధించబడ్డాయి.

మైక్రోఫోన్ స్విచాన్ చేశాడు నంబరు వన్.

"మిస్టర్ కంట్రోలర్! మా హెచ్చరిక పాటించనందుకు ఎయిర్ హోస్టెస్ ఒకామె ప్రాణాలు పోగొట్టుకుంది. ఈ రాత్రి సరిగ్గా ఎనిమిదిన్నరకి మా కోరికలు తెలుపుతామని ఇండియా గవర్నమెంటుకి తెలియచేయండి. అంతవరకు...నో మోర్ ఎటంప్ట్స్!" అన్నాడతను.

వెంటనే భారత ప్రభుత్వంతోపాటు, బ్రిగేడియర్ బృందానికికూడా ఈ విషయం తెలియ చేయబడింది.

# 14

కాబూల్ విమానాశ్రయం వాతావరణంలో మార్పేమీ లేదు. ఈ మధ్య కాలంలో మాత్రం సులక్షణచేత మాట్లాడించాడు నంబర్ వన్.

ఆమెకు ఏమేమి చెప్పాలో చెప్పి మైక్రో ఫోన్

అందించాడు. వీపులో రివాల్వర్ మొనగుచ్చుకుంటుండగా చిన్నగా వణుకుతున్న గొంతు విప్పింది ఆమె.

"ఇక్కడ పాసింజర్స్ పరిస్థితి, మా పరిస్థితి చాలా దారుణంగా ఉంది. హైజాకర్స్‌వద్ద స్టెన్‌గన్స్, గ్రెనేడ్స్ రివాల్వర్స్ ఉన్నమాట నిజం. వారు చెప్పినవి చేయక పోతే చాలా భయంకర సంఘటన జరుగుతుంది. ఈ సంగతి వెంటనే ఇండియాకి తెలియచేసి, మమ్మల్ని రక్షించగోరుతున్నాం!" అంది సులక్షణ.

ఆమెవద్దనుంచి ఫోన్ లాక్కున్నాడు నంబర్ వన్. తిరిగి పాసింజర్స్ కాబిన్‌లోనికి పంపబడిందామె.

ఇండియా గవర్నమెంటుని మరింత భయభ్రాంతుల్ని చేయాలన్న ఉద్దేశ్యంతోనే సులక్షణని మాట్లాడనిచ్చాడు నంబర్ వన్. అతనూహించినట్లే, అతను చెప్పిన విధం గానే చెప్పటమేగాక, తెలివిగా సద్వినియోగం చేసు కుందికూడా సులక్షణ.

అంతకు ముందు అంబులెన్స్ డ్రయివర్ దూరంగా నిలబడి ఉండటంవల్ల హైజాకర్స్‌కి వినబడకుండా అత నితో మాట్లాడే అవకాశం కుదరలేదు. కాని యిప్పుడిలా మైక్రో ఫోనులో స్టెన్‌గన్స్ మొదలయిన ఆయుధాల ప్రసక్తి తీసుకురావటం ఎందుకంటే, దుండగులవద్ద ఏయే ఆయుధాలున్నాయో తెలియచేయటం కోసమే.

తమని రక్షించటానికి భారత ప్రభుత్వం ఏవో ప్రయ త్నాలు చేస్తారని తెలుసు. సాధ్యమైనంతవరకు వివరాలు అందిస్తే మంచిదన్న అభిప్రాయంతో అలా ప్రవర్తిం చింది ఆమె.

సిక్ పీపుల్‌ని బయటికి పంపించి వేయటంతో కొంత మంది పాసింజర్స్‌లో ఆశ చిగురించింది. ఎవరికి వారే

తాముకూడా సిక నెస్‌కి లోనయినట్లు ప్రవర్తిస్తూ సులక్షణని వత్తిడి చేయసాగారు.

ఈ సంగతి తెలిసి చెంప పగిలేటట్లు కొట్టాడు నంబర్ వన్. "నో మోర్ టాక్టిక్స్!" అని అరవటంతో అదిరి పోయారు ప్రయాణికులు.

ఈలోగా బయటపడిన ప్రయాణికురాలిద్వారా లోపల వున్న దుండగుల వివరాలు తెలుసుకోవటానికి ప్రయత్నించి విఫలు లయ్యారు అధికారులు.

మెంటల్ గా స్ట్రెయిన్ కి గురయ్యిన ఆమె వారుకోరిన వివరాలు అందించకపోవటమేగాక, లోపలి దుండగుల సంఖ్యనుకూడా యితమిద్ధంగా చెప్పలేక పోవటంతో నిరాశాపూరిత వాతావరణం అలుముకొంది.

మధ్యాహ్నమవటంతో నంబర్ వన్ తన సహచరులతో చర్చించి, ప్రయాణికుల భోజనాలకు ఏర్పాట్లు కావించాడు.

అతను ఆజ్ఞాపించిన విధంగా ఒక డెలివరీ వ్యానువచ్చి, పెద్ద బాస్కెట్లలో భోజన పొట్లాలను, బ్రెడ్, జామ్ మొదలయిన వాటిని అందించి వెనుదిరిగి పోయింది.

సులక్షణ వాటిని అందరికు పంచింది. విపరీతమైన ఆకలితో వుండటంవల్ల అందుకోక తప్పలేదు వారికి.

తన మనుషులను ముట్టుకోనివ్వలేదు నంబర్ వన్. "వాటిలో ఏదయినా కలిపి వుండొచ్చు!" అంటూ, విమానంలోనే మిగిలివున్న బ్రెడ్, బటర్ తోనే తమ ఆకలి తీర్చుకున్నారు వాళ్ళు.

అదే సమయంలోనే బ్రిగేడియర్ బృందం వున్న విమానం కాబూల్ విమానాశ్రయం రన్ వే మీద దిగనారంభించింది.

# 15

దూరంగా కనబడుతున్న విమానాన్ని బైనాక్యులర్స్ ద్వారా పరీక్షించాడు బ్రిగేడియర్ విశ్వనాథ్.

పవర్‌ఫుల్‌ది కావటంవల్ల లోపల మనుషుల కదలికలు కిటికీ అద్దాలద్వారా అస్పష్టంగా కనబడుతున్నాయి.

"మైగాడ్! విమానం పేలిపోకుండా వాళ్ళింకా బ్రతికే వున్నారంటే...రియల్లీ ఏ మిరాకిల్!" కామెంటు చేశాడు కెప్టెన్ డిసౌజా.

ఎయిర్‌పోర్ట్ జనరల్ మేనేజర్ వారికి విషయం అంతా వివరించాడు.

హాస్పిటల్లో వున్న పేషెంటుద్వారా ఏ విషయమూ తెలిసే అవకాశం లేకుండా ఆమె అంతిమశ్వాస విడిచింది.

దీప, రామకృష్ణన్‌ల శవాలు చూసి దుండగులు ఎంత క్రూరులో అర్థం చేసుకుంది బ్రిగేడియర్ బృందం.

"వెంటనే కొంతమంది మనుషులను ఆ విమానానికి దూరంగా చుట్టూ పంపించండి. పవర్‌ఫుల్ బైనాక్యులర్స్‌తో విమానంలోని స్థితిని గమనిస్తూ ఎప్పటికప్పుడు మాకు రిపోర్టు చేసేలా వుండాలి. ఎట్టి పరిస్థితులలోను తమని గమనిస్తున్నారన్న భావం హైజాకర్స్‌కి కలగకుండా మెలగాలి. అలాగే ఒక హెలికాప్టరును మాకు కేటాయించండి. ఏరియల్ సర్వే చేయాలి!" అన్నాడు విశ్వనాథ్.

"ఎలా... వారికి అనుమానం రాదూ?"

"రాకుండా ప్రవర్తించాలి" అంటూ అతని చెవిలో ఏదో చెప్పాడు బ్రిగేడియర్ విశ్వనాథ్.

వెంటనే అతనుకోరిన ఏర్పాట్లు క్షణాలమీద కావించబడ్డాయి. ఇద్దరు, ముగ్గురుగా చీలిన కొంతమంది మనుషులు ఎయిర్‌పోర్ట్‌లో దూరంగా వెళ్ళి విమానంచుట్టు కమ్ముకో

సాగారు. ప్రతివారికీ వాకీ-టాకీలు సమకూర్చబడ్డాయి.

హెలికాప్టరు తమమీదుగా ఎగిరిపోవటం చూసి ఎగి రాడు నంబర్ వన్.

"నెవర్ మైండ్ మిస్టర్! అది ఎయిర్ పోర్టు అథారిటీస్ హెలికాప్టర్. రన్ వే - త్రీ వన్, చివర ఏదో డామేజి అయితే పరీక్షించటానికి వెళుతున్నారు" అని జవాబు యిచ్చాడు గ్రౌండ్ కంట్రోలర్. రన్ వే చివరకు చేరు కోవటానికి హెలికాప్టరు ఉపయోగిస్తుంటారు సామా న్యంగా. అందువల్ల తక్కువ సమయం పడుతుంది.

నంబర్ వన్ కి నమ్మక తప్పలేదు. "సరే! రూటు మార్చండి. మా విమానం మీదుగా రాకూడదు" అంటూ ఆంక్షలు విధించాడు.

# 16

రాత్రి ఏడు గంటలకి మరలా హైజాకర్సు నుంచి మెసేజ్ అందింది.

అరగంట తరువాత ఉదయం అందించిన విధంగానే భోజనపు పొట్లాలు అందించబడ్డాయి.

వాళ్ళ ధోరణి ఎయిర్ హోస్టెస్ కే కాదు, ఎవ్వరికీ అర్థంగాలేదు. తమని ఎంతకాలం యిలా బంధించి వుంచు తారు? అసలు వాళ్ళు కోరేదేమిటి? ఇలాంటి ఆలోచనలు ప్రతివారిలోనూ తొలుస్తున్నాయి.

నంబర్ వన్ ధోరణిలో మార్పు వచ్చినట్లు కనబడటం లేదు. తమ షరతులకి ఇండియా ఒప్పుకుంటుందన్న నమ్మకం అతనికి దృఢంగా వుంది. అంగీకరించకపోతే ఎలాగూ "ఆయుధాలు" వున్నాయి.

జోగిందర్ నికూడా పాసింజర్సుతో కలిపి కూర్చో నిచ్చారు. విమానం లోపల డిమ్ గా వెలుగుతున్నాయి

లైట్లు.

తనీ రాత్రికి ఎనిమిదిన్నరకి తమ షరతులను చెబుతా నన్న విషయం నెంబర్ వన్‌కి గుర్తుంది. టైం చూసు కున్నాడు, భోజనం ముగించి.

ఏడూ నలభై అయిదు.

అదే సమయంలో బయట దూరంగా—

రన్ వేకి చుట్టూ చీకటిగా వుంది. సాధారణంగా వెలుగుతుండవలసిన లైట్లుగాని, విమానాశ్రయంలోని అత్యధిక భాగం లైట్లుగాని వెలగటంలేదు. ఆ రాత్రి సర్వీసుల నన్నింటిని రద్దుచేసి, నిర్మానుష్యం చేశారు.

ఆ సమయంలోనే కొన్ని ఆకారాలు విమానం చుట్టూ ముడుతున్నాయి, నేలమీద పాకుతూ. నల్లని వారి దుస్తుల వల్ల వారి ఉనికి ఆ చీకటిలో కన్పించటంలేదు.

ప్రతివారి చేతులలో ఏవో ఆయుధాలున్నాయి. ఊపిరి మెల్లిగా విడుస్తూ ఏమాత్రం అలికిడి కాకుండా ముందుకి పాకుతున్నారు పాముల్లా.

పేపర్ కప్‌లో నీరుతాగి, దానిని పడవేసి, పైలెట్ సీటులో కూర్చుని ఎయిర్ పోర్టు బిల్డింగ్స్ వంక చూశాడు నంబర్ వన్. చాలావరకు క్రీనీడలో వుంది.

టైం చూసుకున్నాడు. ఎనిమిది గంటల పదిహేడు నిముషాలు.

అతని భృకుటి ముడిపడింది.

చటుక్కున ఫోన్ నొక్కి గ్రాండ్ కంట్రోలరుని పిలిచాడు.

"వాట్స్ రాంగ్ విత్ యు? మీరేదో కుట్ర చేయ బోతున్నారు. డామిట్! విమానాన్ని పేల్చేస్తాం!"

"నో! నో!" అరిచాడు కంగారుగా కంట్రోలర్.

"ఏమయింది?"

"నాన్సెన్సు! ఎయిర్ పోర్టు అంతా చీకటిగా వుంది. ఎందువల్ల?"

"సారీ మిస్టర్! బయట వాతావరణం మారింది. తుఫాను రావచ్చని వెదర్ రిపోర్టులు చెబుతున్నాయి. కనీసం ఉరుములు, మెరుపులతో జల్లులు పడవచ్చని అంచనా. అందువల్ల ముందుజాగ్రత్తలు తీసుకుంటున్నాం. ఈ సంగతి మీతో చెబుదామనుకుంటుండగానే నీవే ఫోన్ చేశావ్!"

ఆ సమయంలోనే ఎక్కడో తళుక్కున మెరుపు మెరిసింది. దాని వెంటనే ఉరుము వినబడింది.

ముందున్న అద్దాలగుండా బయటికి చూశాడు. ఆకాశంలో నల్లటి మేఘాల తెరలు పల్చగా అలుము కొంటున్నాయి.

"దానివల్ల మాకేమన్న ప్రమాదం వుంటుందా?"

"చెప్పలేను. దాని తీవ్రత గురించి ఇంకా అంచనా వేయలేదు" అన్నాడు కంట్రోలరు.

ఆకాశంలో ఉరుములు, మెరుపులు అధికమవు తున్నాయి.

## 17

"రైట్! ప్లాన్ ప్రకారం నడుస్తోంది!" అన్నాడు ప్రకాష్ ముంగుకి పాకుతూ. ఫోన్లో తమకు జరిగిన సంభాషణ సారాంశం కంట్రోలరు నుంచి వాకీ-టాకీలో తెలుపబడింది.

క్రమంగా ఉరుము, మెరుపులు దగ్గరవ్వటం గమనిం చాడు నంబర్ వన్.

మేజర్ ప్రకాష్ వెనుక వున్న మనుషులలో ఒకరు

పిస్టలుని ఆకాశంలోకి పేల్చారు. శబ్దం చేయకుండా గోళీ వంటి వస్తువు ఆకాశంలోకి దూసుకుపోయి ఉరుములా గా పేలింది. దానితోపాటే కాంతికూడా ఉత్పన్నమయింది మెరుపులాగా.

ఆ సరికి విమానంని సమీపించింది బ్రిగేడియర్ బృందం.

విమానం చుట్టూ గోడలమీదకి మడిచివున్న లాడర్ లను ఎక్స్పాండ్ చేసి వేశారు.

బయట వాతావరణం చూస్తుంటే నిజంగా తుఫాన్ వచ్చే ముందు వుండే వాతావరణంలా వుంది.

ఇవేమీ గమనించలేదు నంబర్ వన్.

మైక్రోఫోన్ లాక్కుని చెప్పసాగాడు. "సరిగ్గా ఎనిమిదిగంటల ముప్పై నిముషాలయింది. మా షరతులని చెబుతున్నాను. జాగ్రత్తగా నోట్ చేసుకో. వానిని ఇండియాకి తెలపాలి. ఈ రాత్రి సరిగ్గా పదకొండు గంటలకు నాకు సమాధానం కావాలి, అంగీకరించినదీ, లేనిదీ. పదకొండు గంటలకి ఒక్క నిముషం ఆలస్యం అయినా విమానంని పేల్చేస్తాం. జాగ్రత్తగా ఆలోచించి మెలగండి. నా...అవర్ టర్మ్స్...!" అంటున్నాడతను.

అదే క్షణం భయంకరమైన శబ్దంతో విమానం దద్దరిల్లిపోయింది. గజగజ వణికింది విమానం.

పిడుగు పడిందా, భూమి చీలిందా-అన్న అనుభూతికి లోనయ్యారు విమానంలోని వాళ్ళు.

హైజాకర్స్ తేరుకొనే లోపే - రియర్ డోర్ ధడాలున తెరుచుకుని - విశ్వనాథ్ లోనికి ఉరికాడు.

అదిరిపడ్డారు అందరు.

బ్రిగేడియర్ విశ్వనాథ్ లోనికి దుమకట మేమిటి,

దగ్గరలోనున్న నల్లని ముసుగుమనిషికి గురిచూసి కాల్చట మేమిటి క్షణకాలంలో జరిగిపోయింది. అదే వూపులో దొర్లుకుంటూ పోయి సీట్లమధ్య వున్న భారీ ప్రదేశంలోకి చేరుకున్నాడతను.

కాక్‌పిట్టు లోనికి పోబోతున్న నంబర్ టూ గిర్రున వెనుదిరిగి, విశ్వనాథ్‌ని గమనించి స్టెన్‌గన్ ఎత్తబోతు న్నాడు.

విశ్వనాథ్ క్షణంకూడా ఆలస్యం చేయలేదు. అలా పడివుండే నంబర్ టూకి గురిచూసి ట్రిగ్గర్ నొక్కాడు. ఒళ్ళంతా తూట్లుపడి నిలువునా కూలిపోయాడు అతను.

ప్రయాణీకులకి మాత్రం ఏం జరుగుతుందో ఎంత మాత్రమూ అర్థంకాలేదు. విచక్షణాజ్ఞానం నశించిన బుర్ర లతోనే స్తబ్ధంగా కూర్చుండిపోయారు.

వెనక జరుగుతున్న కాల్పులు గ్రహించాడు నంబర్ వన్. అతని హృదయం భగ్గున మండింది. చేతికి అంది వచ్చిన ఫలం నోటికందకుండా పోతుందనే ఆవేశంలో క్రుద్ధుడయ్యాడు.

చప్పున ప్రక్కన వున్న కిట్‌లోనుంచి హేండ్ గ్రనేడ్ తీసి, నోటితో ఫ్యూజ్‌ని లాగి పాసింజరు కాబిన్ వేపు విసరబోయాడు.

అదే క్షణంలో ఫ్రంటు డోర్ ధడాలున తెరుచుకుని సుడిగాలిలా లోనికి ప్రవేశించిన మేజర్ ప్రకాష్ గ్రనేడ్‌ని అందుకొని కిటికీలోంచి దూరంగా విసిరేశాడు చేతి బలంకొద్దీ. ఫెటిల్లుమనే బ్రహ్మాండమయిన శబ్దంతో ప్రేలిపోయింది అది.

ఆ క్షణంలోనే విమానంని చుట్టుముట్టి లోనికి ప్రవే శించారు మిగిలిన మనుషులు.

నంబర్ వన్ మరింత కృద్ధుడై కాలితో ప్రకాష్ పొట్టలో తన్నాడు. ఆ అదుటుకి వెళ్ళి ఒక మూలపడ్డాడతను.

జేబులోనుంచి కత్తి తీసి బ్లేడ్‌ని తెరిచి ప్రకాష్‌వైపు విసిరాడతను. చప్పున ప్రక్కకి తప్పుకుని, అదే వూపులో ఎగిరివచ్చి నంబర్ వన్ ముఖంమీద తన్నాడు ప్రకాష్.

'కేవ్' మని అరుస్తూ తెరిచివున్న డోర్‌లో నుంచి క్రిందకు పడిపోయాడు నంబర్ వన్.

అతను నేలని తాకకముందే ప్రకాష్ చేతిలోని రివాల్వరు గర్జించింది.

నిర్జీవమైన శరీరం దబ్బుమని పడింది నేలమీద.

''అపరేషను ఓవర్!'' అన్నాడు వాకీ-టాకీలో విశ్వనాథ్.

మరుక్షణంలోనే ఉరుములు, మెరుపులు ప్రొడ్యూస్ చేస్తున్న మనుషులు, ఆకాశంలోకి నల్లని పొగని పంపింగ్ చేస్తున్న వ్యక్తులు, తమ తమ పనులను మానేసి, కార్ల వైపు పరుగెత్తారు.

*　　*　　*

ఇసుకలో అగిపోయిన విమానం చుట్టూ శక్తివంత మయిన ఫ్లడ్ లైట్లు వెలుగుతున్నాయి.

డజన్లకొద్ది కార్లు అంబులెన్సులు, ఫైర్ యింజన్సు వున్నాయి అక్కడ.

లోపల వున్న ప్రయాణికుల్ని స్ట్రెచర్లమీద అంబులెన్సు లోనికి చేరుస్తున్నారు.

దూరంగా నిలబడి ఇదంతా చూస్తూ సిగరెట్టు తాగుతున్నారు బ్రిగేడియర్ విశ్వనాథ్, మేజర్ ప్రకాష్.

పత్రికా విలేఖరులు వారిని సమీపించాలని ప్రయత్నించి

విఫలులయిపోయారు. వారిని తరువాత కలుసుకుంటామని మాట ఇచ్చారు వాళ్ళు.

దాదాపు 19 గంటలపాటు విమానంలో చావు బ్రతుకుల మధ్య ఊగిసలాడిన ప్రయాణికులలో మళ్ళీ జీవకళ వచ్చింది. ఒకరినొకరు కాగిలించుకొని బావురుమంటున్నారు.

సులక్షణ నెమ్మదిగా బ్రిగేడియర్ వద్దకు వచ్చింది. "థాంక్స్!" అంది నెమ్మదిగా. నవ్వుతూ ఆమె భుజం తట్టాడు విశ్వనాథ్.

—: ఐపోయింది :—

# విష పురుగు!

## పోలవరపు ఆనందరావు

స్కూటర్ గేటు బయట ఆపి హారన్ నొక్కాను.

పనిపిల్ల అంబుజం పరుగెత్తుకొని వచ్చి గేటు తీసింది...

స్కూటరుని లోపలకు పోనిచ్చి పోర్టికోలో ఫియెట్ ప్రక్కనే ఆపాను. ఆసరికి గేటు వేసిన అంబుజం నా దగ్గరకు వచ్చి, "అమ్మగారు మీకోసం ఎదురుచూస్తున్నారు బాబూ!" చెప్పింది.

రెండు క్షణాలు అంబుజం కళ్ళలోకి చూశాను. చిన్నగా నవ్వాను. అంబుజం సిగ్గుతో మెలితిరిగి పోయింది.

అంబుజానికి దాదాపు ఇరవై ఏళ్ళుంటాయి. వాళ్ళ అమ్మా-నాన్నా తిరుచ్చిలో ఉంటారు. చిన్న వయసు లోనే ఆంధ్రదేశానికి పనిపిల్లగా వచ్చేసింది. ఆరేళ్ళుగా మా ఫ్యామిలీలాయర్ గారింట్లో పని చేసింది. మా వంట ముసలమ్మ చనిపోవడంతో, అమ్మపడే ఇబ్బంది చూడలేక

లాయర్ గారు, అంబుజాన్ని ఆరు నెలల క్రితం మా ఇంటికి పంపించారు.

అంబుజం కనుముక్కు తీరైనపిల్ల! చామనఛాయగా ఉంటుంది. పనిపిల్లగా ఉంటూ పని చేస్తుండటంవల్ల నేమో అవయవాలన్నీ పొందికగా, పుష్టిగా ఉంటాయి. నేను చదివే సెక్స్ పుస్తకాల పరిజ్ఞానంవలన కాబోలు అంబుజం కళ్ళల్లో ఏదో వాంఛ నాకు కనబడుతూ ఉంటుంది. 'కామెర్లరోగి' సామెతలాగ ఆ వాంఛ అంబుజం కళ్ళల్లోనే ఉందో-లేక నా కళ్ళల్లోనే ఉందో తెలీదుగాని, మొత్తానికి అంబుజాన్ని చూడగానే నాలో తీవ్రమైన వాంఛలు యుద్ధం చేస్తుంటాయి.

స్కూటరు శబ్దం విన్నది కాబోలు, అమ్మ వరండా లోకి వచ్చి, "ప్రసాద్" అని పిలవడంతో ఆలోచనలు ఆపి, అమ్మవేపు చూసి నవ్వి — వరండాలోకి వచ్చాను.

"ప్రసాద్! సరోజ మెయిల్ కు వస్తోంది. వెళ్ళి తీసుకు రా!" చెప్పింది అమ్మ.

సరోజ మామయ్య కూతురు! మా ఇంటిలో నేను ఎలా ఒక్కడినో మామయ్యకు కూడా సరోజ ఒక్కతే కూతురు. సరోజకూ - నాకూ పెళ్ళి చేయాలని అందరి ఏకాభి ప్రాయం! సరోజను నేనూ ప్రేమించాను.

సరోజ పోయిన సంవత్సరమే డిగ్రీ ముగించింది. నేను ఇంకా ఫైనల్ ఇయర్ లోనే ఉన్నాను. సరోజ చూపే ప్రేమ, చనువు నాకు యీ భేదాన్ని గుర్తు చేయడం లేదు.

ఈ ప్రేమకథ ఇలాగే సాగిపోతే యెలాగుండేదేమో గాని, నాకు నిర్మలతో పరిచయం కలిగి, అభివృద్ధి చెంద

టంతో నా మనసులో అప్పటివరకూ ఉన్న సరోజ స్థానం క్రమేపి చిన్నదై పోయింది. సరోజకంటే నిర్మల అంద కత్తె. నా థియరీ ప్రకారం ఎంత అందమైన అమ్మాయి అయితే, మనసుకూడా అంత అందంగా వుంటుంది. పైగా నిర్మల నన్ను చాలా గాఢంగా ప్రేమిస్తోంది కూడా!
టైమ్ చూశాను. మెయిల్ రావడానికి యింకా అర గంట టైం ఉంది. ఉషారుగా లోపలకు నడిచాను.

షవర్ నుండి గోరువెచ్చటి నీరు శరీరంమీద పడు తోంది. చాలా హాయిగా అనిపించింది. మనసంతా సరోజవేపు లాగుతోంది. బహుశా సరోజకూ నాకూ మధ్య నున్న శరీర సంబంధమే దీనికి కారణం కాబోలు...!

సరోజ నన్ను ప్రేమించింది. తన శీలాన్ని ఏ సంకో చమూ లేకుండా అడిగిన వెంటనే నాకు అర్పించింది. అప్పట్లో సరోజను మోసం చేద్దామనే ఐడియా నాకు లేదు; కాని నిర్మలలాంటి అందగత్తె నిన్నే ప్రేమిస్తు న్నాను అని వెంటపడితే ఏ మగాడు మాత్రం కాదన గలడు?
సరోజ రాగానే అసలు విషయం చెప్పేయాలి! శారీ రక సంబంధం ఉన్నంత మాత్రాన పెళ్ళి చేసుకోవాలని ఎక్కడుంది? తనకూ కోరిక ఉండబట్టే ఆరోజు అలా లొంగిపోయింది. అందులో నా తప్పు ఎంతమాత్రమూ లేదు. ఆడది అయినందుకు తను జాగ్రత్తగాఉండాల్సింది. నాకు ఇంత తేలికగా లొంగిపోయిన ఆడది ఇంకొకరికి మాత్రం ఎందుకు లొంగిపోయి ఉండదు? ఇలాంటి వాళ్ళను అసలు నమ్మకూడదు.
నిర్మల చాలా స్ట్రిక్టుగా ఉంటుంది. చేయిని కొంచెం

చనువుగా గట్టిగా నొక్కితేనే రెండురోజులు మాట్లాడరు. తన శీలాన్ని యెంతో జాగ్రత్తగా రక్షించుకుంటోంది. పెళ్ళి తరువాతే నాకు చనువుగా ప్రవర్తించే హక్కు ఉంటుందట! నిర్మల థియరీ కూడా నాకు బాగా నచ్చింది. నిర్మలలాంటి మానాభిమానాలుగల అమ్మాయి నాకు భార్యగా రావడం కంటే అదృష్టం యేముంటుంది?

స్నానం ముగించి, డ్రెస్ చేసుకుని, ఫియెట్‌లో స్టేషన్‌కు బయలుదేరాను.

కారు పార్కు చేసి, స్టేషన్‌లోకి ప్రవేశించేసరికి ప్లాట్‌ఫారం టికెట్ బుకింగ్ వేపు నడవబోయాను. అంతలో ఎగ్జిట్ ద్వారంనుండి సరోజ సూటుకేసుతో బయటకు రావడం కనిపించింది.

సరోజను చూడగానే శరీరం మత్తుగా జలదరించింది. ఇదివరకటి కంటే కొంచెం లావయింది. తెల్లటి చీరలో నిండుగా కనిపిస్తోంది.

మా ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి. మెల్లిగా సరోజవేపు నడిచాను. నన్ను చూడగానే సరోజ మొహంలో ఏదో వెలుతురు చోటుచేసుకుంది. ఆ కళ్ళల్లో కనపడే మెరుపుకు నేనే కారణం అనుకోగానే కాస్త గర్వంగా ఉంది.

"బాగున్నావా బావా?" ప్రేమగా అడిగింది.

చిన్నగా నవ్వి, తలూపి సూటుకేసు నా చేతుల్లోకి తీసుకున్నాను. ఇద్దరం కారువేపు నడిచాము.

"ఏమిటి బావా, బొత్తిగా లెటర్స్ వ్రాయడమే మర్చిపోయావు? కొంపదీసి దుష్యంతుడివి అయిపోలేదు కదా!" అడిగింది దారిలో.

"అబ్బే! అదేమీ లేదు. పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కదా" చెప్పాను. కాని, ఈ కారణం ఒక్కటే సరోజకు నమ్మకం కలిగించడం కష్టమని తెలుసు! మెల్లిగా రెండు మూడు రోజులలో అసలు విషయం చెప్పాలి!

సరోజను చూడగానే అమ్మ మొహం వెలిగిపోయింది.

ఇదివరకు అలాంటి వెలుగును చూసి తృప్తిగా ఫీలయ్యేవాడిని. కాని, ఈసారి మాత్రం నాకు అంతగా నచ్చలేదు. అమ్మ సరోజమీద అంతగా ప్రేమానురాగాలు పెంచుకోవడం మంచిది కాదనిపిస్తోంది. మామయ్య కూతురు అనే బంధం తప్పితే సరోజలో ఏ ప్రత్యేకతా లేదు. దేశంలో సరోజలాంటి ఆడపిల్లలు చాలా తక్కువ అని అమ్మ అభిప్రాయం!

అమ్మ సరోజను లోపలకు తీసుకెళ్ళింది.

## 2

"నిర్మల ఇంట్లో ఉందా?" అడిగాను.

రాఘవులు నవ్వాడు. ఎప్పుడు జర్దాకిళ్ళీ నములుతూండటంవల్ల కాబోలు పళ్ళన్నీ గారపట్టి ఉంటాయి. ఆ నవ్వు చూస్తేనే నాకు కంపరంగా ఉంటుంది. అయినా భరించాలి! తప్పదు. ఆ నవ్వు వెనుక నిర్మల నవ్వు దర్శనమవుతుంది. గులాబీపువ్వుచుట్టూ ముళ్ళు ఉండటం అంటే ఇదేనేమో!

రాఘవులు నిర్మలకు మేనమామట! వయసు నలభై ఏళ్ళపైన ఉంటాయి. నిర్మల పుట్టిన రెండేళ్ళకు తండ్రిని పోగొట్టుకుంటే, నిర్మలను, నిర్మలతల్లి సుభద్రమ్మను ఈయనే పెంచి పెద్దచేశాడని నిర్మల చెబుతూవుంటుంది, ఏం పని చేస్తాడో తెలీదుగాని, నాకళ్ళెదురుగా రెండు

మూడుసార్లు మనియార్డరు అందుకున్నాడు. విశాఖపట్టణంలో తనకు ఇల్లు ఉందని ప్రతినెలా అద్దె ఐదువందల దాకా వస్తుందని, చెప్పాడు.

ఆ నవ్వు నాకు ఎంత కంపరంగా ఉన్నాగాని, నా హృదయాన్ని యెంతో బాధ్యతగా పెంచి పెద్దచేసి చదువు చెప్పిస్తున్నాడంటే నాకు పూజ్యనీయుడే!

రాఘవులు సమాధానం చెప్పకుండా నవ్వాడంటే లోపలే వుండి వుంటుంది. నేనూ నవ్వి లోపలకు నడిచాను.

నిర్మల వాళ్ళది చిన్న ఇల్లు! మొత్తం అన్నిటికి కలిపి నాలుగు గదులు మాత్రమే! అద్దె వందరూపాయలపైనే ఇస్తున్నారు. వాటిల్లో నిర్మలకు ఒక రూమే ప్రత్యేకంగా కేటాయించబడివుండ. గదికి ఒక ప్రక్కగా బెడ్ ఉంది. బెడ్‌కు ఎదురుగా కిటికీ! దానికి ప్రక్కనే రీడింగ్ టేబిల్ వుంది. దానిపైన నిర్మల బుక్స్ ఉంటాయి.

గదిలో రెండు గాడ్రెజ్ ఛేర్స్ ఉన్నాయి. కిటికీలో మనీప్లాంటు ఉంది. అది నా కళ్ళముందే రోజురోజుకీ పెరుగుతోంది. మా ప్రేమ కూడా దానిలాగానే నిముష నిముషానికీ బలపడుతోంది.

నిర్మల మంచంమీద కూర్చుని చదువుతోంది. నన్ను చూడగానే పుస్తకం మూసి చిరునవ్వు నవ్వి లేచి నిలబడింది.

"సారీ, నిర్మలా! నిన్ను డిస్టర్బ చేసినట్టున్నాను" అన్నాను కొంచెం బాధగా.

"సారీ ఎందుకు? ఈ చదువు అంతా మీకోసంకాదా? ఎంత చదివినా మీకు సేవచేయుటమే కదా నా జీవిత లక్ష్యం!" ప్రేమగా అన్నది నిర్మల.

నేను నిర్మలమైన నిర్మల కళ్ళల్లోకి చూస్తూ కుర్చీలో కూర్చున్నాను. ఈరోజు నిర్మల మరీ అందంగా కనిపిస్తోంది. గోల్డుస్పాటు కలర్ మ్యాచింగ్ డ్రెస్‌లో ఉష స్సులా వెలిగిపోతోంది. చేపపిల్లలాంటి ఆసోగకళ్ళల్లో నా జీవితాన్ని బంధించి ఆజ్ఞాపించగల మెరుపులున్నాయి. ఆ పొడవాటి కురులలో నన్ను శాశ్వతంగా కట్టిపడేసే ఏదో తెలీని అజ్ఞాత ఆకర్షణ వుంది. ఆ బలమైన పొడవాటి తెల్ల చేతులలో నన్ను లాలించగల నేర్పు ఉంది. ఆ విశాలమైన ఒడిలో నేను శాశ్వతంగా నిద్రపోవాలనిపిస్తోంది. ఆమె గుండెలలో ప్రతి నిముషం ఉయ్యాల ఊగాలనిపిస్తోంది. ఆ సన్నటి గోల్డుచెన్ స్థానంలో పసుపు తాడు వేయాలనిపిస్తోంది.

"ప్రసాద్! యేమిటి అలా చూస్తున్నారు? రోజూ క్రొత్తేనా?" చిలిపిగా నవ్వుతూ అంది.

ఆ నవ్వులోని మృదుమధుర శబ్ద తరంగాలు నా హృదయాన్ని మీటుతున్నాయి.

"నిర్మలా! నువ్వు ఎప్పుడూ నా కళ్ళకు నూతన వధువులానే కనిపిస్తావు. నిన్ను శాశ్వతంగా నా దాన్ని చేసుకుని ప్రతిక్షణం చూసుకునేవరకు నాకు మనశ్శాంతి ఉండదు."

"ఎందుకంత వర్రీ అవుతారు? ఇంకో రెండు నెలల్లో ఎగ్జామ్స్ అయిపోతాయిగా."

అమాయకంగా అంటున్న నిర్మల మాటలు నాకు నవ్వును తెప్పించాయి. ఈ విషయం మా నాన్నకు తెలిస్తే ఎంత గొడవ అవుతుందో నేనూహించగలను. ఈ అమాయకురాలికి ఇంకా అంత అనుభవం ఎక్కడుంది?

"మామయ్యకూతురు సరోజ వచ్చింది" మెల్లిగా

చెప్పాను.

కొన్ని క్షణాలు నిర్మల ముహంలో రంగులు మారడం గమనించాను. దీనికే ఇలా అయిపోయింది. ఇక మామధ్య నున్న సంబంధం తెలిస్తే ఎంతగా అసహ్యించుకుంటుందో? నిర్మలది సున్నిత స్వభావం! పరిస్థితులను తట్టుకోగలిగే ఆత్మస్థయిర్యం ఇంకా అలవడలేదు.

నేను చెప్పినదానికి మౌనంగా వుండిపోయింది.

"నిర్మలా! ఇంకొద్ది రోజులలో మన విషయాన్ని నాన్నతో చెబుతాను. ఆయన ఉద్దేశ్యం ఏంటో తెలిసి పోతుంది" చెప్పాను.

నిర్మల ముహంలో నీలినీడలు చోటుచేసుకున్నాయ్. ఆ కళ్ళల్లో ఏదో తెలీని భయం లీలగా కనిపిస్తోంది. బెదిరి పోయే లేడి గుర్తుకువచ్చింది నాకు.

"ప్రసాద్! నేను మా కుటుంబం ఏ స్థితిలో ఉన్నామో మీకు తెలుసు! మీరు మా కంటే ఎన్నో రెట్లు ధనవంతులు. చాలామంది పెద్దలు వాళ్ళ పిల్లల ప్రేమల్ని డబ్బుకోసం ఆడే నాటకాలుగా చిత్రిస్తారు. ఆ వయసులో వాళ్ళకు హృదయాల్ని అర్థం చేసుకునే విశాలభావం ఉండదు. అందుకే నాకు కొంచెం భయంగా వుంది" విచారంగా అన్నది నిర్మల.

"నిర్మలా! భవిష్యత్తు ఏంటో మనం చెప్పలేం! కాని, నేను నిన్ను త్వరలోనే పెళ్ళి చేసుకోవటంలో మాత్రం ఎటువంటి సందేహంలేదు. నేను రేపు ప్రొద్దున్నే మా నాన్నతో మాట్లాడుతాను. ఆయన అంగీకరించనిపక్షంలో మనం రిజిస్టర్ మ్యారేజ్ చేసుకుందాం."

నిర్మలకు ధైర్యం చెప్పటానికి ఆ మాటలు అన్నానే గాని- నాకు మాత్రం ఈ వ్యవహారం అంత తేలికగా

ముగుస్తుందనే నమ్మకం లేదు.

"ప్రసాద్! నేను నీకు భార్యగా అవడానికి అదృష్టం లేనిరోజు నాకీ జీవితమే అనవసరం! నీకు ఉపయోగపడని ఈ నా శరీరం బూడిద కావలసిందే!"

నిర్మల బేలగా మృదువుగా అంటున్న మాటలలో నాకు దృఢనిశ్చయం స్పష్టంగా వినిపిస్తోంది.

"నిర్మలా! మన జీవితాలను గాలిపటాలుగా ఊహించలేకపోతున్నాను. నువ్వు నిశ్చింతగా ఉండు! రేపు ప్రొద్దున్నే మా నాన్నగారితో మాట్లాడుతాను."

టైమ్ చూశాను. నేను వచ్చి ఎక్కువసేపు కాకపోయినా, నిర్మల చదువుకు ఆటంకం అనే ఉద్దేశ్యంతో లేచి నిలబడ్డాను.

"అమ్మగారు ఎక్కడికెళ్ళారు?"

"గుడికి."

"వస్తా నిర్మలా! నువ్వు మనసులో దిగులేమీ పెట్టుకోకుండా చదువు! రేపు ఈ పాటికి నీకు గుడ్ న్యూస్ తెస్తాను." కళ్ళతోనే నవ్వి బయటకు నడిచాను.

# 3

"ఎక్కడికి వెళ్ళావు బావా? సాయంత్రం సినిమాకు వెడదామనుకున్నాను. నీకోసం ఎదురుచూసి మానుకున్నాను" గారంగా అడుగుతున్న సరోజను చూస్తుంటే గుండెల్లో ఏదో తెలీని గుబులుగా ఉంది.

స్కూటరు లాక్ చేసి, కీచైన్ ను చేతిలో తిప్పుకుంటూ సరోజదగ్గరకు వచ్చాను. సరోజ కళ్ళు నన్ను శల్య పరీక్ష చేస్తున్నాయి. నేనూ సరోజ అవయవాలను శల్య పరీక్ష చేస్తున్నట్టుగా చూస్తున్నాను. మా ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

"పోనీలే! సెకండ్ షోకి వెడదాం! ఏమంటావ్?"
సరోజకు ఇంకొంచెం దగ్గరకు జరిగాను. మత్తైన సువాసనలు గుండెల్లో దూరి శరీరం గాలిలో తేలిపోయేట్లు చేస్తున్నాయి.

"నీ ఇష్టం!" చెప్పి లోపలకు వెళ్ళింది సరోజ.

భోజనాలు ముగించేసరికి ఎనిమిదిన్నర అయింది.

చలిగాలివేస్తుండటంవలన స్కూటర్ మీద వెళ్ళాలని పించడంలేదు. థియేట్రు నాన్నగారు తీసుకెళ్ళారు.ఆయన క్లబ్ నుండి రావాలి!

సరోజ, నేను, అమ్మ వరండాలో కుర్చీలు వేసుకుని కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాము.

తొమ్మిదింబావుకు నాన్నగారు వచ్చారు. పనికుర్రాడు వెళ్ళి గేటు తీసాడు. కారు పోర్టికోలో ఆగింది.

డ్రైవరు నాన్నగారి బ్రీఫ్‌కేస్ తీసుకుని లోపలకు వెళ్ళాడు. ఆయన వరండాలోకి రాగానే మేం లేచి నిలబడ్డాం.

"నాన్నగారూ! నేనూ, సరోజ పిక్చరుకు వెడతాం" చెప్పాను సరోజవేపు ఓరగా చూస్తూ.

నాన్నగారు గుంభనంగా నవ్వుతుని,"అలాగే బాబూ! కారు తీసుకెళ్ళు! జాగ్రత్తగా వెళ్ళిరండి" చెప్పి లోపలకు నడిచారు. అమ్మ ఆయనను అనుసరించింది.

అభిరామి థియేటరులో ఆడుతున్న 'ఫియర్ ఓవర్ ది సిటీ'కి వెళ్ళాం. పిక్చరు వదిలేసరికి పన్నెండయింది.

"అంత ఘోరంగా ఆడవాళ్ళను ఎలా చూపగలిగాడో" పిక్చరులో విలన్‌ని గుర్తుకు తెచ్చుకుంటూ అడిగింది సరోజ.

నేను నవ్వాను.

"అదంతా కేవలం సినిమాకోసం నటన మాత్రమే! నిజ జీవితంలో అలా జరుగదు, అందులోను మన ఇండియాలో అసలు జరగదు" చెప్పాను యాక్సిలేటరు నొక్కుతూ.

ఇంటికి చేరుకునేసరికి పన్నెండు ఇరవై అయింది.

శరీరం అలసిపోయినట్లయింది. పని కుర్రాడు తలుపులు వేస్తున్నాడు. నా గది మేడపైన వుంది. అమ్మగది, నాన్న గది క్రిందే వున్నాయి.

సరోజకూడ క్రింద గదిలోనే వుంటోంది. నేను ముందే చెప్పడంలో సరోజ డ్రెస్ మార్చుకుని పైకి వచ్చేసింది. ఇంట్లో అంతా నిద్రపోతున్నారు.

సరోజ లోపలకు రాగానే రూమ్ తలుపు వేసాను. సరోజ నా వంక చూస్తోంది. నాలోని కామం నన్ను నిలువునా దహించివేస్తోంది. నిజంగా ఎంత సుఖం! ఈ సుఖంమీద ఆధారపడే ఈ లోకం మొత్తం నడుస్తోంది. పరుగెత్తుతోంది. ఆగి విశ్రాంతి తీసుకుంటోంది. అదే లేకపోతే చలన రహితమవుతుందేమో!

సరోజ శరీరంకూడా బుసలుకొడుతోంది.

కాలం ఎలా గడిచిపోయిందో తెలియదు. టైమ్ రెండున్నర అవుతోంది.

నా ప్రక్కనే సరోజ నిద్రపోతోంది. లేపి క్రిందకు వెళ్ళిపొమ్మని చెబుదామని రెండుసార్లు పిలిచాను. లాభం లేకపోయింది. ప్చ్! సరోజ ఎప్పుడూ ఇంతే! మాట్లాడుతూనే నిద్రపోతుంది. ఇంకా ఎక్కువసార్లు ప్రయత్నిస్తే మేలుకొనేదేమో గాని నా కళ్ళు అలసటతో, నిద్రాదేవి కల్పించిన మైకంతో వాలిపోతున్నాయి.

తెల్లవారుఝామున లేపి పంపవచ్చు అనే ధీమాతో

కళ్ళు మూసుకున్నాను. నాకు తెలీకుండానే గాఢనిద్ర లోకి జారుకున్నాను.

అమ్మ నన్ను పిలుస్తున్నట్టు, తలుపులు కొడుతున్నట్టు లీలగా కలలో వినిపిస్తున్నట్టుగా వుంది. కళ్ళు తెరుద్దా మని, మళ్ళీ మత్తుగా అలాగే పడుకుని ఉండిపోయాను. కొంచెంసేపు తరువాత అమ్మ పిలవడం ఆగిపోయింది 'కల' అయివుంటుంది అని నాకు నేను సమాధానం చెప్పుకుంటూ మళ్ళీ నిద్రలోకి జారిపోయాను.

## 4

"ప్రసాద్! నాన్నగారు నీతో మాట్లాడాలట!" ప్లేటులో ఇంకో పూరి వేస్తూ చెప్పింది అమ్మ.

నేను తలూపి ఆలోచిస్తుండిపోయాను. ప్రొద్దుట్నుంచీ సరోజ కనపడలేదు. ఏడున్నరకు నేను నిద్రలేచి చూస్తే తలుపులు ఓరగా వేసి ఉన్నాయి. సరోజ గదిలో లేదు. సరోజ ఎప్పుడు వెళ్ళిందో ఊహించలేకపోతున్నాను. తెల్లవార్లూ నా ప్రక్కనే వున్నట్లు లీలగా మెదులు తోంది. నేను కలగా ఊహించుకున్న అమ్మపిలుపు నిజమే నేమో! అలా అయితే కొంప మునిగినట్లే!

నేను ఈ రోజు సరోజతో నిజం చెప్పి నా దారికి అడ్డు రావద్దని వేడుకుందామనుకున్నాను. సరోజ మనస్తత్వం నాకు బాగా తెలుసు! తప్పకుండా ఒప్పుకుం టుంది. కాని, అమ్మకు మా మధ్యనున్న సంబంధం తెలిసి పోతే...ఇప్పుడేం చేయాలి? అమ్మ ముఖభావం చూసిన కొద్దీ నాలో అనుమానం పెరుగుతోంది. మనసంతా బరు వుగా అయిపోయింది.

తింటున్న పూరీని మధ్యలో ఆపి బేసిన్ దగ్గర చేతులు కడుక్కుని నాన్నగారి గదికి వెళ్ళాను.

ఆయన సోఫాలో కూర్చుని పేపర్ చదువుతున్నారు. నా బూట్స్ చప్పుడు విని తలెత్తి చూశారు.

ఒక్క క్షణం ఆయన కళ్ళల్లోకి చూశాను. కాని, ఆయన మొహంలోని భావాన్ని అర్థం చేసుకోలేక పోయాను.

సోఫా ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుని టీపాయ్ మీదున్న పేపర్ అందుకున్నాను.

"ప్రసాద్! నీ ఎగ్జామ్స్ ఎప్పుడు?" అడిగారు.

"ఇంకో నెల రోజులున్నాయి."

"ఈ నెలలో మంచి ముహూర్తాలున్నాయట! నేను వెళ్ళి మామయ్యతో మాట్లాడి వస్తాను."

నా గుండెల్లో రాయి పడింది. నేనూహించిన క్లిష్ట పరిస్థితి ఎదురయింది. నా మనసులోని ఉద్దేశ్యం చెప్పడానికి ధైర్యం చాలడంలేదు.

"ఏమంటావ్?" ఈ సారి ఆయన కంఠంలో భయంకరమైన గంభీరత తొంగిచూస్తోంది.

"అబ్బే, అదేమీ లేదు. పరీక్షలయిన తరువాత..."

"నీ రిజల్ట్స్ ఎలా వున్నా బాధలేదు. ఎలాగూ పై చదువులు చదవడంలేదుకదా! పెళ్ళిచేసుకుని ఈ బిజినెస్ అంతా చూసుకో! నేను ఇంట్లోనే వుండి నీకు సలహాలు ఇస్తుంటాను."

"ఇప్పుడే...అంత త్వరగా" నాకు నోరు పెగలటం లేదు. శరీరంలో సన్నగా ఒణుకు ప్రారంభమయింది.

"ప్రసాద్! డొంక తిరుగుడు వద్దు! నీ మనసులో ఉద్దేశ్యమేమిటో త్వరగా చెప్పేయి."

నాలో ఏదో తెలీని ధైర్యం తెగువ వచ్చేస్తున్నాయి. నేను ఈ క్షణంలో భయపడితే__?

"నాన్నగారూ! నేనొకమాట చెబుతాను. మీరు సీరియస్ గా తీసుకోకూడదు" అభయం కోరుతున్నట్టుగా అడిగాను.

"చెప్పు!" ఆయన కంఠంలో అభయమిచ్చిన సూచన లేమీ లేవు.

"నేను నిర్మల అనే అమ్మాయిని ప్రేమిస్తున్నాను. మా కాలేజీలోనే చదువుతోంది. చాలా మంచిపిల్ల!... ఆ అమ్మాయికి మాటకూడ ఇచ్చాను" ఎలా చెప్పానో నాకే తెలీడంలేదు.

పేపర్ చూస్తున్నాను. కళ్ళకు అక్షరాలు అలుక్కుపోయినట్లు కనిపిస్తున్నాయి. చెవులు ఆయన చెప్పే మాటలకోసం శ్రద్ధగా ఆరాటపడుతున్నాయి.

నిశ్శబ్దంగా వుంది!

పేపర్లోంచి ఓరగా ఆయన మొహంవేపు చూశాను. తెల్లగా ఉండే ఆయన మొహం కందగడ్డలా అయింది. తీక్షణంగా శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తున్నారు.

ఆ నిశ్శబ్దం నాకు చాలా భయంకరంగా వుంది. లేచి వెళ్ళి పోదామనిపిస్తోంది. కాని లేవడానికి కాళ్ళు నా స్వాధీనంలో లేవు.

"ఆ అమ్మాయి వివరాలేమిటి?" నేనూహించిన దానికంటే కఠినంగా, గంభీరంగా వుంది ఆ కంఠం!

చెప్పాను-

అంతా శ్రద్ధగా విన్నారు. నాలో ఏదో చిన్న ఆశ తళుక్కుమని మెరుస్తోంది.

"అయితే ఇప్పుడేం చేయదలుచుకున్నావ్."

ఆయన కంఠంలో భయం గొలిపే ప్రశాంతత.

"సరోజకు ఎక్కడైన మంచి సంబంధం చూసి పెళ్ళి

చేద్దాం!'' ఎందుకనో యీ మాట నాకే అహాస్యంగా ఉంది.

"నిర్మల వాళ్ళ గురించి వివరాలు తృప్తిగా లేవు...'' అన్నారు.

"నాన్నగారూ! నిర్మల లేకపోతే నేను ప్రాణాలతో వుండటం అసంభవం! నిర్మలను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. దయచేసి నా జీవితాన్ని త్రుంచివేయకండి'' ఎంతో గంభీరంగా చెబుదామనుకున్న నా మాటలలో ఏడుపు తొంగిచూస్తోంది.

"బాబూ! ఏ తండ్రీ తన బిడ్డ భవిష్యత్తు నాశనం చేయడు. అయితే ఇంకొక తండ్రి హృదయం బ్రద్దలవుతుంది అని తెలిసీ ఊరుకోలేడు. మీ మామయ్య చాలా మంచివాడు. అభిమానంగా బ్రతుకుతున్నాడు. మన మంటే ప్రాణాలుకూడా ఇస్తాడు. నువ్వు ప్రేమించడం తప్పు అనడంలేదు. నువ్వు ప్రేమించిన అమ్మాయి ఏ కులంలో పుట్టినా, ఏ జాతిది అయినా నేను ఒప్పుకుంటాను. కాని, యిప్పుడు పరిస్థితులు చేయిదాటి పోయాయి.''

"ఏమిటా పరిస్థితులు?'' ఉక్రోషంగా అడిగాను.

"ప్రొద్దున్నే మీఅమ్మ మిమ్మల్నిద్దరినీ నిద్ర లేపింది'' ఆ మాట ఆయన మెల్లిగా అన్నా నా హృదయంలోకి సూటిగా ప్రవేశించి బలంగా గుచ్చుకుంది.

నేను అనుకున్నంత ఐపోయింది. ఏది రహస్యంగా ఉంచాలనుకున్నానో అదే కొండంత వెలుగుతో నా ముందు వికృతంగా నాట్యమాడుతోంది. నా అదృష్టం క్షణికమైన కామోద్రేకానికి బలైపోతోంది. నిన్న ఒక్క రోజు నన్ను నేను నిగ్రహించుకున్నా నా జాతకం

ఇంకోలా ఉండేదేమో!

ఇప్పుడేం చెప్పను? ఎలా సమర్థించుకోను?? నిర్మలను దక్కించుకునే దారి ఏది???

న్యాయమో, అన్యాయమో! నిర్మలను మాత్రం నేను వదులుకోలేను. నిర్మల అపురూప సౌందర్యం నా నర నరాల్లోనూ, ప్రతి రక్తపుబిందువులోనూ ప్రతిబింబిస్తూ నన్ను నిర్మలకు దాసుడిని కమ్మంటోంది. రేపు సరోజను చేసుకుని రోజూ నిర్మలను గుర్తుకు తెచ్చుకుని బాధపడే కంటే, వీళ్ళందరినీ వదిలేసి నిర్మలను చేసుకోవడమే మంచిది.

"క్షమించండి! నేను నిర్మలను తప్ప వేరేవాళ్ళను పెళ్ళి చేసుకోలేను," దృఢంగా చెప్పేసాను.

"మరి సరోజను ఏం చేసుకుంటావ్?" వ్యంగ్యంగా అడిగారు.

ఈ ప్రశ్నకి నేను సమాధానం చెప్పలేను. మౌనంగా ఊరుకున్నాను.

"ప్రసాద్! నీవు అంత దృఢ నిశ్చయానికి వచ్చిన తరువాత నేను ఒక నిర్ణయానికి రావడం మంచిది. నువ్వు చదువుకున్నంతవరకు చదువు చెప్పిస్తాను. ఈ ఆస్తి మొత్తం సరోజ పేరుమీద వ్రాసేస్తాను. నీ లాంటివాడిని కన్నందుకు బాధ్యతగా నీ కాళ్ళమీద నీవు నిలబడేవరకు పోషిస్తాను."

ఆయన మాటకు యెంత విలువ ఇస్తారో, అలాగే ఆ మాటకూడా అంత ఖచ్చితం!

చిన్నప్పటినుంచీ లేమి రుచి యెటువంటిదో నాకు తెలీదు. కనీసం ఇటువంటిది అని కూడ నేను ఎప్పుడు ఊహించలేదు. అయినా నిర్మల అందంముందు ఈ ఆస్తి

ఒక లెక్కా?

"సరే! మీ నిర్ణయం అలాగే అమలుపరచుకోవచ్చు. నేను చెప్పగలిగింది అంతే!"

లేచి నిలబడ్డాను. ఇక నాన్నగారితో ఈ రకమైన సంభాషణను పొడిగించడం నాకు ఇష్టంలేదు.

నాన్నగారు కళ్లు మూసుకుని వెనక్కు వాలారు.

నేను గబగబ బయటకు వచ్చాను. సరోజ కాఫీకప్పుతో ఎదురువచ్చింది. సరోజ చిరునవ్వు నవ్వుతోంది. ఒకప్పుడు ఆ నవ్వు నాలో కామజ్వాలలు, ప్రేమజ్వాలలు రగిలించింది. కాని—ఈనాడు ఆ నవ్వు అగ్నిజ్వాలలు రగిలిస్తోంది.

"బావా! కాఫీ తాగడం మరచిపోయావ్!" కప్పు అందించింది.

కాని, నేను అందుకోలేదు. రెండుక్షణాలు క్రూరంగా సరోజ కళ్ళలోకి చూశాను. నా కళ్ళలోకి చూసిన సరోజ కళ్ళలో బెదురు తళుక్కుమంది. వేగంగా నడుస్తూ పోర్టికోలోకి వచ్చి, స్కూటర్ బయటకు తీసాను.

## 5

"...మా నాన్నగారు చెప్పిన నిర్ణయం విన్నారుగా! ఇక మీ నిర్ణయాలుకూడ చెప్పండి" చెప్పటం ఆపి అందరి వైపు ఒకసారి దృష్టి సారించాను.

"బాబూ! ఏ తండ్రీ కన్నకొడుక్కి అంత ద్రోహం చేయడు. ఆ కోపంలో అలా అంటారు తప్పితే అంత పని చేయలేరు. ఏది ఏమైనా, నీ డబ్బుకన్నా నీవే మాకు బంగారానివి! ఆస్తిపోతే పోయిందిలే, నువ్వు మాకు అల్లుడివి ఐతే చాలు! పైగా మా అమ్మాయి తన ఆశలన్నీ నీ మీదే పెట్టుకుంది. ఏంచేసినా సరే నీ యిష్టం" అన్నది

సుభద్రమ్మ.

ఆమె మాట వింటుంటే నాకు గర్వంతో, ఆనందంలో నోట మాట రావడంలేదు. ఈవిడ ఆప్యాయతలో అందరినీ మరచిపోగలననిపిస్తోంది.

"నిర్మలా! నీ అభిప్రాయం...?" అడిగాను.

"మీ ఇష్టం...మీరు ఎలా చేసినా నాకు సంతోషమే।" మందస్వరంతో అంది.

"అయితే రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్ళికి ఏర్పాటుచేసి వస్తాను."

అందరూ తలలూపారు.

రాఘవులుతో సెంటర్ కొచ్చాను. ఇద్దరమూ 'రెయిన్‌బో' బార్ వేపు నడిచాము. అప్పుడప్పుడు నేనూ, రాఘవులూ బార్ కొచ్చి త్రాగుతూంటాం. మొదట్లో అతన్ని మచ్చిక చేసుకునేందుకు ఈ బార్‌కి తీసుకొచ్చేవాడిని. ఆ తరువాత అలవాటయిపోయింది.

బార్‌లో డిమ్‌లైట్స్ వెలుగుతున్నాయి. మనుషులు చాలా మంది వున్నా మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. ఫోర్క్స్, స్పూన్స్ చప్పుళ్ళు వినబడుతున్నాయి.

బేరర్ వచ్చాడు. విస్కీకి ఆర్డర్ ఇచ్చి, నేనూ రాఘవులూ సిగరెట్స్ ముట్టించాం.

"ప్రసాద్! పెళ్ళి చేసుకున్న తరువాత నిర్మలను ఎలా పోషిస్తావ్?"

ఉలిక్కిపడ్డాను ఈ ప్రశ్న ఇంతవరకూ నాకు తట్టలేదు. నిజమే, ఎలా పోషించగలను? నా చదువుముగించి, ఏదైనా ఉద్యోగం చూసుకునేంతవరకూ ఎలా పోషించాలి? ఇంత ఖరీదైన జీవితానికి అలవాటు పడిన నేను ముందు ముందు ఎలా జీవించగలను?

"ప్రసాద్! బాధపడకు! నీకు ఉద్యోగం వచ్చేవరకు నిర్మల ఏదైనా ఉద్యోగం చేస్తుందిలే!" ఊరడిస్తున్నట్టు అన్నాడు రాఘవులు.

"స్టాపిట్" అరిచాను.

అందరూ మావైపు ఆశ్చర్యంగా చూశారు.

నా అభిమానం పూర్తిగా దెబ్బతింది. మా కుటుంబం తరతరాలుగా ఎంతో వున్నతమైంది. ఆడవాళ్ళు ఉద్యోగం చేయడం, దానిమీద ఆధారపడి మగవాళ్ళు బ్రతకడం అంటే ఏమిటో నేను కలలో వూహించలేను సహించలేను కూడా!

నిర్మలను పెళ్ళి చేసుకుని హాయిగా హనీమూన్‌కి వెళ్ళి రావాలనుకున్న నాకు ఇలాంటి పరిస్థితి ఎదురయింది. పాపం! రాఘవులు కావాలని నన్ను అవమానించడం లేదు. పరిస్థితి ఎత్తిచూపిస్తున్నాడు. అతనికి ఆ మాత్రం బాధ్యతవుంది అని నేను అర్థం చేసుకోగలను.

మనసంతా భవిష్యత్తు గురించి అల్లకల్లోలమై పోయింది. ఆస్తి దక్కదని తెలిసిన కొన్ని గంటలలోనే ఇంత మానసిక వేదన అనుభవించాల్సి వచ్చింది. ఇక జీవితంలో ఎంత భయంకరమైన వేదనకు గురికావాలో... ఈ భయంకర పరిస్థితుల్లో ఏం చేయగలను? నాన్నగారి మనసు మారదు. ఆయన కొడుకుని అవడంతో నా మనసూ అంతే!

రాఘవులుని అడిగాను ఏదైనా వుపాయం చెప్పమని.

రాఘవులు నవ్వాడు. "నేను చెప్పగలను, కాని, అది విని, ఆచరించే ధైర్యం, తెగువ నీలో వున్నాయా?" అడిగాడు.

నా అహం దెబ్బతింటోంది.

విస్కీ, సోడా, చిప్స్ టేబిల్ మీద వాలాయి. విస్కీ రెండు గ్లాస్‌లలో పోసి సోడా కలిపాను.

పదినిమషాలు గ్లాస్‌ని ఖాళీచేస్తూ మౌనంగా వుండి పోయాం.

శరీరం మెుద్దబారటం మెుదలైంది. నిషా మెదడుని స్వాధీన పరచుకుంటోంది. చిప్స్ నములుతూ మరో సిగరెట్ వెలిగించాను.

"రాఘవులు! ఈ లోకంలో ఎవ్వరూ శాశ్వతంగా వుండిపోలేరు. మనం చచ్చిపోవడం అనేది తప్పనిసరిగా జరిగేదే! బ్రతికిన ఈ కొద్ది కాలంలోనూ ఆనందంగా సుఖాలనుభవిస్తూ జీవించి చచ్చిపోవాలనేది నా తత్వం! ... నేను నిర్మల కోసమే జీవిస్తున్నాను. నిర్మలా — నేను సుఖపడటానికి ఏమైనా చేస్తాను." ఆవేశంగా చెప్పాను.

"అయితే సరి! నీ అభిప్రాయలకు సరిపోయే ప్లాన్ చెబుతాను విను. చేయగలిగితే నే...బలవంతం ఏమీ లేదు."

రాఘవులు రెండు గుటకలు వేసి సిగరెట్ వెలిగించి, మంద స్వరంతో చెప్పటం మెుదలు పెట్టాడు.

## 6

రిజిస్ట్రార్ ఆఫీస్‌లో నిర్మలతో నా పెళ్ళి అతి నిరాడంబరంగా జరిగిపోయింది.

పెళ్ళికి ఎవరినీ పిలువలేదు. కనీసం స్నేహితులను కూడా పిలవడానికి భయం వేసింది. ఎవరైనా ఈ విషయం తెలుసుకుని ప్రచారం చేశారంటే నా ప్లాన్ చెడిపోతుంది.

నిర్మల తరఫున కూడా ఎవరూ రాలేదు. సుభద్రమ్మ, రాఘవులు మాత్రమే వచ్చారు. రాఘవులు ఓ ఫొటో

గ్రాఫర్‌ని పిలుకుని వచ్చి ఫోటోలు తీశాడు.

నిర్మల లాంటి సౌందర్యరాశి నా స్వంతం అను కుంటుంటేనే మనసు ఆనందంతో గాలిలో తేలుతుంది. ప్రస్తుతం నా అంత అదృష్టవంతుడు ఎవడూ లేడేమో! ఈ రోజుల్లో ఎంతమంది ప్రేమికులు పెళ్ళి చేసుకో గలుగుతున్నారు? ఈ క్షణంనుండి నిర్మల బరువు బాధ్య తలు నావే! ఈ బాధ్యతలో ఎంతో హాయివుంది.

పెళ్ళి అయిన తరువాత అందరం నిర్మల ఇంటి కొచ్చాం!

పెళ్ళి కాకముందు ఎంతో ప్రీగావుండే నిర్మల ఇప్పుడు ఎంత గానో సిగ్గుపడుతోంది. ఆ సిగ్గులో మరింత అందంగా కనబడుతోంది.

భోజనాలు అయిన తరువాత నిర్మల నేనూ ఒంటరిగా మిగిలాం. మెల్లిగా నేనూ, రాఘవులు వేసుకున్న ప్లాన్ గురించి చెప్పాను.

"ఇందులో మనకేమీ ప్రమాదం వుండదు కదా!" భయంగా అడిగింది.

నాకు నవ్వు వచ్చింది. అందుకేనేమో స్త్రీలను అబలలుగా చిత్రిస్తారు రచయితలు అనిపిస్తోంది. ఇందులో భయపడాల్సిన అవసరం ఏముంది? ముందు ప్రమాదంగా కనిపించినా ఆ తరువాత దొరికే సుఖాలను తలుచుకుంటే ఇలాంటివి ఎంతమాత్రమూ ప్రమాదాలుగా అనిపించవు. అదే విషయాన్ని నిర్మలకు వివరించి చెప్పాను నా కౌగి ట్లోకి తీసుకుంటూ.

"ఏమో! మగవారు మీరు వున్నారు. నాకు ఆలో చించాల్సిన అవసరం ఏముంది? మీకు మంచిది అనిపిస్తే చేయండి..." అన్నది నిర్మల నన్ను పెనవేసుకుపోతూ.

# 7

"నాన్నగారూ! మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి. సరోజను నేను పెళ్ళి చేసుకుంటాను."

ఈ మాట అంటున్నప్పుడు కొంచెం గిల్టీగా ఫీల్ అయ్యాను. ఆయన మొహంలో ఏ భావమూ కనబడటం లేదు. ఒకసారి నేను ఒప్పుకోలేదు. ఈసారి ఈయన పంతం కొద్ది ఒప్పుకోకపోతే నా భవిష్యత్తుకి చాలా ప్రమాదం! నేను వేసుకున్న పథకం ఈ విషయం మీదే ఆధారపడి వుంది. పైగా విల్లుకూడ సరోజ పేరు మీద వ్రాయడం అయిపోయింది. ఈయన నన్ను నమ్మగలగాలి! కాదు, ఈయన నమ్మేట్టు నేను నటించగలగాలి!

"నా ఇష్టం ఏముంది? ముందు నీకు ఇష్టముండాలి కదా!" గంభీరంగా అన్నారు అక్వేరియంలోని చేపలను చూస్తూ.

"నాకు ఇష్టమే!" అంతకంటే ఎలా చెప్పాలో అర్థం కావడం లేదు.

"అదే అడుగుతున్నాను. ఆస్తిమీద ఇష్టమా? లేక సరోజమీద ఇష్టమా? ఆస్తి పోతుందని బలవంతంగా ఒప్పుకుంటున్నావా?"

అవమానంతో ఒక్కసారి భగ్గుమంది నా హృదయం! నా తండ్రి దగ్గర, నా ఆస్తికోసం ఇలా దోషిలా నిలబడి అర్థం లేని సంజాయిషీలు ఇచ్చుకోవలసిన పరిస్థితి ఏర్పడిందంటే, దానికి కారణం—ఆ సరోజే!

సరోజ మీద కసి, ద్వేషం పొంగుతున్నాయి.

"మీరు ఎలా అనుకున్నా బాధలేదు. కాని, సరోజ లాంటి అమాయకురాలిని మాత్రం మోసం చేయలేను. నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. మీకు అంతగా అనుమానముంటే మీ ఆస్తిని ఏ అనామ

కుడికో వ్రాయండి. నాకు అభ్యంతరం లేదు." చెప్పాను.

ఈ మాటమీద ఇంకేమైనా అడిగి, నిన్ను ఇరకాటంలో పెట్టగల సమర్థుడు ఆయన! వెంటనే నారూమ్‌కు వచ్చేసాను.

సిగరెట్ వెలిగించి బెడ్ మీద వాలాను. మనసంతా ఏమిటోగా అవుతోంది. నిర్మల సాన్నిధ్యంలో అయితే నా బాధలన్నిటినీ మరచి పోగలను. ఎప్పుడు బేవార్సుగా కనబడే రాఘవులు నాకు మార్గదర్శకుడు అవుతాడని, నేను ఏనాడూ ఊహించలేదు. మనం ఊహించనివి జరగటమే జీవితమేమో!

ప్రొద్దున్నే అమ్మ దగ్గరకూడ ఈ విషయం గురించి చాలాసేపు వాపోయాను. ఆవిడ నమ్మేసింది. తన జీవితంలో ఇంతవరకు అంత సంతోషకరమైన వార్త వినలేదట! నాన్నగారిని ఆవిడ మార్చగలదు. నాకు ఆ నమ్మకం వుండటంతో ఆ సంభాషణను అట్టే పొడిగించకుండా వచ్చేసాను.

ఆలోచనల్లో సిగరెట్ ఆరిపోయింది. అగ్గిపెట్టె కోసం టేబిల్ దగ్గరకు వెళ్ళాను. గిరీష్ ఇచ్చిన శుభలేఖ వుంది! ప్రొద్దున్నే వచ్చి, ఇచ్చి వెళ్ళాడు. అందరినీ మరీ మరీ రమ్మని చెప్పాడు.

గిరీష్ నాకు క్లోజ్ ఫ్రెండ్! వాడి పెళ్ళి ఇంకో నాలుగు రోజులలో, అంటే జూలై పన్నెండవ తారీఖు రాత్రి "గాయిత్రి కళ్యాణ మండపం"లో జరగబోతోంది. వాడు నాతో ఎంత క్లోజ్‌గా వున్నా కొన్ని కొన్ని విషయాలు వాడిదగ్గర చర్చించను.

సిగరెట్ వెలిగించుకుంటూ ఆ శుభలేఖనే చూస్తు

న్నాను. అది నాకు శుభం చేకూర్చేదిలా వుంది. నేను చూడబోయే స్వర్గానికి ఆ శుభలేఖ అనుమతి పత్రం!

టైమ్ రెండున్నర అవుతోంది.

ఫ్యాన్ ఫుల్ స్పీడ్‌లో పెట్టి బెడ్ మీద వాలి పోయాను.

నిద్ర లేచేసరికి ఐదున్నర కావొస్తోంది. బద్ధకంగా ఒళ్లు విరుచుకుని కిటికీ దగ్గరకు వెళ్ళి, కర్టెన్ తొలి గించాను. నీరెండ పడుతోంది. పోర్టికోలో ఫియట్ ప్రక్కనే ఆగివున్న మారిస్‌ని చూడగానే నాహృదయం ఆనందంలో పొంగిపోతుంది.

నా పథకం విజయవంతం అయ్యే సూచనలు కనబడు తున్నాయి. ప్రొద్దున్న అమ్మ దగ్గర బాధపడినది వృథా కాలేదన్న మాట! లాయర్ శివానందంగారు ప్రస్తుతం నాకు దైవంలా అనిపిస్తున్నాడు. నా భవితవ్యాన్ని దిద్దేది ఆయనే కదా! తప్పకుండా నాన్నగారు విల్లు మార్చి వ్రాయించుతూ వుండి వుంటారు!

హుషారుగా ఈల వేసుకుంటూ స్నానం ముగించి, డైనింగ్ రూమ్‌కు వెళ్ళాను.

అమ్మ, సరోజ టిఫిన్ తింటున్నారు.

నన్ను చూడటంతోటే సరోజలేచి, బేసిన్‌లో చేయి కడుక్కుని, నాకు కూడా చపాతీ వడ్డించింది.

"ప్రసాద్! మరి. మామయ్యా దగ్గరకు వెళ్ళి రమ్మం టావా?" అడిగింది అమ్మ.

నేను చిరునవ్వుతో సరోజవేపు చూశాను. సరోజ మొహంలో ఆత్రుత తొంగిచూస్తోంది.

"అదేమిటమ్మా? మగ పెళ్ళివాళ్ళం మనం వెళ్ళడం ఏమిటి? వాళ్ళే రావాలిగాని," అన్నాను నవ్వుతూ.

"అబ్బో, గొప్ప!" సరోజ వెక్కిరిస్తూ అంది.

"ఏడిశావ్ లేరా! అన్నయ్య నా కంటే పెద్దవాడనే గౌరవం కొద్దీ నేనే వెళ్ళి అడగాలి. కాస్త టిక్కెట్ రిజర్వ్ చేసిరా!" అంది అమ్మ.

నా ప్లాన్ విజయవంతమవడానికి ఇది మరో మెట్టు.

"ఎల్లుండికి చేస్తాను. నువ్వు అన్నీ తీరికగా సర్దుకుని వెళ్ళవచ్చు! అన్ని విషయాలు మాట్లాడి మెల్లిగానే రా! ఇక్కడ ఇబ్బందేమీ వుండదు," అన్నాను.

అమ్మ నవ్వింది.

"కనీసం పదిరోజులైనా వుండివస్తాను. ఇక్కడ నా కోడలు వుండగా ఇబ్బంది ఏముంది?"

సరోజ గర్వంగా నావైపు చూస్తోంది.

"అమ్మా! లాయర్ గారు వచ్చినట్టున్నారు" మెల్లిగా సంభాషణ ధోరణి మారుస్తూ అడిగాను.

"అవును!...మీ నాన్నగారికి ఎప్పుడూ తొందరే!" ముభావంగా అంది.

అమ్మ మాటలోని అర్థం నాకు అంతుబట్టలేదు. నాన్నగారు తొందర పడటం ఏమిటి? అంటే, నా పేరు మీద ఆస్తి వ్రాయడం అమ్మకు ఇష్టం లేదా? అమ్మ అలా ఆలోచించే మనిషి కాదే! అమ్మనే వివరంగా అడుగుదామని పించింది.

ఇంతలో అంబుజం వచ్చింది.

"అమ్మా! అయ్యగారు రమ్మంటున్నారు" చెప్పి కిచెన్ రూమ్‌లోకి వెళ్లిపోయింది.

అమ్మ చేయి కడుక్కుని, నాన్నగారి రూమ్ వేపు వెళ్లింది.

సరోజ వేపు చూశాను. ఎటో చూస్తూ ఆలోచి

స్తోంది.

"సరోజా నీ అభిప్రాయం ఏమిటి?" అడిగాను చేతులు కడుక్కుంటూ.

ఉలిక్కిపడి నవ్వింది.

"బావా! నిన్ను ప్రేమించాను. పెళ్లికాని ఆడపిల్ల ఏం చేయకూడదో, నీకోసం, నీమీద నమ్మకంతో, ఎంత వరకూ వెళ్ళగలనో అంతవరకూ వెళ్ళాను. అంతా నీకు తెలుసు! నువ్వు మనసు మార్చుకుంటావని నేను ఎప్పుడూ ఊహించలేదు...నీ ఇష్టమే నా ఇష్టం!"

సరోజ అంటున్న ఒక్కొక్క పదం మెత్తని కత్తిలా నా హృదయంలో గుచ్చుకున్నాయి.

ప్రస్తుతం నేను రెండువేపులా మంచి పదునుగల కత్తితో ఆడుకుంటున్నానేమో అనిపిస్తోంది...!

# 8

స్కూటర్ పోర్టికోలో ఆపి, హాలులోకి వచ్చాను.

అంబుజం ఎదురువచ్చింది. అంబుజం ఈ రోజు ఎందుకనో మరీ సెక్సీగా కనిపిస్తోంది. బహుశా నాలో ఆల్కహాల్ పని చేస్తుండటం వలన కాబోలు! ఒక్క క్షణం మనసు ఊగిసలాడింది అంబుజాన్ని బలంగా ముద్దు పెట్టుకోవాలని! నిలద్రొక్కుకుని చిరునవ్వు నవ్వాను.

"సరోజ ఎక్కడుంది?" అడిగాను.

"వంటింట్లో వున్నారు. స్వీట్లు చేస్తున్నారు." నా కళ్ళల్లోకి ఆశగా చూస్తూ చెప్పింది అంబుజం.

"పెళ్ళికి వెళ్ళాలి! రెడీగా వుండమని చెప్పు!"

గబగబా నా రూమ్‌కి వచ్చాను. టేబిల్ మీద 'శుభ లేఖ' అందంగా నవ్వుతుంది. తీసి జేబులో పెట్టుకున్నాను.

నా డ్రాయర్ సొరుగు కొంచెం ఇవతలగా జరిగివుంది. అనుమానంగా లాగి చూశాను. తాళం వేయడం మరచి పోయినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను.

నా డైరీ ఈ సొరుగులోనే వుంటుంది! డైరీలో నిర్మలతో నా వివాహ విషయాలు కూడా వ్రాసుకున్నాను. సరోజగాని ఈ డైరీ చదవలేదు కదా!

ఒక్కసారి గుండె దడదడలాడింది.

సరోజగాని చదివితే నా ప్లాన్...జరగదేమో! నిజానికి నా ప్లాన్ గురించి డైరీలో ఏమీ వ్రాయలేదు. ఈ విషయం కొంచెం ధైర్యాన్నిస్తోంది. అమ్మ క్రితం రోజే మామయ్య వాళ్ళ వూరు వెళ్లింది.

డైరీ సొరుగులో పడేసి, తాళం వేసి వుషారుగా కిచెన్ రూమ్ వేపు వెళ్లాను.

కమ్మటి గులాబ్ జాం వాసన నన్ను ఆహ్వానిస్తోంది.

సరోజ నవ్వు చూశాకగాని నా గుండెలు కుదుట పడలేదు. బహుశా డైరీ చూసి వుండదు. నిజంగా చూసినట్లయితే రియాక్షన్ వేరే విధంగా వుండేది.

"సరోజా! టైమ్ లేదు. నాన్నగారు మనిద్దర్నీ త్వరగా పెళ్లి దగ్గరకు వచ్చేయమన్నారు క్విక్!" అన్నాను కుర్చీలో కూర్చుంటూ.

"అయిపోయింది బావా! ఐదు నిముషాలలో తయారవుతాను." చెప్పి, గ్యాస్ స్టౌ ఆఫ్ చేసి, గులాబ్ జామ్ బీరువాలో పెట్టి వచ్చింది.

"సరోజా ఆకలిగావుంది" అడిగాను.

"ఇప్పుడు కాదు. పెళ్ళినుండి వచ్చిన తరువాత... అయినా నీ కోసమని చేయలేదు. నా కోసం చేసుకున్నాను" చెప్పి రివ్వున వెళ్ళిపోయింది.

సరోజ మాటలలోని చిలిపితనానికి జాలి వేసింది.

పది నిముషాలలో ముస్తాబై వచ్చింది. తెల్లటి మ్యాచింగ్ డ్రెస్‌లో వనదేవతలా వెలిగిపోతోంది.

"ఏమిటి పెళ్లి కూతురిలా తయారయ్యావు?" నవ్వుతూ అడిగాను.

సరోజ సమాధానం చెప్పకుండా నా కళ్లల్లోకి నిశ్చలంగా చూసింది. అందులో ఎలాంటి భావాన్ని చదవలేక పోయాను.

సరోజ చేయి పట్టుకుని, స్కూటర్ వేపు నడిచాను.

వరండాలో అంబుజం నిలబడివుంది. ఇంటి జాగ్రత్తలు చెప్పి, స్కూటర్ స్టార్ట్ చేసాను.

# 9

చలిగాలి రివ్వున వీస్తోంది. ఒంట్లో ఉన్న విస్కీ ప్రభావంవలన నన్ను చలిగాలి అంతగా బాధించడం లేదు. సరోజ మాత్రం ముడుచుకుపోయింది.

స్కూటర్‌ని గేటుగుండా తోటలోకి పోనిచ్చాను.

ఆ తోట అంతా చీకటి గుయ్యారంగా ఉంది. పెద్ద పెద్ద మామిడి చెట్లు దయ్యాల్లా కనబడుతున్నాయి. గాలికి అటూ యిటూ ఊగుతూ ఆకులను రాలుస్తున్నాయి. చెట్ల సందున చంద్రుడి మసక వెలుతురు గుడ్డిగా పడుతోంది.

స్కూటర్ ఇంజన్ ఆఫ్ చేసి, సరోజవేపు చూశాను.

"బావా! పెళ్ళి ఇక్కడా జరిగేది? ఒక్క లైట్ కనబడటంలేదు" ఆశ్చర్యంగా అడిగింది సరోజ.

ఒక్కసారి పెద్దగా నవ్వాను, బహుశా మేకను చూసిన పులి ఇలాగే నవ్వుతుంటుందేమో!

నా నవ్వు విని శాబోలు వెంకటేశ్ పరుగెత్తుకొని వచ్చాడు. వెంకటేశ్ కిరాయి రౌడీ.

"ఏమయింది?" అడిగాను ఆత్రుతగా.

"అంతా సవ్యంగా జరిగింది. మీ ఇద్దరినీ యెవరో అపహరించారని చెప్పి, మీ నాన్నగారిని తీసుకువచ్చాను" చెప్పాడు వెంకటేశ్.

"ఎక్కడ వున్నారు?"

"తోటలోపల! రాఘవులు, సత్యం కూడ అక్కడే ఉన్నారు" చెప్పాడు వెంకటేశ్.

సత్యం కూడా కిరాయి రౌడీనే. వీళ్ళిద్దరినీ రాఘవులు కుదిర్చాడు.

"పద" కదిలాను.

"ఆగు! ఏమిటిదంతా? వీళ్ళంతా ఎవరు? మామయ్యను యిక్కడకు యెందుకు తీసుకువచ్చారు...?" నన్ను పట్టుకుని, బలంగా కుదుపుతూ అడిగింది సరోజ.

"అనవసరంగా గొడవ చేయకు! సంగతేమిటో కొద్ది సేపట్లో నువ్వే తెలుసుకుంటావ్!"
నా స్వరంలో క్రూరత్వం ధ్వనిస్తోంది.

"మీరంతా యేదో కుట్ర చేస్తున్నారు. నేను ఇప్పుడే వెళ్ళి పోలీసులను తీసుకువస్తాను."
సరోజ గేటువేపు పరుగెత్తడానికి నాలుగు అడుగులు వేసింది.

వెంకటేశ్ గబుక్కున ముందుకు దూకి, పట్టుకున్నాడు. సరోజ పెనుగులాడుతోంది. నేనుకూడా వెళ్ళి సరోజను గట్టిగా పట్టుకున్నాను. ఇద్దరమూ కలసి సరోజను లోపలకు లాక్కుని వెళ్ళాం!

రాఘవులు, సత్యం కూర్చుని త్రాగుతున్నారు. వాళ్ళకు వెనకగా వున్న చెట్టుకు నాన్నగారు కట్టివేయబడి వున్నాడు. నోటికి టేప్ అంటించబడి వుంది.

నన్ను చూడగానే ఆయన మొహంలో కనిపించిన వెలుగును గుడ్డి వెలుతురులోకూడ గుర్తించగలిగాను.

మమ్ములను చూడగానే, సత్యం, రాఘవులు లేచి వచ్చారు. నలుగురంకలసి సరోజను ప్రక్కనవున్న చెట్టుకు కట్టేసాం!

నాన్నగారి మొహంలోని భావాలు మారిపోతున్నాయి.

సత్యం వెళ్ళి నాన్నగారి నోటికున్న టేప్ తీశాడు.

"బాబూ! ఏమిటిరా ఇదంతా...?" అడిగారు దీనంగా.

ఆయన కంఠంలో యిదివరకటి గాంభీర్యత లేదు!

"ఇప్పుడు ఆస్తి యెవరి పేరుమీద ఉంది?" సూటిగా అడిగాను.

"ఎందుకు?" అడిగారు.

"అదంతా అనవసరం! నాకు ఖచ్చితంగా తెలవాలి!" కొంచెం కోపంగా అరిచాను.

"నేను చెప్పను."

ఆయన కంఠంలో తిరిగి దృఢత్వం గోచరిస్తోంది.

రాఘవులు సూటుకేస్‌లోంచి ఆరు అంగుళాల చాకు తీసాడు. దానిని చూస్తూనే సరోజ 'కెవ్వు'న అరిచింది. సత్యం, సరోజదగ్గరకు వెళ్ళి నోరు మూసాడు.

"ప్రసాద్! ఆస్తికోసం నువ్వింత దిగజారిపోతావనుకో లేదు. సరే చెబుతాను విను. ప్రస్తుతానికి నా పేరుమీదే ఉంది. మీరిద్దరూ పెళ్ళిచేసుకుంటే మీ కిద్దరికీ చెందు తుంది, లేనిపక్షంలో సరోజకు చెందుతుంది."

"అదే జరక్కూడదు! మొత్తం నా పేరుమీదే వ్రాయాలి!" అరిచాను.

"నేను వ్రాయను" మొండిగా అరిచారు.

"మీరు వ్రాయకపోయినా బాధ లేదు. మిమ్మల్ని పరలోకానికి పంపిస్తే, వారసుడిని గనుక ఖచ్చితంగా నాకే వస్తుంది."

"బావా! మామయ్యను ఏమీ చేయకు. నాకు ఆ ఆస్తి మీద యెంతమాత్రం యిష్టంలేదు. కావాలంటే నువ్వే తీసుకో! మామయ్యని మాత్రం విడిచిపెట్టేయి" సరోజ దీనంగా అడిగింది ఏడుస్తూ.

"ఇలాంటి నీచులకు నా ఆస్తిమాత్రం ఇవ్వను" క్రోధంగా అన్నారు నాన్నగారు.

"ప్రసాద్! టైమ్ వేస్టుచేయక! తోటమాలికి రెండు గంటలు మాత్రమే డబ్బిచ్చాం! పని ఎంత త్వరగా జరిగితే అంత మంచిది..." అసహనంగా అన్నాడు సత్యం.

తలూపి, నాన్నగారివేపు తిరిగాను.

"మీ ఇద్దరివలన నాకు యెలాగూ కష్టాలు తప్పవు. మీ యిద్దర్నీ చంపేస్తే యే చిక్కూ వుండదు. సత్యం, వెంకటేశ్! మీ పని కానివ్వండి" చెప్పి, విస్కీ బాటిల్ అందుకున్నాను.

సరోజ ఏడుస్తూ తిడుతోంది.

నాన్నగారు కట్లు తెంచుకోవడానికి పెనుగులాడుతున్నారు.

రాఘవులు బాకు తీసుకుని నాన్నగారివేపు కదిలాడు.

"బావా! కావాలంటే నన్ను చంపేయి! చిన్నప్పట్నించీ మామయ్య మనిద్దర్నీ ఎంతో ప్రేమగా పెంచారు. ఆయనను వదిలేయి. నేను యెలాగూ చచ్చిపోదామనుకుంటున్నాను" ఏడుస్తూ అంది సరోజ.

"ఎందుకు చచ్చిపోదామనుకొన్నావ్...?" అడిగాను.

"హుం! నీ డైరీ అంతా చదివాను. నీ నిజస్వరూపం బయట పడిపోయింది. నిర్మలతో నీ పెళ్ళి జరిగిపోయింది. ఎలాగూ నా జీవితం నాశనం అయిపోయింది. నీ వలన తల్లినికూడా కాబోతున్నాను. ఆ పాపాన్ని నాతోనే అంతం చేయాలనుకున్నాను. అందుకే గులాబ్ జాంలో విషం కలిపి చేశాను. రాత్రి పడుకోబోయేముందు తిని చనిపోవాలనుకున్నాను. కావాలంటే ఇప్పుడే నన్ను చంపేయి! మామయ్యని మాత్రం విడిచిపెట్టు!" దీనంగా అడుగుతోంది సరోజ. వెక్కుతూ ఏడుస్తోంది.

"భ్రష్టుడా! ఇంతకు సాహసించావా? ఇన్ని పాపాలు చేసి సుఖంగా బ్రతకలేవు, మమ్మల్ని చంపేసినంత మాత్రాన చట్టం నిన్ను వదిలిపెట్టదు."

నవ్వు వచ్చింది. పెద్దగా నవ్వుకున్నాను.

"నగరంలో బందిపోటు దొంగలు తిరుగుతున్నారని, దొంగతనాలు చేస్తూ, అడ్డు వచ్చినవాళ్ళను చంపుతున్నారని పేపరులో చదవడం లేదా! అది చూసే ఈ పథకం వేసుకున్నాను. మీరిద్దరూ పెళ్ళికి వస్తుంటే బందిపోట్లు మిమ్మల్ని దోచుకుని, చంపేసి పారిపోయారని పోలీసులను నమ్మించగలను."

నా పథకం విన్న ఆయన నోటమాట రాలేదు.

రాఘవులు బాకుతో రెడీగా వున్నాడు. నా ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నాడు.

"ప్రసాద్! సరోజ శరీరం నీకు అవసరంలేదు కదా! ఎలాగూ చంపేస్తున్నాం కాబట్టి, నేను ఒక్కసారి..."

సత్యం భావం నాకు అర్థమయింది.

ఆ మాట విని సరోజ గడగడలాడిపోయింది.

నాన్నగారు పెనుగులాడుతున్నారు.

నా మెదడులో ఏదో ఆలోచన మెరిసింది.

నాన్నగారికి హార్ట్ ఎటాక్ వుంది! సరోజను రేప్ చేసినట్టయితే అది చూడలేక ఆయన గుండె ఆగిపోతుంది. బాకుతో పొడిచి రక్తపాతం చేసేకంటే ఇదే సులువైన మార్గం! బందిపోట్లని చూసి గుండె ఆగిపోయిందని అనుకుంటారు!

"రాఘవులూ! ఒక పావుగంట ఆగు! ముందు సరోజ సంగతి చూడండి" చెప్పాను.

"బావా!..." ఒణికిపోతోంది సరోజ.

నాన్నగారు ఏడుస్తున్నారు. తిడుతున్నారు.

రాఘవులు, సత్యం, వెంకటేశ్‌లు ఆకలిగా సరోజ వేపు కదిలారు.

ఈ పరిస్థితుల్లో గుండెబలంకోసం మరికొంత విస్కీ గొంతులో పోసుకున్నాను.

ఏమి జరిగినా కాలం ఆగదు.

అరగంట ముందుకు పరుగెత్తింది.

"శవాలను కారులో పడేసి, కొండదగ్గర మెయిన్ రోడ్ మీద వదిలిపెట్టండి! నగలు, పర్సు, వాచీలు తీసేయండి! ఎర్రసిరాతో మనం రాసిన బందిపోట్ల హెచ్చరికను కారు ఫ్రంట్ డోర్ గ్లాస్‌కు అతికించండి! జాగ్రత్త! ఎక్కడా వేలిముద్రలు మాత్రం విడిచిపెట్టవద్దు!"

వాళ్ళకు డబ్బు తీసి ఇచ్చి, జాగ్రత్తలు చెప్పి, స్కూటర్ వేపు నడిచాను.

## 10

రాత్రి పదిగంటలు దాటింది.

స్కూటరు గేటుబయట ఆపాను. అంబుజం వరండా

లోనే ఉంది. వచ్చి గేటు తీసింది. స్కూటర్‌ని పోర్టికోలో ఆపి, ఇంజన్ ఆఫ్ చేశాను.

"మీ ఇంటికి రావడం ఇదే మొదటిసారి" అన్నది నిర్మల బిల్డింగ్‌ని పరికించి చూస్తూ.

"ఇకమీద నీదేకదా," నవ్వాను.

నిర్మల చేయి పట్టుకుని లోపలను నడిచాను. అంబుజం మమ్మల్ని అనుసరించింది.

నిర్మలను చూడగానే అంబుజం కళ్ళల్లో జనించిన ఈర్ష్య స్పష్టంగా చూడగలుగుతున్నాను. ఆడదానిమీద ఆడదానికి ఈర్ష్య ఇందుకే కాబోలు!

"అంబుజం! నాన్నగారు, సరోజ రాలేదా?" అడిగాను ఏమీ తెలీనట్టు.

"అదేమిటి బాబూ! సరోజమ్మగారు మీతోనే కదా వచ్చారు" ఆశ్చర్యంగా అడిగింది.

దాని ఆశ్చర్యానికి కారణం చెప్పాల్సిన అవసరం నాకు లేదు. కాని ఈ పరిస్థితుల్లో తప్పకుండా చెప్పాలి!

"దారిలో నాన్నగారు కనబడ్డారు. సరోజను ఆయనతో పంపి, నేను వేరే పనిమీద వెళ్ళాను."

అంబుజం మాట్లాడకుండా నిర్మలనే పరీక్షగా చూస్తోంది.

"అంబుజం! భోజనం పైకి తీసుకురా మా ఇద్దరికీ" చెప్పి, నిర్మలతో మెట్లవేపు కదిలాను.

"ఇంత పెద్ద ఇల్లు అని యెప్పుడూ చెప్పలేదే!" నిర్మల ఇంకా ఆశ్చర్యంలోనుండి తేరుకోలేక తబ్బిబ్బవుతూ అడిగింది.

"ఇప్పుడే యేం చూశావ్? పైకి రా!" గర్వంగా చెప్పాను.

నిర్మలకు ఇల్లంతా చూపించి, నా బెడ్ రూమ్‌కు తీసుకెళ్ళాను.

టైమ్ చూసాను. పదకొండు అవుతుంది.

శరీరమంతా బాగా అలసిపోయింది—మధ్యాహ్నం నుండి తాగుతూనే ఉన్నాను. కొంచెం మత్తుగా ఉంది.

బాత్‌రూమ్‌కెళ్ళి మొహం కడుక్కున్నాను. చల్లటి నీళ్ళు తగలగానే ప్రాణం లేచివచ్చినట్లయింది. నిర్మల కూడా మొహం కడుక్కుని వచ్చింది.

నిర్మలలాంటి అనుకూలవతి నాకు భార్యగా లభించడం నేను పూర్వజన్మలో చేసుకున్న పుణ్యమేమో!

ఫ్రిజ్ తెరిచి హేవార్డ్స్ బ్రాండీ, సోడా బయటకు తీసాను.

నిర్మల డ్రెస్సింగ్ టేబిల్ ముందు కూర్చుని అలంకరించుకుంటోంది.

బ్రాండీ గ్లాసులో పోసి, సోడా కలిపి గొంతులో పోసుకున్నాను. గొంతునుంచి కడుపువరకు సురసుర మండుతూ వెచ్చ వెచ్చగా జారిపోతోంది బ్రాండీ!

గ్లాస్ ఖాళీచేసి, నిర్మల దగ్గరకు వెళ్ళాను. డ్రెస్సింగ్ మిర్రర్‌లో నన్ను చూసి మత్తుగా, చిలిపిగా నవ్వింది. ఆమెనుండి వచ్చే పరిమళాలు నన్ను వివశుడ్ని చేస్తున్నాయి. వెనుకనుండి గట్టిగా కౌగలించుకున్నాను. నా శరీరం వేడి మంటలతో దహించుకుపోతోంది.

మిర్రర్‌లో అంబుజం రూమ్‌లోకి రావడం కనిపిస్తోంది. నిర్మలను వదిలి, సిగరెట్ వెలిగించాను.

అంబుజం రెండు టీపాయ్‌లు దగ్గరగా జరిపి పాత్రలు సర్దుతోంది.

మరో గ్లాసు బ్రాండీ ఖాళీ చేసాను.

అంబుజం నావేపు వింతగా చూస్తోంది. ఇంట్లో త్రాగడం ఇదే మొదటిసారి!

ఐదు నిముషాల్లో అన్నీ సర్దేసి, క్రిందకు వెళ్ళిపోయింది.

"చాలా ఆకలిగా ఉందండీ!" అంది నిర్మల టీపాయ్ మీదున్న ప్లేట్ వైపు చూస్తూ.

నాకూ ఆకలిగానే వుంది.

ఇద్దరమూ ప్రక్క ప్రక్కనే కూర్చున్నాం!

టీపాయ్ మీద ఉన్న రెండు ప్లేట్స్‌లో ఒకదాన్ని తీసి క్రింద పెట్టేసి, ఇద్దరమూ ఒక ప్లేట్‌లో భోజనం చేయడం ప్రారంభించాం!

నిర్మల ప్రక్కన కూర్చొని, ఒకే ప్లేట్‌లో తినడం ఇదే మొదటిసారి!

అన్ని పదార్థాలు నేనూ నిర్మల పూర్తి చేసేసరికి అరగంట పట్టింది.

నిర్మల ప్లేట్స్ అన్నీ తీసి గోడవారగా పెట్టి, టీపాయ్‌ని క్లీన్ చేసింది.

చాలా రోజుల తరువాత ఈరోజే తృప్తిగా తిన్నాను. నిర్మలతో అనుభవించబోయే స్వర్గాన్ని తలచుకొంటుంటే శరీరం పులకరిస్తోంది!

నిర్మల ఒడిలో తల పెట్టుకుని పడుకున్నాను. ఏవో కబుర్లు చెబుతోంది. వింటున్నాను.

ఇరవై నిముషాలు క్షణాల్లా గడిచిపోయాయి.

"ఇప్పుడే వస్తాను" చెప్పి, నిర్మల బాత్ రూమ్ వేపు వెళ్ళింది.

నేను పక్క విప్పి హేంగర్ మీద వేసి సిగరెట్ వెలిగించాను. కళ్ళు మత్తుగా మూతలు పడుతున్నాయి.

అంబుజం వచ్చి గోడవారగా ఉన్న ఎంగిలి ప్లేట్స్ అన్నీ ఒక్కటిగా సర్దుతోంది.

"బాబుగారూ!" అంబుజం పిలిచింది.

తల ఎత్తి చూశాను.

ఈసారి నాకు ఎందుకనో అంబుజం కళ్ళల్లో ఏ విధమైన కోరిక కనబడలేదు. కళ్ళలో నీళ్ళు మాత్రం తళుక్కున మెరిసాయి.

"మీరు ఇలా తాగి పాడైపోవడం చూస్తే బాధగా ఉంది" గాద్గదికంగా అంది. అంబుజం కళ్ళలోనుండి నీళ్ళు ధారగా కారుతున్నాయి.

నాకు తెలుసు! అంబుజం నన్ను ప్రేమిస్తోంది. కాని, ఒక పనిమనిషి దగ్గర తప్పు చేస్తున్నట్లు తలొంచడానికి నా అంతస్థు అడ్డు వస్తోంది.

"ఆ విషయం నీ కనవసరం! నీపని చూసుకో" కఠినంగా అన్నాను.

అంబుజం మాట్లాడలేదు.

"బాబుగారూ!" ప్లేట్స్ తీసుకుని వెడుతూ మళ్లీ పిలిచింది అంబుజం.

"ఏమిటి?" అడిగాను విసుగ్గా.

"నిర్మలతో మీకు ఇదే మొదటి పరిచయమా?" అడిగింది అంబుజం.

నాకు అంత విసుగులో కూడా ఆశ్చర్యమేసింది. నిర్మల పేరు అంబుజానికి ఎలా తెలిసింది? ఇదివరకు ఇద్దరికీ పరిచయముందా? ఆ విషయమే అడిగాను.

అంబుజం నవ్వింది.

"నిర్మలతో పరిచయం లేదుగాని, ఇదివరకు చాలా సార్లు చూసాను."

"ఎక్కడ?"

"మన లాయర్ గారింట్లో! ఇలాంటి పడక గది లోనే..."

"షటప్!" అరిచాను.

అంబుజం చెప్పడం ఆపేసింది.

గుండెల్లో ఏదో తెలీని గుబులు నాట్యం చేస్తోంది.

అంబుజం ప్లేట్స్‌తో వెళ్ళబోయింది. పిలిచాను.

"నిజం చెప్పు! ఈర్ష్యతో మాత్రం అబద్ధం చెప్పకు" నిలదీసి అడిగాను.

"నా కెందుకు ఈర్ష్య? నేను చెప్పేది నిజమే! నిర్మల అమ్మ, రాఘవులు అనే బ్రోకర్ కలసి నిర్మలను పెట్టుకుని లాయర్ గారిని బ్లాక్ మెయిల్ చేసి ఏడిపిస్తున్నారు. ఇంకా చాలా మంది దగ్గర డబ్బు గుంజుతున్నారుట. అదే వాళ్ళ వృత్తట! ఈ విషయాలన్నీ మీరు లాయరుగారిని అడిగి తెలుసుకోండి..."

నా తల గిర్రున తిరిగిపోయింది.

అంబుజం చెబుతున్న ఒక్కొక్క మాట కర్ణ కఠోరంగావుంది. ఎవరో రాక్షసుడు భయంకరంగా వికటాట్టహాసం చేస్తూ బిగ్గరగా చెవి దగ్గర అరుస్తున్నట్టుంది.

ఎంత మోసం? గుండె ఆగిపోయిందనిపిస్తోంది. కాలం స్తంభించిపోతోంది! నా గుండెల్ని ఎవరో పిండుతున్నారు. నా పాపాలకు నిష్కృతి లేదు.

నన్ను తియ్యని మాటల్లో ముంచి, నన్ను ప్రేమిస్తున్నట్లు పతివ్రతగా నటించి, నాచేతే నా వాళ్ళను హత్య చేయించిన ఆ భయంకర రాక్షసిని... నా చేతులతోనే చంపి పగ తీర్చుకోవాలి!

నా శరీరం క్రోధంతో ఒణికిపోతోంది!!

ఆఖరిసారిగా ఏడుస్తున్న సరోజ మొహం, దీనంగా వేడుకుంటున్న నాన్నగారి దీనవదనం కళ్ళముందు మెదులుతోంది!

నా థియరీ నన్ను పశువుగా, రాక్షసుడిగా మార్చింది. సూర్యరశ్మి సోకిన మంచుతెరలా నా థియరీ కరిగిపోతోంది. ఆ మంచుతెర వెనుకనున్న భయంకర స్మశానం కళ్ళకు స్పష్టంగా కనబడుతోంది.

సరోజ పోయేముందు ఆఖరిసారిగా చేసిన గులాబ్ జామ్ తెచ్చిపెట్టమని, అంబుజానికి చెప్పి పంపేసి డ్రాయరు సొరుగు లాగాను.

కాలేజీ గొడవల్లో నా ఆత్మరక్షణకోసం తెచ్చుకున్న బటన్ నైఫ్ కనబడింది. తీసి బటన్ నొక్కాను.

నిర్మల!...ఆ పాతకిని...కసిదీరా పొడిచి చంపాలి!

నాకు పిచ్చి యెక్కుతోంది. బహుశా పిచ్చివాడిని అయిపోయానేమో! ఇదంతా కలేమో! తల వేగంగా తిరుగుతోంది!

అంబుజం ప్లేటులో గులాబ్ జామ్ తెచ్చి, టీపాయ్ పైన పెట్టి వెళ్ళిపోయింది.

నేను లేచివెళ్ళి గది తలుపులు బిగించాను. నా చేతిలో బటన్ నైఫ్ బిగుసుకుపోతోంది.

ఒక్కొక్క అడుగే వేస్తూ బాత్ రూం వేపు కదిలాను.

తలుపు దగ్గరగా వేసివుంది. నెట్టాను. తలుపు తెరుచుకుంది.

ఎదురుగా—నిర్మల చలిజ్వరం వచ్చినదానిలా వణికిపోతోంది. అంబుజం చెప్పిందంతా విన్నదన్నమాట! రాక్షసి-తన బండారం బయటపడిందని భయంగా నన్నే

చూస్తుంది.

ఇప్పుడు నా కంటికి నిర్మల అందంగా కనిపించటం లేదు. పిశాచంలా కనిపిస్తోంది. నాజీవితాన్ని, నా కుటుంబాన్ని సర్వనాశనం చేసిన ఆ పాతకిని కత్తితో కండగా కోయాలి! విషపురుగులాంటి ఆ ఆడది, బ్రతికుండటానికి వీల్లేదు...!

చటుక్కున బటన్ నైఫ్ని పైకెత్తి నిర్మల గుండెల్లో బలంగా దింపాను. కీచుగా అరుస్తూ నేలకూలింది. అయినా నా కసిదీరా వళ్ళంతా తూట్లు పడేటట్లు పొడుస్తూనే వున్నాను.

పావుగంట తర్వాతగాని నా ఆవేశం చల్లారలేదు.

లేచి నిలబడ్డాను. నిర్మల ఆకారం కనిపించటంలేదు. రక్తపు ముద్దగా వుంది. బాత్రూం నిండా రక్తం పేరుకొని ఎర్రగా మెరుస్తోంది.

కత్తి అక్కడే పడవేసి, గదిలోకి వచ్చాను. సరోజను చివరిసారిగా తలుచుకుంటూ, టీపాయ్మీదున్న గులాబ్ జాం ప్లేటును అందుకొన్నాను...

ఐ పో యిం ది.

# తల నరికిన శవం!

## విద్వాన్ షీలాదేవి

"మే ఐ కమిన్ సర్?" అన్నాను పూడుకుపోయిన కంఠంతో.

"ఎస్. కమిన్!" వినిపించింది లోపలినించి.

అది సి. బి. ఐ. డైరెక్టర్ ముఖర్జీగారి ఆఫీసు. స్ప్రింగ్ డోర్‌ని తోసుకుంటూ లోన అడుగుపెట్టాను.

"నువ్వా, అమ్మా!" అన్నారాయన కాస్త ఆశ్చర్యపోయి.

ఆయనతోబాటు మరో వ్యక్తి కూడా వున్నాడు లోపల. అతను మా విషయం పట్టించుకోకుండా, ఎడం వైపు గోడదగ్గర నిల్చుని, అక్కడ వేలాడుతున్న ప్రపంచ మ్యాప్‌ను పరిశీలిస్తున్నాడు.

నాలో పెల్లుబుకుతున్న దుఃఖాన్ని అదుపులో పెడుతూ, ముఖర్జీగారికెదురుగా కూర్చున్నాను కుర్చీలో. నా మొహంలో చెలరేగుతున్న భావవీచికలు ఆయన పసిగట్టి వుంటారు.

అందుకే భారంగా నిట్టూర్చి—"ఐతే, నీకూ ఆ విషాద వార్త తెలిసిందన్న మాట!" అన్నారు సానుభూతిగా.

"ఔను! టెలిగ్రాం వచ్చింది. అందులో, అన్నయ్య మరణానికి కారణాలు తెల్పలేదు. భూటాన్‌లో ఆయన్నెవరో హత్యచేసుంటారని నా గట్టి అనుమానం!" అన్నాను.

"మీ కా అనుమానం ఎందుకు కలిగింది?" అంత వరకూ మౌనంగా మ్యాప్ చూస్తున్న వ్యక్తి చటుక్కున నావైపు తిరిగి అడిగాడు.

"టెలిగ్రాంతో బాటు, అన్నయ్య రాసిన ఉత్తరం కూడా ముట్టింది నాకు. అది చదివితే, ఎవరికైనా ఆ అనుమానం రాక మానదు." అన్నాను.

"ఇప్పుడా ఉత్తరం మీదగ్గరుందా?" అంటూ మా దగ్గరికి వచ్చాడతను.

తలూపుతూ హేండ్ బ్యాగ్‌లోంచి ఉత్తరం బైటికి తీశాను.

"ప్లీజ్, ఒకసారి దాన్ని చూడనివ్వండి," అంటూ చెయ్యిచాపాడతను.

సందేహిస్తూ చూశాను ముఖర్జీగారివైపు.

"మిమ్మల్ని పరిచయం చెయ్యడం మర్చాను. ఇతనెవ్వరో కాదమ్మా! మా డిపార్ట్‌మెంట్‌లో అత్యంత చురుకైన కొలీగ్, మిస్టర్ సారధి! మీ అన్నయ్యకు స్నేహితుడుకూడా!" అన్నారు ముఖర్జీగారు ఆ వ్యక్తిని నాకు పరిచయం చేస్తూ.

ఇక సంకోచించకుండా ఆ ఉత్తరాన్ని ఆయన చేతికిచ్చాను.

ఆయన ఆ ఉత్తరంలోని విషయాలు ముఖర్జీగారి కూడా వినిపించేలా పెద్దగా చదవసాగారు.

"చెల్లాయికి!

నీకు ఉత్తరం రాసి చాలా రోజులైంది. కారణం లేక పోలేదు. నేను డ్యూటీమీద భూటాన్ రాజధానియైన 'తింగ్ ఫూ'కు వచ్చిన పని ఒకటైతే, కాకతాళీయంగా నేనిక్కడ మరో ఘటనలో ఇరుక్కున్నాను. బహుశా, ఈ ఉత్తరం నీకు చేరేసరికి చాలారోజులు పట్టవచ్చు...

నేనిక్కడ అత్యంత ప్రమాదకరమైన ఒక రహస్యాన్ని కనుక్కోగలిగాను. ఆ రహస్యం ఒక దేశానికి సంబంధించినదికాదు. యావత్ ప్రపంచానికి సంబంధించింది. సర్వమానవాళికీ సంబంధించింది. దాని గురించి నోటిమాటగా చెబితే ఎవ్వరూ నమ్మరు!

దురదృష్టవశాత్తూ ఆ భయంకరమైన ముఠావాళ్ళు ఆ రహస్యం నాకు తెలిసిపోయినట్టు పసిగట్టారు. వాళ్ళ కళ్ళు గప్పి, ఢిల్లీ చేరే ప్రయత్నంలో వున్నాను. ఎదురు చూస్తూ వుండు.

ప్రేమతో—

అన్నయ్య

గౌతమ్!"

ఉత్తరం ముగించి, ఫ్రం అడ్రస్ చూశారు సారథి.

"వాంగ్ స్ట్రీట్,

హౌస్ నెంబర్, 3-1-146,

తింగ్ ఫూ,

భూటాన్"

అని చదివి సాలోచనగా తలూపారు.

"బహుశా గౌతమ్ తింగ్ ఫూలో వున్న వాంగ్

స్ట్రీట్‌లో ఆ ఇల్లు అద్దెకి తీసుకుని ఉండివుంటాడు. అతను కనుగొన్న రహస్యం ఏమిటో మరొకరికి తెలీకుండా, అతనితోటే సమాధి అయింది. తింగ్ ఫూ వెళ్ళి పూర్తి ఇన్వెస్టిగేషన్ చెయ్యందే మనకేమీ తెలీదు..." అంటూ ముఖర్జీగారు నావైపు తిరిగి—

"మిస్ హేమా! మీ అన్నయ్య సరిగ్గా ఇటువంటి ఉత్తరమే మాకూ రాశాడు. అందులో, అతనా రహస్యంగురించి వివరించలేదు. దానిగురించి పూర్తి వివరాలు సేకరించాకే వచ్చి చెబుతానని రాశాడు. అంతలో అతని హత్య జరిగిపోయినట్టు మాకు టెలిగ్రాం వచ్చింది.

హత్య చెయ్యబడకముందు అతను తింగ్ ఫూలోని మన దేశ వార్తాపత్రికా విలేఖరి ఒకర్ని హోటల్లో కలుసుకున్నాడుట. అతని పేరు మురళీధర్!

గౌతమ్ హత్య తరవాత మురళీధర్ ఈ విషయాలన్నీ మాకు ఉత్తరంద్వారా తెలీచేశాడు.

"నీ సోదరుడి మరణానికి కారణాలు కనుక్కోడానికీ, అతను పసిగట్టిన రహస్యం ఏమిటో తెలుసుకోడానికీ, మా డిపార్ట్‌మెంట్ తరఫున మిస్టర్ సారధిని తింగ్ ఫూ పంపుతున్నాను..." అంటూ చుట్ట అంటించుకున్నారు ముఖర్జీగారు.

"అన్నయ్య మరణానికి కారకులైన ఆ నీచుల అంతు చూడందే నాకు నిదరపట్టదు. దయచేసి ఈ కేసులో నాకూ అవకాశం కల్పించండి సార్! సారధిగారివెంట నేనూ వెళ్లే అవకాశం ఏదైనా ఉందేమో కాస్త ఆలోచించండి. ప్లీజ్!" అన్నాను ప్రాధేయపడుతూ.

ఆయన పలకలేదు. చుట్టపొగ రయ్యేవరకూ తీవ్రంగా

ఆలోచిస్తూ వుండిపోయారు.

తరవాత తలెత్తి, "ఆల్ రైట్! అవకాశం వుంది. సారధి సారధిగా వెళ్ళడంలేదక్కడికి. భూటాన్ దర్శించడానికి వెళ్ళే భారతదేశపు కోటీశ్వరుడిగా వెళుతున్నాడు మారుపేరుతో.

అంతటి ధనవంతుడివెంట ఆయన ప్రియురాలువుండక పోవడం కాస్త అసహజంగా వుంటుంది మరి. వెళ్ళదలచుకుంటే నీ వతని ప్రియురాలిగా వెళ్ళవచ్చు," అన్నారు.

"నేనా? ఆ విధంగానా?"

"అమ్మాయ్! గూఢచర్యంలో నటనకూడా ఒక భాగం! అతని ప్రియురాలుగా నీవు నటించాలి. అంతే!"

తలూపాను, సాలోచనగా!

"రేపే మీ ప్రయాణం! నీ సామానూ అదీ సిద్ధం చేసుకుని రెడీగా వుండు," అన్నారాయన ఏష్ట్రేలో చుట్ట నొక్కుతూ.

వాళ్ళదగ్గర సెలవు తీసుకుని లేచాను.

## 2

భూటాన్ రాజధాని తింగ్ఫూ విమానాశ్రయంలో, ఉదయం పది గంటలకి దిగింది మా విమానం!

కస్టమ్స్ గొడవలూ అవీ పూర్తయ్యాక, సామానుతో టాక్సీ ఎక్కి ఎవరెస్ట్ హోటల్ చేరుకున్నాం. అక్కడ మాకోసం ముందే ఓ డబుల్ రూం బుక్ చేసుంది. స్టీవార్డ్స్ మా సామాను గదుల్లో సర్ది వెళ్ళిపోయాక___

"సారధిగారూ! నాకింతవరకూ ఓ విషయం అర్థంకాలేదు..." అనబోయానో లేదో, ఆయన మెరుపులా

చేతో నా నోరు నొక్కి—

"అర్థంకాని విషయాలు ఆలోచిస్తూ అనవసరంగా నీ బుర్ర పాడుచేసుకోవద్దు డార్లింగ్! బిజినెస్ గొడవలన్నీ నామీద వదిలేసి నీవు నిశ్చింతగా వుండు. ఈ లక్ష్మీదాస్ ప్రియురాలు ఎల్లవేళలా హుషారుగా వుండాలి గాని, అనవసరంగా శక్తికి మించిన భారం నెత్తిన వేసుకోవద్దు!" అన్నారు.

హఠాత్తుగా ఈ డ్రామా ఏమిటో అర్థంగాక, నివ్వెరబోయాను!!

సారథిగారి కళ్ళల్లో వార్నింగ్ కనబడుతోంది మాట్లాడవద్దని.

తరవాత ఆయన దేనికోసమో గబగబ గదంతా వెతకసాగారు. కొద్దిసేపటికే ఆ వస్తువు కనిపించింది మాకు. ఏర్ కండిషనర్ వెనక దాచివున్న మైక్రోఫోన్!

వాటిని వెదుకుతూనే సారథిగారు పెద్దగా యేవో కబుర్లు చెబుతూనే వున్నారు. నేను పరిస్థితిని పసిగట్టేశాను. అందుకే, ఆయన కబుర్లకు వంతపాడసాగాను.

మైక్రోఫోన్స్ ఉనికి కనిపెట్టాక, ఆయన నన్ను బాల్కనీలోకి పదమన్నట్టు సైగ జేశారు. ఇద్దరం గది వెనుకనున్న బాల్కనీలో కెళ్ళాం.

"ఇక్కడ మనం ఫ్రీగా మాట్లాడుకోవచ్చు. ఏమైనా సందేహాలుంటే తీర్చుకో!" అన్నారు.

"మన గదుల్లో ఆ మైక్రోఫోన్స్ యెవరు దాచిపెట్టారు? అన్నయ్యని చంపిన వ్యక్తులేనా?"

"ఇదమిదంగా ఇప్పుడే ఏమీ చెప్పలేను. వాటిని హోటల్ వాళ్ళో, స్థానిక పోలీసులో పెట్టే అవకాశం కూడా ఉంది."

"వాళ్ళ కిందులో ఏమిటి ప్రమేయం?"

"మనం నిజంగా యాత్రీకులమో, కామో కనుక్కోడానికి."

"వాళ్ళు మన నిజ స్వరూపాలని పసిగట్టారంటారా?"

"శత్రువు నెప్పుడు తక్కువ అంచనా వేసుకోవద్దు. వాళ్ళు మనల్ని వెయ్యికళ్ళతో కనిపెడుతున్నారన్న అభిప్రాయంలోనే అనుక్షణం మసలుకోవాలి."

"అన్ని అవస్థలు పడేకంటే, నిక్షేపంగా ఆ మైక్రో ఫోన్స్ వైర్లు కట్ చేసి పారేస్తే పీడా పోతుందిగా?"

"అలా చెయ్యడం మరీ ప్రమాదం! ఒక బిజినెస్ మాగ్నెట్ కు తన గదిలో మైక్రోఫోన్స్ ఉన్నాయన్న ఆలోచన ఎలా వస్తుంది? ఒకవేళ, నేనా వైర్లు కట్ చేశానంటే, వాటిని అమర్చిన వాళ్ళకి అరక్షణంలో అనుమానం వచ్చేస్తుంది నేను పారిశ్రామికవేత్తను కాననీ, ప్రొఫెషనల్ గూఢచారిననీ..." అంటూ చటుక్కున నన్ను దగ్గరికి లాక్కున్నారు సారథి.

ఆ హఠాత్పరిణామంనించి నేనింకా తేరుకోకముందే ఆయన నా పెదాలు చుంబించడం కూడా జరిగి పోయింది.

కోపంతో నా మొహం జేవురించింది. "ఏమిటిది?" అన్నాను విడిపించుకోడానికి ప్రయత్నిస్తూ.

"ప్లీజ్, హేమా! నన్నపార్థం చేసుకోక! ఆ వ్యక్తులు మనల్ని ఓ కంట కనిపెట్టడానికి కొందరు మనుషుల్ని కూడా నియమించి వట్టున్నారు. నేనిప్పుడే గమనించాను. కింద రోడ్డుమీద ఓ వ్యక్తి తదేకంగా మనల్నే గమనిస్తూ నిల్చున్నాడు. అందుకే ఈ నాటకం!" అంటూ మరోసారి

నా పెదాలు చుంబించారాయన.

ఈసారి నేను అభ్యంతరం చెప్పలేదుగానీ, అయిష్టం వల్ల నా శరీరం బిర్రబిగుసుకుపోయింది.

"ఈ రాత్రి మన ప్రోగ్రాం ఏమిటో తెలుసా?"

"ఏమిటి?"

"స్థానిక నైట్ క్లబ్స్ చుట్టిరావాలి."

తలూపాను.

## 3

మధ్యాహ్నం మా మా గదుల్లో పడుకుని, ప్రయాణ బడలిక తీర్చుకున్నాం.

సాయంత్రం స్నానాలవీ కానిచ్చి, రూం లాక్ చేసి టాక్సీలో అక్కడికి దగ్గరే ఉన్న ఓ క్లబ్బులోకి ప్రవేశించాం.

ఓ బట్లర్ మమ్మల్ని సమీపించి, "మీకోసం సీట్సు రిజర్వ్ చెయ్యమంటారా?" అడిగాడు సారథిని.

ఆయన నవ్వి—"ఇక్కడ గేమ్ ఏ స్టేక్‌లో ఆడబడుతుంది?" అడిగారు.

"రమ్మీ! పాయింట్‌కు వంద చొప్పున."

"వాటెషేమ్? కేవలం వందరూపాయలా? ఈ లక్ష్మీదాస్ జన్మలో ఇటువంటి నాసిరకం ఆట ఆడలేదు. వెయ్యా, రెండువేల స్టేక్‌తో ఆడేవాళ్ళుంటే చెప్పు!"

బట్లర్ చకితుడై—"మీరు లక్ష్మీదాస్‌గారా! మీ గురించి యూరోకే పేపర్లో చదివాను" అన్నాడు అతి వినయం ఒలకబోస్తూ.

సారథి తలూపి, నేను కోరే స్టేక్‌తో ఆడేవాళ్ళుంటే, రేపు రాత్రి మాకోసం ఓ టేబుల్ రిజర్వ్ చేయించు. అంతేకాదు, వాళ్ళకి నా తరఫున విస్కీ డిన్నర్ వగైరా

సరఫరా చెయ్యబడతాయని చెప్పు," అన్నారు అధికార
యుతంగా.

"ఓ. కే. సార్!"

సారధి అతనికో పెద్ద నోటు టిప్ ఇచ్చి, "కమాన్
డార్లింగ్!" అంటూ నా నడుంమీద చెయి వేశారు.

ఇద్దరం కారిడార్‌లో ప్రవేశించాం. అక్కడ కనిపిం
చిన ఓ దృశ్యం మా కాళ్ళకి బ్రేకులు వేసింది. ఓ భూటానీ
యువకుడూ, ఒక యూరోపియన్ యువతీ దేనికోసమో
ఘర్షణపడుతున్నారక్కడ.

యువకుడు కోపంతో ఆమెమీద అరుస్తున్నాడు.

"మూర్ఖురాలా! ఎక్కడ పోగొట్టావ్ దాన్ని?"

"ఆ... తెలీదు. హాండ్ బ్యాగ్‌లో వేసుకున్నట్టు
జ్ఞాపకం!" అందా యువతి ఖంగారుపడుతూ.

"గుడ్లగూబలా నా మొహం చూస్తావేం? త్వరగా
వెతుకు దాన్ని!"

చేతిలో వేళ్ళాడుతున్న హాండ్‌బాగ్ తెరిచి, గబగబ
వెతకసాగిందామె.

రెండు నిమిషాల తరవాత ఆమె మొహంలో ఖంగారు
మరీ ఎక్కువయింది.

"లేదు...ఎక్కడో పోయినట్టుంది..." అంది తడ
బడుతూ.

"పాపిష్టిదానా! నిన్నేంచేసినా పాపం అంటదు..."
ఈడ్చి ఆమె చెంప ఛెళ్ళుమనిపించాడతను.

ఆమె చేతిలోంచి హేండ్‌బాగ్ జారి కింద పడి
పోయింది. అందులో ఉన్న చిన్నచిన్న సామానంతా
చెల్లాచెదురుగా పడిపోయాయి.

చేతుల్లో మొహం కప్పుకుని, వెక్కి వెక్కి ఏడు

స్తోంది.

సారథి ఊహించని విధంగా ఆ యువకుడివైపు ఉరికి, పిడికిలితో అతని గడ్డంకింద ఫెడేల్ మని ఒక్కటిచ్చేరు. అతనా దెబ్బనించి తేరుకునేలోగా, మోకాలు మడిచి డొక్కలో కుమ్మారు.

ఆ మెరుపు దెబ్బలకతను తట్టుకోలేక, కాండం నరికిన చెట్టులా కింద కూలి స్పృహ తప్పాడు.

అంతవరకూ ఏడుస్తున్న ఆ యువతి ఆశ్చర్యంగా, సారథివైపూ, ఆ యువకుడివైపూ చూడసాగింది. ఆ హఠాత్సంఘటనకి నేనూ నివ్వెరబోయాను కాసేపు.

తరవాత తేరుకుని కిందపడ్డ వస్తువులు ఏరి, హాండ్ బ్యాగ్ లో వేసి ఆమె కందించాను. ఆమె మారు మాటాడకుండా దాన్నందుకుని, వెనుదిరిగి విసవిస బయటకు వెళ్ళిపోయింది.

అప్పుడు పడింది నా దృష్టి, కింద మెరుస్తున్న ఓ వస్తువుమీద.

చటుక్కున దాన్నందుకుని, "హలో మేడమ్!" అంటూ ఆమెని పిలవబోయాను.

అప్పటికే ఆమె గబగబా గేటు దాటి వెళ్ళిపోయింది.

"మనంకూడా త్వరగా ఇక్కణ్ణించి జారుకోవడం మంచిది. కమాన్!" అంటూ నా జబ్బ పట్టుకుని బైటికి లాక్కెళ్ళారు సారథి.

హోటల్ చేరగానే, ఆయన గదితలుపులు మూసి, నన్ను బాల్కనీలోకి తీసుకెళ్ళి, "ఇప్పుడు చూపించు, ఏమిటా వస్తువు?" అన్నారు.

చూపించాను.

అదొక ఉంగరం! పాము వేలికి చుట్టుకున్నట్టు మల చిన బంగారు ఉంగరం!! చుట్టమీద వెడల్పాటి పాము పడగ ఉంది. కళ్ళుండవలసినచోట రెండు ఎర్రని రవ్వలు మెరుస్తున్నాయి.

దాన్ని చూడగానే, సారథిగారి భ్రుకుటి ముడి పడింది. నా చేతిలోంచి దాన్ని లాక్కున్నారు.

"ఇది చాలా విలువైనదా?" అడిగాను అమాయకంగా."

"అట్టే విలువైనదికాదుగానీ, దీనికేదో ప్రాముఖ్యత ఉన్నట్టు నా కనిపిస్తోంది. ఒక విషయం గమనించావా?..."

"ఏమిటి?"

"మొదటిది, ఆ యువతి యూరోపియన్! ఘరానా కుటుంబానికి సంబంధించిన మనిషిలా కనిపించింది. ఆ యువకుడు యీ దేశస్థుడు, పైగా, నాసిరకం మనిషిలా వున్నాడు.

వాళ్ళిద్దరికీ సంబంధం ఏమిటో నా కంతుపట్టడంలేదు. అతనామె మీద యెంతో అధికారం వున్నట్టు విరుచుకు పడ్డాడు. ఆమె తన బానిసయినట్టు చెంపవాయగొట్టాడు.

రెండోది, కొట్టకముందు అతనామెనేదో వస్తువు వెదకమని పురమాయించాడు. ఆమె హాండ్ బేగ్ వెదికి లేదంది. బహుశా, ఆ వస్తువు ఆ హాండ్ బేగ్ మూలల్లో యెక్కడో ఇరుక్కుపోయుంటుంది. అది ఈ ఉంగరమే ఎందుక్కాకూడదు?

ఆమె చేతిలోంచి హాండ్ బేగ్ కిందపడ్డాకే, ఇది మిగతా వస్తువులతోబాటు యివతల పడింది. ఉంగరాలు వేళ్ళకి పెట్టుకుంటారుగానీ, హాండ్ బేగ్స్ లో వేసు

కుంటారా?

పైగా, ఇటువంటి ఉంగరాలని సాధారణంగా ఆడవాళ్ళిష్టపడరు. బహుశా, ఈ ఉంగరం అతనిదే అయివుంటుంది. అతనామెని అడిగిన వస్తువుకూడా ఇదే అయివుంటుంది.

కాని, ఇటువంటి మామూలు వస్తువుకోసం, అంత కోపోద్రిక్తుడై ఆమెనలా కొట్టాడంటే, తప్పకుండా దీనికెంతో ప్రాముఖ్యం వుండివుంటుంది మరి!"

సాలోచనగా తలూపాను. "ఇప్పుడు దీన్నేం చేద్దామంటారు?"

"ఏమీ లేదు. భోజనం కానిచ్చి, శుభ్రంగా నిదరపోదాం! రేపు మీ అన్నయ్య నివసించిన అద్దె యిల్లు కనుక్కొని, అక్కడేమైనా క్లూ దొరుకుతుందేమో వాకబ్ చెయ్యాలి. అలాగే, మీ అన్నయ్యకూ, నాకూ మిత్రుడైన పత్రికా విలేఖరి మురళీధర్ని వెదికి, అతన్ని కలుసుకోవాలి! రాత్రి చాలా పొద్దుపోయింది. వెళ్ళి నీ గదిలో పడుకో" అన్నారు సారధి సిగరెట్ అంటిస్తూ.

## 4

"ఈ రోజు మన ప్రోగ్రాం ఏమిటి డార్లింగ్?" అడిగాను ఉదయం కాలకృత్యాలు తీర్చుకున్నాక, బిగ్గరగా.

"ఈ రోజంతా తింగ్ ఫ్రా నగర విశేషాలు చూస్తూ గడపాలనుకుంటున్నాను." అన్నారాయన.

అన్నయ్య ఆఖరిసారిఢిల్లీలోని వాళ్ళ హెడ్ క్వార్టర్కు రాసిన ఉత్తరం సారధిగారి దగ్గిరుంది. దాని వెనక అన్నయ్య చిరునామాకూడా ఉంది. అక్కడికే మేమిప్పుడు వెళ్ళేది.

గది లాక్ చేసి, లిఫ్ట్‌లో కిందికెళ్ళి టాక్సీ ఎక్కాం.

సారధి డ్రైవర్‌తో వాంగ్ స్ట్రీట్ తీసికెళ్ళమని చెప్పారు. పావుగంట తరవాత టాక్సీ ఒకచోట ఆగింది. టాక్సీ వెళ్ళిపోయాక, ఇద్దరం కాలినడకన బైలుదేరాం. ఆ రోడ్డూ, వీధులూ చూస్తోంటే, ఆ దేశం చాలా వెనకబడుందనిపించింది.

అలా కొద్దిదూరం నడిచి, ఓ ఇరుకైన వీధిలో ప్రవేశించాం. వీధి కిరుపక్కలా ఇళ్ళున్నాయి. అక్కడక్కడా పిల్లలు తొక్కుడు బిళ్ళాటాడుకుంటున్నారు. ఇంటి నెంబర్స్ జాగ్రత్తగా పరిశీలిస్తూ ఓ ఇంటిముందాగారు సారధి.

తలుపు మూసుంది. మునివేళ్ళతో మెల్లిగా తట్టారు. ఐదు నిమిషాలు గడిచినా ఎవ్వరూ వస్తున్న జాడ లేదు. ఈసారి దబదబ బాదారు. రెండునిమిషాల తరవాత, ఓ ఏభై ఏళ్ళ స్త్రీ తలుపు తెరిచింది. చిట్టికళ్ళు మిటకరిస్తూ మమ్మల్ని ప్రశ్నార్ధకంగా చూసింది.

"ఎక్స్‌క్యూజ్ మీ! మీతో కొన్ని వివరాలు అడిగి తెలుసుకోవాలి!" అన్నారు సారధి ఇంగ్లీషు పదాలు ఒత్తి పలుకుతూ.

"చెప్పండి!"

"లోనికి రావచ్చా?"

ఆమె క్షణం ఆలోచించి, "రండి." అంది తలుపు కడ్డం తొలుగుతూ.

ఇద్దరం లోన అడుగుపెట్టాం. ఇల్లు పెద్దదే. కాని, లోపలున్న వస్తువులూ, అవీ చూస్తోంటే, ఆ ఇంటి యజమానులు కడుపేద జీవితం గడుపుతున్నట్టుతోచింది. ఓ గోడవారగా పైకెళ్ళడానికి మెట్లున్నాయి.

"చెప్పండి!" అందామె అసలు విషయానికి వస్తూ.

"మేము భారతీయులం! గత కొద్ది నెలలుగా నా స్నేహితుడొకడు మీ దేశంలో వుంటున్నాడు. అతను మీ ఇంట్లోనే అద్దెకుంటున్నట్టు తెలిసింది. అతన్ని చూసిపోదామని వచ్చాము." అన్నారు సారథి.

"అతని పేరేమిటి?"

"గౌతమ్!"

ఆ పేరు వినగానే ఆమె మొహం వివర్ణమైంది, "అ... అతనిప్పు డిక్కడ లేడు...వ్... వెళ్ళిపోయాడు," అంది తడబడుతూ.

"ఎప్పుడు?"

"దాదాపు వారం పదిరోజులైంది."

"ఎక్కడికెళ్ళాడు?"

"ఏమో! నాకేం తెలీదు." ఆమె తీరు చూస్తోంటే తప్పకుండా ఏదో దాస్తోందన్న అనుమానం వేసింది నాకు.

సారథి జేబులోంచి కొన్ని నోట్లు తీసి, "గౌతమ్ నాకు చాలా కావలసినవాడు. అతన్నెలాగైనా కలుసుకుని తీరాలి. మీరేదో చెప్పడానికి తటపటాయిస్తున్నారు. మాతో సహకరించారంటే ఈ నోట్లు మీస్వంతమౌతాయి."

వాటిని చూడగానే ఆమె కళ్ళల్లో కాంతి కనిపించింది. "మీతో ఎలా సహకరించమంటారు?" అడిగింది నెమ్మదిగా.

"గౌతమ్ ఇక్కడున్నప్పుడేం జరిగిందో? అతడెక్కడికెళ్ళాడో మొదలైనవి మీకు తెలిసినంతవరకూ

నిజం చెబితే చాలు."

"ఇక్కడ నా కళ్ళముందు జరిగింది మాత్రం చెప్ప గలను...ఒకరోజు వాళ్ళు వచ్చి...అతన్ని తీసికెళ్ళారు. ఎక్కడికి తీసికెళ్లారో మాత్రం నాకు తెలీదు."

"వాళ్ళంటే ఎవరు?"

"ఏమో! నేనూ అదే మొదటిసారి వాళ్ళని చూశాను."

"ఎంతమంది వచ్చారు?"

"నలుగురు."

"వచ్చి ఏం చేశారు?"

"గౌతమ్‌ని వెంటబెట్టుకెళ్ళారు. అంతే! ఆ తరువాత నేనతన్ని చూళ్లేదు. రెండో రోజు మాత్రం ఆ నలుగురు వ్యక్తులూ మళ్ళీ వచ్చి, అతని సామాను పట్టుకెళ్ళారు. అంతేకాదు. ఈ ఇల్లంతా గాలించి మరీ వెళ్ళారు."

"ఇల్లు దేనికి గాలించారు?"

"న్...నాకేం తెలుసు?" ఆమె మళ్ళీ ఏదో దాస్తున్నట్టు బిత్తరచూపులు చూడసాగింది.

"మీ రెందుకో నిజం చెప్పడానికి భయపడుతున్నారు. మేము గౌతమ్ ఆప్తులం! మమ్మల్ని అనుమానించకండి. గౌతమ్ సామానులో వాళ్ళకా్కవలసిన వస్తువేదో దొరకలేదు కాబోలు. అందుకే ఇల్లంతా వెదికారు. ఏమిటది? ఇల్లు వెదికాక అది వాళ్ళకి దొరికిందా?" అడిగారు సారధి జేబులోంచి మరికొన్ని నోట్లు తీస్తూ.

ఆమె కళ్ళు వాటిమీద పడగానే తల అడ్డం తిప్పి, "లేదు" అంది.

"ఐతే, గౌతమ్ దాన్ని ఇక్కడే ఎక్కడో దాచుం

టాడు. ఔనా?"

ఆమె తలూపింది!

"ఏమిటది? మీకు తెలిస్తే దయచేసి చెప్పండి," అంటూ ఆమె చేతిలో బలవంతంగా నోట్లు కుక్కారు సారధి.

ఆమె క్షణంపాటు ఆయన్ని చూస్తూండిపోయింది. తరవాత చటుక్కున తలుపుమూసి వెనుదిరిగింది. "ఆ నలుగురు వ్యక్తులు గౌతమ్ సామాను తీసికెళ్లాక మళ్ళీ వచ్చారు నాదగ్గరికి. గౌతమ్ నాకేదైనా దాయమని ఇచ్చాడా? అని గుచ్చిగుచ్చి అడిగారు. ససేమిరా లేద న్నాను. దాంతో, నన్ను నానా దుర్భాషలాడి వెళ్ళి పోయారు," అంటూ బాడీ లోపలికి చెయ్యిపోనిచ్చి, బాగా పాతబడ్డ చిన్న పర్సులాటి తోలుసంచి తీసిం దామె.

"ఆరోజు ఆ ఆగంతకులవెంట గౌతమ్ కిందికి దిగి వచ్చినప్పుడు నేనిక్కడే తలుపుపక్కన నిల్చున్నాను. గౌతమ్ దృష్టి నామీద పడగానే వాళ్ళకు నన్ను పరి చయం చేస్తూ, "ఈమె ఈ ఇంటి యజమానురాలు. పాపం, ఇంటి అద్దెతో, భర్త పెన్షన్‌తో జీవిస్తోంది. ఈమెకు ఈనెల అద్దె బాకీ ఉన్నాను. ఇవ్వనివ్వండి.' అంటూ నన్ను సమీపించాడు.

అతని మాటలు విని నాకాశ్చర్యం వేసింది. ఎందు కంటే, గౌతమ్ ఆ నెల అద్దె నాకు ముందే ఇచ్చేశాడు. నేనింకా నోరెత్తకముందే అతను పర్సులోంచి డబ్బుతీసి నా చేతిలో పెడుతూ, 'బహుశా, నేను మళ్ళీ తిరిగి రాక పోవచ్చు. ఈ డబ్బు వుంచండి. జాగ్రత్తగా వాడు కోండి. వృథా చెయ్యకండి," అని వెళ్ళిపోయాడు.

వాళ్ళు పోయాక చూస్తే, అతనిచ్చిన నోట్లమధ్య ఈ కాగితం పెట్టివుంది!" అంటూ పర్సులోంచి మడత పెట్టిన ఓ కాగితంతీసి, సారథికందించిందామె.

దాన్ని జేబులో వేసుకుంటూ, "పైన అతను నివసించిన గది ఒకసారి చూడనిస్తారా...?" అడిగారు సారథి.

"ఆ గదిలో ఇప్పుడు మరొకతను వచ్చి దిగాడు. అతనూ మీలాగే గౌతమ్ స్నేహితుణ్ణని చెప్పాడు."

"ఏమిటీ? గౌతమ్ స్నేహితుడా? అతని పేరేమిటి...?"

"మురళీధర్!"

సారథి ఆశ్చర్యపోయి. "ఇప్పుడతను గదిలో ఉన్నాడా?" అడిగారు.

"తెలీదు. ఎప్పుడొస్తాడో, ఎప్పుడు పోతాడో? రాకపోకలకి అవతలివైపు మెట్లున్నాయి."

"గౌతమ్ స్నేహితుడు, మాకూ స్నేహితుడే. అతన్నోసారి చూడాలి."

ఆమె తలూపింది.

నేనూ, సారథీ చెక్కమెట్లెక్కి పైకెళ్ళాం. పైన ఒకే ఒక గది ఉంది. తలుపు మూసుంది.

సారథి తలుపుముందాగి, "మురళీ!" అంటూ తట్టబోయారు.

ఆయన చెయ్యిపడగానే తలుపు కిర్రుమంటూ తెరుచుకుంది. లోన అడుగుపెట్టాం! అంతే__

గదిలో కనిపించిన దృశ్యం చూడగానే, భయంతో గావుకేకలు పెట్టసాగాను. సారథి చటుక్కున నానోరు నొక్కి పట్టుకున్నారు. ఫిట్స్ వచ్చిన రోగిలా వణుకుతూ

గుడ్లప్పగించి అలాగే చూడసాగాను.

గది మధ్య మంచం!

మంచంమీద వెల్లకిలా పడుంది శవం!!

తల నరికిన శవం!!!

పరుపంతా కళ్ళాపి చల్లినట్టు చిమ్మివుంది ఎర్రని చిక్కని రక్తం.

"ము...ర...ళీ... ధర్!" సారధి పెదాలు వణికాయి.

గదంతా ఎవ్వరో గాలించినట్టు, వస్తువులన్నీ చెల్లా చెదురుగా పడున్నాయి.

"మనమిక్కడ ఎక్కువసేపుండటం మంచిదికాదు. పద పోదాం!" అంటూ నా రెక్కపట్టుకుని బైటికి లాక్కెళ్లారు సారధి.

# 5

హోటల్ చేరేవరకూ నా గుండె స్థిమితపడలేదు.

సారధిగారు గది తలుపు మూసి, నన్ను బాల్కనీలోకి తీసికెళ్ళారు. "భయపడి మనసు పాడుచేసుకోవద్దు. అటువంటి సంఘటనలు ఇంకా ఎన్ని తటస్థపడతాయో తెలీదు. ఈజీగా తీసుకోవాలి," అన్నారు సముదాయిస్తూ.

"అటువంటి భీకర దృశ్యం చూడటం నాకిదే మొదటి సారి. ఒళ్ళు గగుర్పొడిచిందంటే నమ్మండి. అంత కిరాతకంగా అతన్ని ఎవ్వరు చంపారు? ఎందుకు చంపారు?" అడిగాను ఎగిసిపడే గుండెతో.

"ఇంకెవ్వరు? మీ అన్నయ్యని చంపినవాళ్ళే అయుంటారు. మురళీధర్ జర్నలిస్టు. గౌతమ్ చివరి రోజుల్లో నివసించిన ఆ ఇంట్లో అతను కనుక్కోడానికి ప్రయ

త్నించి, అసంపూర్తిగా వదిలిన ఆ రహస్యపు అవశేషా లేమైనా అక్కడ దొరుకుతాయేమో ప్రయత్నిద్దామని తనూ ఆ గది అద్దెకి తీసుకుంటాడు.

ఈ విషయం పసిగట్టిన హంతకులు గౌతమ్‌లాగే అతన్నీ తమదారికడ్డు తొలగించుకున్నారు. గదిలోవున్న సామాను తీరు చూశావుగా? దేనికోసమో తీవ్రంగా గాలించినట్టుంది.

వాళ్ళక్కావలసిన వస్తువు మురళీధర్ చేతికి చిక్కిం దేమోనని అలా గాలించారు. బహుశా, అది ఈ కాగితమే అయివుంటుంది," అంటూ కోటు జేబులోంచి ఆ ఇంటి యజమానురాలిచ్చిన కాగితం బైటికి తీశారు సారథి.

అరఠావు సైజు కాగితం అది. అందులో రాసివున్న చేతివ్రాత చూడగానే నా కళ్ళు పెద్దవయ్యాయి. "ఇది అన్నయ్య చేతివ్రాతే!" అన్నాను ఆత్రంగా.

సారథి తలూపి, "ఇది అసంపూర్తిగా వున్నట్టుంది. దీని ముందూ వెనకా మరికొన్ని పేజీలు ఉండివుండాలి. చూడు దీనిమీద నెంబర్ మూడని వేసుంది," అన్నారు దాన్ని పరీక్షగా చూస్తూ.

నిజమే. మేటర్ అసంపూర్తిగా వుంది. ఆయనతో బాటు నేనూ ఆత్రంగా చదవసాగాను, అందులో రాసి వున్న విషయాన్ని.

'...ప్రపంచం మరో నరకాన్ని చవిచూడబోతోంది. ప్రపంచదేశాల్లో మళ్ళీ ఓ కొత్త సంచలనం చెలరేగ బోతోంది. పెథిడిన్, మార్ఫిన్, హెరాయిన్, కోకిన్ వంటి భయంకరమైన మత్తుపదార్థాల పరిణామా లను ప్రపంచ దేశాలన్నీ ఇదివరకే ఎదుర్కొన్నాయి.

ఇప్పుడు వాటికన్నా భీభత్సమైన, దారుణమైన మరో కొత్త పదార్థం ఉత్పత్తి కాబోతోంది. మోషేన్!

పెథెడిన్, మార్ఫిన్ వంటి పదార్థాలకు అలవాటుపడ్డ మనుషులు సమాజానికెందుకూ పనికిరాకుండా పోతారు. వాటికోసం వాళ్లు ఎంతటి ఘాతుకానికైనా సిద్ధపడతారు. నిజమే.

ఐతే, మనిషి ఏ ఒక్కసారో వాటిని పుచ్చుకున్నంత మాత్రాన వాటికి దాసోహం కాడు. నాలుగైదుసార్లు వరసగా పుచ్చుకుంటేనే ఆ ప్రమాదం వుంటుంది.

కాని మోషేన్ అనబడే ఈ కొత్త పదార్థాన్ని మనిషి ఒక్కసారి చవిచూశాడంటే, దాన్ని మళ్ళీ పొందే వరకూ నిదరపోడు. దానికోసం ఏమైనా చెయ్యడానికి సిద్ధపడతాడు.

మొదటిసారి దాన్ని బుద్ధిపూర్వకంగా తీసుకున్నా, మోసపూరితంగా తీసుకున్నా సరే! అటువంటి పదార్థాన్ని ఒక దేశపు రాజకీయ నాయకులకో, లేదా, కీలకమైన ప్రముఖ వ్యక్తులకో ఇచ్చి, దానుల్ని చేసి, వారిచేత ఎటువంటి ఘాతుకాలైనా చిటికెలో చేయించవచ్చు.

ఆ పదార్థం ఒక మొక్క ద్వారా తయారవుతుంది. ఆ మొక్కను వరిపొలాల్లో, వరినాట్లమధ్య పండిస్తారు. ఇప్పుడది ఇక్కడే పండించబడుతోంది. ముందు దాన్ని తెల్లని పౌడర్ గా మార్చి, కేప్సూల్ రూపంలోనో, ఇంజక్షన్ రూపంలోనో తయారుచేస్తారు.

దాని ఉత్పత్తి ఇప్పుడిప్పుడే ప్రారంభమైంది. ప్రయోగ నిమిత్తం ఇప్పటికే అనేకమందిని దానికి బానిసలు చేసివేశారు. ఈ ముఠావాళ్ళకు ప్రత్యేకమైన గుర్తింపు చిహ్నం వుంది.

నాగుపాము ఆకారంగల బంగారు ఉంగరం ఎవ్వరి దగ్గరైతే ఉంటుందో...' పేజీ పూర్తయింది. ఆ తర వాత ఏంరాశాడో తెలీదు.

"ఆ పదార్థం ఇక్కడే ఉత్పత్తి అవుతోందని రాశాడు. ఆ ప్రదేశం ఎక్కడుందని కనుక్కోవాలి?" అడిగాను అయోమయంగా.

"అది ఏ మొక్కనించైతే తయారవుతోందో ఆ మొక్క పరిపొలాల్లో పండించబడుతుందని తెల్పాడు. అంటే, దానికి నీటి అవసరం ఎంతో వుండివుంటుంది.

ఈ దేశ ప్రజల ముఖ్యాహారం బియ్యం! దేశం మూడో వంతు సాగుభూమిలో ధాన్యాన్నే పండిస్తారు. ప్రత్యే కంగా అది ఎక్కడ పండింపబడుతుందో కనుక్కోడం కష్టమే!

ఈ కాగితంలోని చివరి వాక్యాలే నన్ను విపరీతంగా ఆకట్టుకుంటున్నాయి. నాగుపాము ఆకారంగల వుంగరం ఆ ముఠావాళ్లు గుర్తింపు చిహ్నమట! కొంపదీసి రాత్రి క్లబ్బులో కాకతాళీయంగా మనకు దొరికిన ఆ ఉంగరమే ఆ చిహ్నం కాదుకదా?

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నాకు దాని సంగతి. "కావచ్చు. అందుకే ఆ వ్యక్తి దానికోసం అంతలా ఆ స్త్రీని చెంపవాయగొట్టాడు. ఇప్పుడేం చేద్దామం టారు?"

సారధి రిస్టువాచీ చూసుకుని, "మధ్యాహ్నం రెండవు తోంది. నీవు రెస్టు తీసుకో. ఆలోగా నేను క్షుణ్ణంగా ఆలోచించి ఓ నిర్ణయానికి వస్తాను," అన్నారు గదిలోకి నడుస్తూ.

సాయంత్రం ఐదుంబావుకు నిదరలేచాను. స్నానం

అదీ ముగించుకుని తయారయ్యే సరికి ఆరయింది.

"ఈ రాత్రి మన ప్రోగ్రాం ఏమిటి డార్లింగ్?" అడిగాను.

"వజ్రాల హారం కొని పెట్టమని చాలా రోజుల్నించీ పోరుతున్నావుగా? ఈరోజు నీ కోరిక నెరవేర్చదలచాను," అన్నారాయన స్వచ్ఛమైన ప్రేమికుడిలా.

రూమ్ లాక్ చేసి, ఇద్దరం కిందికెళ్ళాం. దొరికిన టాక్సీ ఎక్కి బైలుదేరాం.

"జువెలరీ షాప్‌లో నువ్వు ఏ నగనీ సెలెక్ట్ చెయ్యకూడదు," అన్నాలు సారధి తగ్గు స్వరంతో.

"అదేమిటి?" అడిగాను ఆశ్చర్యంగా.

"మనం ఆ షాప్‌కెళ్ళేది కేవలం నటించడానికి, కొనడానిక్కాదు! ఒక రంగేళీ కోటీశ్వరుడు అందమైన ప్రేయసితోడుండగా, అదీ పరాయిదేశంలో ఆమెకోసం నగలేవీ కొనకపోడం అనుమానాలకి దారితియ్యొచ్చు. అందుకే ఈ నాటకం!"

"మీరు ప్రతివిషయాన్నీ చాలా సూక్ష్మంగా ఆలోచిస్తారు," అన్నాను నవ్వుతూ.

"అందుకే ఈ వృత్తిలో ఇంతకాలం నిలదొక్కుకోగలిగాను."

జ్యూవెలరీ షాప్ వచ్చేసింది.

టాక్సీ పంపేసి ఇద్దరం లోనికి నడిచాం.

మమ్మల్ని చూడగానే ఎంతో సాదరంగా ఆహ్వానించాడు ప్రొప్రైటర్. సారధిగారు చెప్పినట్టు ఒక్కో నగ చూస్తూ పెదవి విరుస్తున్నాను. దాదాపు షోకేసుల్లో వున్న నగలన్నీ చూపించాడు ప్రొప్రైటర్.

వాటిలో ప్రతిదానికీ ఏదో ఒక వంక చూపెడుతూ,

కొన్ని డిజైన్స్ ఇదివరకే నాదగ్గిరున్నాయంటూ దాట వేశాను. అంత చేసినా, ప్రొప్రైటర్ మొహంలో విసుగూ, చిరాకూ కనిపించ లేదు.

చివరకి నవ్వి —"వీరిని సంతృప్తిపరచగలిగే నగలు మా షాపులో లేకపోయినందుకు చింతిస్తున్నాం! కావాలంటే, మీరు కోరుకునే డిజైన్లో ఏదైనాసరే, చేసివ్వగలము," అన్నాడు సారథితో.

ఆయన మందహాసం చేస్తూ చూశారు నావైపు. "విన్నావా? నీకెలాంటి డిజైన్ కావాలో ఈ రాత్రి బాగా ఆలోచించుకుని రేపు వచ్చి చెప్పు," అన్నారు.

తలూపాను.

ఆయన జేబులోంచి ఆ నాగుపాము ఆకారంగల ఉంగరం తీసి, షాపతనికి చూపిస్తూ, "ఇందులో పొదిగి వున్న రెండు వజ్రాలు నిజమైనవేనా?"—అడిగారు.

షాపతను ఐగ్లాస్ తీసిపెట్టుకొని, కాసేపు ఉంగరాన్ని పరిశీలించి—"నిజమైనవే! కాని అట్టే విలువైనవి కావు" అన్నాడు తిరిగిస్తూ.

సరిగ్గా అదే క్షణంలో, ఓ వ్యక్తి షాప్లో ప్రవేశించి కౌంటర్ దగ్గరికొచ్చాడు. ప్రొప్రైటర్ సారథిగారికిస్తున్న ఉంగరంమీద దృష్టి పడగానే అతనెందుకో ఒక్కసారి ఉలిక్కిపడ్డట్టు తోచింది నాకు.

"థాంక్యూ! ఈ రాత్రి ఈవిడ డిజైన్ సెలెక్షన్ పూర్తి కాగానే రేపు వచ్చి కలుస్తాము" అన్నారు సారథి.

"ఓ. కే. సార్!"

మేము వెనుదిరిగామో లేదో, కౌంటర్ దగ్గర నిల్చున్న ఆ వ్యక్తి సారథిని సమీపించి—"ఎక్స్క్యూజ్ మీ!

మిమ్మల్ని చూస్తోంటే, మనం ఇదివరకెక్కడో కలుసు కున్నట్టు అనుభూతి కలుగుతోంది'' అన్నాడు కలుపు గోలుగా.

సారథి అతన్ని కాసేపు పరీక్షగా చూసి, ''మిమ్మల్నె క్కడా చూసిన గుర్తులేదు నాకు!'' అన్నారు నిర్మొహ మాటంగా.

''బహుశా, నేనే మిమ్మల్ని చూసుంటాను వెస్టర్న్ బ్లూలో. మీరు దాని మెంబరేనని నాకు రూఢి అయింది. అందుకే అడిగాను'' అన్నాడు తను నవ్వుతూ.

నాకు వాళ్ళ సంభాషణేమీ అర్థం కావడంలేదు. సారథిగార్ని అతను వెస్టర్న్ బ్లూ మెంబరంటాడేమిటి? భూటాన్ వచ్చినప్పట్నించీ ఆయన నావెంటే వున్నారే? అక్కడికెప్పుడెళ్ళారూ? మెంబర్‌షిప్ ఎప్పుడు తీసు కున్నారూ?

నా ఆలోచనలు ముగిసేలోగా, వాళ్ళిద్దరూ సెలవు తీసుకున్నారు.

సారథి నా చెయ్యందుకుని, షాప్‌లోంచి బయటికి నడిచారు.

''వెస్టర్న్ బ్లూ ఏమిటి? మీరందులో మెంబర్‌షిప్ ఎప్పుడు తీసుకున్నారు?'' అడిగాను ఆశ్చర్యంగా.

''నేనా పేరు వినడం, అతన్ని చూడటం యిదే మొదటిసారి!'' అన్నారాయన అదే స్థితిలో.

''ఒక విషయం గమనించారా? అతనా ఉంగరం చూడగానే ఉలిక్కిపడ్డాడు. తరువాత కావాలని మిమ్మల్ని పలకరించాడు.''

''ఔను. దీన్నిబట్టి నా దగ్గిరున్న ఆ ఉంగరం ఆ ముఠా గుర్తింపు చిహ్నమేననీ, ఆ వ్యక్తి ఆ ముఠాకు

చెందినవాడేననీ, అందుకే ఆ ఉంగరాన్ని చూసి, నేనూ వాళ్ళ సభ్యురాలిననుకొని పలకరించాడనీ స్పష్టమవుతోంది.

బహుశా, ఆ వెస్టర్న్‌క్లబ్ ఆ ముఠా సభ్యుల కేంద్రమయి ఉంటుంది. అందుకే అతను నన్నక్కడ చూసుంటానన్నాడు. పైగా, నేను దాని మెంబర్నని తనకి రూఢి అయిందనికూడా అన్నాడు. మనం వెంటనే దాని గురించి ఆరా తీయాలి'' అన్నారు సారధి.

అప్పటికే మేమిద్దరం షాపులోంచి బైటపడి రోడ్డు మీదికొచ్చాం. ఫుట్‌పాత్ పక్కన ఓ టాక్సీ కనిపించింది.

సారధి గబగబ డ్రైవర్ని సమీపించి, ''వెస్టర్న్‌క్లబ్ ఎక్కడుందో తెలుసా?'' అడిగారు చీకట్లో బాణం వదులుతో.

''తెలియకేం? అదొక నైట్‌క్లబ్. నగరం శివార్లలో ఉంది. తీసికెళ్ళమంటారా?'' అడిగాడు ఆశగా.

సారధి తలూపి, బాక్‌డోర్ తెరిచారు.

## 6

ఊరిచివర విశాలమైన ప్రహరీమధ్య వుంది క్లబ్. మా టాక్సీ కాంపౌండ్‌లోకి తిరిగి, పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది.

డ్రైవర్‌కు మీటర్‌బిల్ పేచేసి లోనికి నడిచాం. లోపల దేశవిదేశీ జనంతో క్రిక్కిరిసి ఉన్నాయి టేబిళ్లు. ఒకరిద్దరు నన్ను గుటకలువేస్తూ చూస్తున్నారు. పాపం, మగాళ్ళు మరి. ఆడది కనిపిస్తే చాలు గుడ్లు గుడ్లగూబల్లా తయారవుతాయి వాళ్ళకి.

నేనవేమీ పట్టించుకోకండా సారధిగార్ని అనుస

రిస్తూ వెళ్ళి, విడిగా ఉన్న ఓ టేబులుముందు వెళ్లి కూర్చు న్నాను.

అప్పుడే స్టేజిమీది తెర కొద్దికొద్దిగా పైకి లేవసాగింది. అంతవరకూ సన్నగా మోగుతున్న ఆర్కెస్ట్రా ఇప్పుడు చెవులు బద్దలు కొట్టసాగింది. బహుశా, కేబరే డాన్స్ కాబోలు!

సారధిగారి ఎక్స్‌రే కళ్ళు అక్కడ కూర్చున్నవాళ్ళం దర్నీ నిశితంగా పరిశీలిస్తున్నాయి. ఆర్కెస్ట్రా మిన్ను ముట్టేసరికి అందరి దృష్టి స్టేజిమీదికి మళ్ళింది.

బేరర్ వచ్చి వినయంగా అభివాదం చేశాడు మాకు.

సారధి రెండు ఫ్రూట్ సలాడ్స్‌కు ఆర్డరిచ్చారు.

అంతలో, స్టేజిమీద కేబరే డాన్సర్ ప్రత్యక్షమైంది. మగవాళ్ళ సంగతెలా ఉందోగానీ, నాకు మాత్రం ఆ అర్ధనగ్న నారీమణిని చూస్తోంటే ఒళ్ళు మండి పోతోంది.

సిగ్గూ, లజ్జా విడిచి అలా పిరుదులూపుకు బ్రతికే ఆడవాళ్ళంటే నాకు మహా ఎలర్జీ!

బేరర్ ఫ్రూట్ సలాడ్స్ తెచ్చి మాముందు పెట్టి వెళ్ళాడు. కొద్దికొద్దిగా తింటూ చూడసాగాను ఆ నగ్న ప్రదర్శన. డాన్స్ ముగిసిందో లేదో, హాలు కరతాళ ధ్వనులతో మారుమోగింది. పిచ్చిమాలోకం.

ఆ నర్తకీమణి లోనికెళ్ళగానే స్టేజిమీది కర్టెన్ లాగే ఆర్కెస్ట్రాకూడా మళ్ళీ మొదటిస్థాయికి దిగింది. మూతి విరుస్తూ ద్వారంవైపు చూసి గతుక్కుమన్నాను.

సరిగ్గా అప్పుడే ఓ వ్యక్తి లోనికి ప్రవేశిస్తున్నాడు. అతను యెవ్వరో కాదు, గతరాత్రి నైట్‌క్లబ్‌లో సారధి కొట్టినతనే!

"హేమా! అతన్ని గుర్తించావా?" అన్న పిలుపువిని ఆయనవైపు చూశాను.

ఆయన చూపులు కూడా ద్వారంమీదే నిలిచి ఉన్నాయి.

"గుర్తించాను.నిన్నరాత్రి మీరు చేయిజేసుకున్నతనే. ఇప్పుడేం చేద్దాం?" అడిగాను ఖంగారుగా.

"వేచి చూడు!"

తలవంచుకుని ఓరగా ఆ వ్యక్తివైపు చూశాను. అప్పటికే అతను ఓ మూలవున్న టేబుల్ని సమీపించాడు. అప్పటికే అక్కడ మరో యిద్దరు కూర్చునున్నారు.

ముగ్గురూ పెద్దగా నవ్వుతూ కరచాలనం చేసుకున్నారు. అతనిలాగే, ఆ యిద్దరి మొహాల్లోనూ, నిర్దాక్షిణ్యం, కరుకుదనం కనిపిస్తోంది!

"హేమా! ఆ ముగ్గురూ ప్రొఫెషనల్ రౌడీల్లా ఉన్నారు. ఖర్మగాలి వాడు నన్ను చూశాడంటే క్షణంలో గుర్తుపడతాడు. పెద్ద గొడవ జరిగే ప్రమాదముంది. ఇక్కణ్ణించి యెంత త్వరగా జారుకుంటే అంత మంచిది" అంటూ బేరర్ కోసం అటూ ఇటూ చూశారు సారథి.

అతను కనుపించగానే సైగచేసి, బిల్లు తెమ్మన్నారు. రెండు నిముషాల్లో వచ్చేసింది బిల్లు.

బిల్లు పేజేసి, "కమాన్!..." అంటూ లేచారు సారథి.

ఇద్దరం వడివడిగా ద్వారంవైపు నడిచాం. నడుస్తూ ఓరగా వాళ్లు కూర్చున్నవైపు చూసి గతుక్కుమన్నాను. అతనిదృష్టి మామీద పడనే పడింది. వెంటనే తన, అనుచరులకు మమ్మల్ని చూపిస్తూ ఏదో అన్నాడు.

నా గుండె గతి వేగం అందుకుంది. గబగబ క్లబ్బు లోంచి బైటపడ్డాం. పార్కింగ్‌లో స్వంత కార్లు తప్ప టాక్సీలు లేవు. మేము వచ్చిన టాక్సీని అక్కడే వెయిటింగ్‌లో ఉండమని యెందుకు చెప్పలేదా అనిపించింది.

సారథి నా చెయ్యి పట్టుకొని, వడివడిగా మెయిన్ గేటువైపు అడుగులు వేస్తున్నారు. గేటింకా చాలా దూరం ఉంది. అంతలో మా వెనక ఎవ్వరో పరిగెత్తుకు వస్తున్న అడుగుల శబ్దం వినిపించి, గిరుక్కున వెనుదిరిగి చూశాను. వాళ్ళే!

ముందు ముగ్గురేమో అనుకున్నాను. కాదు ఇద్దరే. మూడో వ్యక్తి లోపలే ఉన్నాడేమో!

"ఏయ్, మిస్టర్! ఆగు!" అంటున్నాడతను గబగబ మమ్మల్ని సమీపిస్తూ.

గత్యంతరం లేదు. సారథి ఆగిపోయారు.

నా గుండెలో గుర్రాలు దౌడుతీస్తున్నాయి.

"హల్లో మిస్టర్! హవ్వార్యూ?" అడిగాడతను మమల్ని సమీపించి.

"ఫైన్! ఇంతకీ, మీ రెవ్వరో తెలుసుకోవచ్చా?" అడిగారు సారథి చాలా నింపాదిగా.

విటు విన్నట్టు నవ్వాడతను. "జోక్ బావుంది! నన్నప్పుడే మర్చిపోయావా? నిన్నరాత్రి అడంగిలా నా మీద దాడిచేసి పారిపోయావే? నాకు స్పృహ వచ్చేవరకూ నువ్వక్కడ ఉండి ఉంటే, ఈపాటికి నీ మాంసాన్ని ఊరకుక్కలు శుభ్రంగా అరగించి ఉండేవి" అంటూ జేబులో చెయ్యి పెట్టాడతను.

అంతే!

అంతవరకూ బుద్ధిగా నిల్చున్న సారథి, కాళ్ళక్రింద స్ప్రింగులున్నట్టు ఛెంగున ఎగిరాడు గాలిలోకి. మరుక్షణం ఆయన రెండు కాళ్ళూ అతని ఛాతిని గుద్దేశాయి. ఆ మెరుపు దెబ్బకి అతను కాండం నరికిన చెట్టులా కింద కూలాడు.

ఊహించని సారథి బూటుముడమ అతని కణతని ముద్దెట్టుకొంది. ఆ ఒక్క దెబ్బకే అతని శరీరం చలన రహితమైపోయింది.

అలాగా అతని అనుచరుడి చేతిలోకి బారెడు కైజారు వచ్చేసింది.

భయంతో నేను వెనక్కి తప్పుకున్నాను. అతను కైజారు ఎత్తి సారథిని పొడవడానికి చిఱుతలా ముందుకు దూకాడు.

సారథి మెరుపులా పక్కకి తప్పుకుని, అతని కుడిచెయ్యి మెలివేసి పట్టుకున్నారు. మరుక్షణం ఆయన బూటు కాలు అతని తొడలమధ్య పడింది బలంగా.

"ఘీప్!" మన్న శబ్దంతో అతని గుడ్లు వెళ్ళుకు వచ్చాయి.

సారథి క్షణం ఆలస్యం చెయ్యకుండా మరో దెబ్బ తీశాడక్కడ. వేరొకరైతే ఆ క్రూరమైన దెబ్బలకి హరీ మనేవారే! అతను కిక్కురుమనకుండా కిందపడి మూర్ఛపోయాడు.

'హమ్మయ్య' అనుకుంటూ గుండెమీద చెయ్యి వేసుకున్నానో లేదో, అంతవరకూ ఐపు లేనివాళ్ళ మూడో అనుచరుడు చీకట్లోంచి బాణంలా దూసుకువచ్చాడు ఆయన మీదికి.

వస్తూనే పాట్రేలులా ఆయన్ని ఢీకొన్నాడు. ఊహించని ఆ మెరుపుదాడికి సారధి ఉన్నఫళంగా నేల కరిచారు.

వాడాయన ఛాతీమీద కూర్చుని, పాదాలతో ఆయన చేతులు అదిమిపెట్టి, గొంతు నులమడం ప్రారంభించాడు. ఆయన నోట్లోంచి మాట పెగలడంలేదు. వాడి ఉడుం పట్టు సడలించడానికి శతవిధాలా ప్రయత్నిస్తున్నారు. ఆయన ప్రయత్నాలేవీ ఫలించడంలేదు.

ఆయనకేమైనా ఐతే నాగతేంగాను? ఈ ఆలోచనతో నా ఒళ్ళు వేపాకులా వణికిపోయింది. వెనకా ముందూ యోచించే వ్యవధి లేదు. చటుక్కున వంగి కుడి కాలుకున్న హైహీల్ తీశాను.

దాని మడమ ఎత్తైనది. సుత్తిలా వాడ్రొచ్చు. ఒంట్లో వున్న శక్తినంతా కూడదీసుకుని, సారధి ఛాతీమీద కూర్చున్న వ్యక్తి బుర్రమీద బాదడం ప్రారంభించాను.

అతనా దెబ్బలు తప్పించుకోడానికి తల అటూ ఇటూ తిప్పుతున్నాడు.

గొంతుమీంచి అతని పట్టు కొద్దిగా సడలగానే సారధి చటుక్కున అతన్ని పక్కకి తోసి నిల్చున్నారు. లేవగానే ఈడ్చి అతని డొక్కలో ఒక్క తన్నుతన్నారు. ఆ ఒక్క తన్నుకే అతను స్పృహతప్పిపోయాడు.

"గుడ్ హేమా! సమయానికి ఆపద్బాంధవిలా అను కున్నావ్. పద. ఇహ ఒక్కక్షణంకూడా ఇక్కడుండ కూడదు," అంటూ నా రెక్క పుచ్చుకుని గేటువైపు నడిచారు సారధి.

అక్కణ్నించి కాలినడకన చాలాదూరం వెళ్ళాక గానీ, మాకు టాక్సీ దొరకలేదు. హోటల్ చేరి, మా

గదిలో అడుగుపెట్టేసరికి పన్నెండు గంటలయింది. గదిలో ప్రవేశించగానే సారధి తలుపు లోపల గడియ బిగించి, నన్ను బాల్కనీలోకి తీసికెళ్ళారు.

"హేమా! మన పొజిషన్ ఇప్పుడు ప్రమాదకరంగా పరిణమించింది. ఈపాటికా ముగ్గురూ కోలుకుంటారు, విదేశాలు పర్యటించడానికి వచ్చిన ఒక కోటీశ్వరుడు. కాకలుదీరిన ముగ్గురు రౌడీలని ఏకంగా అలా మూర్ఛపోగొట్టగలడా?

పగలు మనం మీ అన్నయ్య నివసించిన ఇంటికెళ్ళడం ఇప్పుడీ ముగ్గుర్నీ చితకబాదడం ఇవన్నీ కలిపి ఆలోచిస్తే ఎవ్వరికైనా ఇట్టే అనుమానం వేస్తుంది. నేను పైకి కనిపిస్తున్నట్టు యాత్రీకుణ్ని కాననీ, కొమ్ములు తిరిగిన గూఢచారిననీ, ఇహ మనం ఎంత త్వరగా ఈ దేశంనించి జారుకుంటే అంత మంచిది, ఏమంటావ్?"

"అన్నయ్యని చంపిన ఆ హంతకుల్నీ, ప్రపంచానికి ముప్పు తేబోతున్న ఆ విషపదార్ధ కూకటివేళ్ళనీ కనుక్కోనిదే భీరువుల్లా పారిపోదామంటారా?" అన్నాను నివ్వెరబోతూ.

"పారిపోదామని ఎప్పుడన్నాను? టాక్సీలో వచ్చేటప్పుడు నాకో పథకం స్ఫురించింది. ఉదయం ఆరు గంటలకి ఇక్కణ్నించి నేపాల్ వెళ్ళే విమానం వుంది. మనం ఆ విమానంలో బైలుదేరి ఖాట్మండూ చేరుకుందాం! అక్కడ నాకు తెలిసిన ఓ మిత్రుడున్నాడు.

అతని సహాయంతో, మారువేషాలు వేసుకుని, కొత్త పేర్లు పెట్టుకుని ఆ పేర్లతో ఫోర్జరీ పాస్‌పోర్టులు సంపాదించి తిరిగి-ఇక్కడికి వచ్చేద్దాం! అప్పుడు వీళ్ళు మనల్ని గుర్తించలేరు. ఈసారి చాలా జాగ్రత్తగా మన కార్య

కలాపాలు కొనసాగించాలి. అర్థమైందా?"

తలూపాను ఆనందంగా.

# 7

ఇంకా తెల్లవారకముందే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, గది ఖాళీ చేసి, ఏర్‌పోర్ట్ చేరుకున్నాం!

సారథి రాత్రే ఏర్‌పోర్ట్‌కు ఫోన్ చేసి, రెండు టికెట్స్ రిజర్వ్ చేయించారట. పంక్చువల్‌గా ఆరుగంటల పది నిమిషాలకి బైలుదేరింది విమానం. భూటాన్, నేపాల్ పక్క పక్క దేశాలే. తింగ్‌ఫూనించి, ఖాట్మండుకు గంటన్నరే ప్రయాణం.

సరిగ్గా ఏడు గంటల నలభై నిమిషాలకి ఖాట్మండు విమానాశ్రయంలో దిగింది ప్లేన్. టాక్సీ ఎక్కి చిన్నగా సారథిగారి స్నేహితుడి ఇంటికి చేరుకున్నాం.

ఆయన పేరు ప్రభుదాస్. వాళ్ళిద్దరూ దాదాపు సమవయస్కులే. చదువుకునే రోజుల్లో ఇద్దరూ సహాధ్యాయులుట. ఆయన పదేళ్ళక్రితం ఇక్కడికి వచ్చి, వ్యాపారంలో స్థిరపడ్డాడుట.

మమ్మల్ని చూడగానే సంభ్రమాశ్చర్యాలతో ఆయన నోరు తెరుచుకుంది.

"ఇది కలా? వైష్ణవమాయా? నేను భారతదేశంలో వున్నానా? నేపాల్‌లో వున్నానా? వచ్చేముందు ఓ టెలిగ్రామైనా ఇస్తే, ఏర్‌పోర్ట్‌కు వచ్చి రిసీవ్ చేసుకునే వాణ్నికదా?" అంటూ అమాంతం సారథిగార్ని కౌగలించుకున్నాడు.

ప్రభూదాస్ భార్య పేరు నమ్రత. చాలా కలుపుగోలు మనిషి. పరిచయమైన కొద్ది క్షణాల్లోనే మేమిద్దరం చేరువైపోయాం.

భార్యాభర్తలిద్దరూ మమ్మల్ని సాదరంగా ఇంట్లోకి తీసికెళ్ళి కూర్చోబెట్టారు. సారధి మొదటినించీ క్లుప్తంగా ఆ కేసు వివరాలు తన మిత్రుడికి వివరించి, ఆయనవల్ల కావలసిన సహాయం ఏమిటో విపులీకరించారు.

అంతా విన్న ప్రభుదాస్ మొహంలో గాంభీర్యం చోటు చేసుకుంది.

"నాకు తెలిసిన ఓ మేకప్ ఆర్టిస్ట్ వున్నాడు. అతని దగ్గర మీకాక్కవలసిన మేకప్ సరంజామా దొరక వచ్చు. పోతే, ఫోర్జరీ పాస్‌పోర్ట్ల సమస్యకూడా పరిష్కారమౌతుంది.

మీరు నకిలీ పాస్‌పోర్టులతో, మారువేషాల్లో విమానం ద్వారా భూటాన్ వెళ్ళడంకంటే, టూరిస్ట్‌బస్‌లో భూటాన్ సందర్శించే యాత్రీకులతో కలిసి వెళ్లడం మంచిదని నా అభిప్రాయం!

అలా మీరు భూమార్గంగుండా నేపాల్ సరిహద్దులు దాటి, భూటాన్‌లో ప్రవేశించి, అనేక గ్రామాలు చూసుకుంటూ తింగ్‌ఫూ చేరవచ్చు. వరిపొలాలు సాధారణంగా గ్రామాల చుట్టుపక్కలేకదావుండేవి. ఆ విధంగా మీరా మొక్కలు పెంచే పొలాలు కనుక్కునే వీలు కూడా ఉంటుంది.

ఈ మధ్యాహ్నం మనభోజనాలు ప్యాలెస్‌హోటల్లో. మిస్ హేమాగారికి నేపాల్ భోజనపదార్థాల రుచి చూపించాలిగా. ఆట్నించే ఆ మేకప్ ఆర్టిస్టునికూడా కలుసుకోవచ్చు."

సారధి తలూపారు.

పన్నెండుగంటల ప్రాంతంలో నలుగురం ప్రభుదాస్

ఫియట్ కారెక్కి ప్యాలెస్ హోటల్ చేరుకున్నాం. ఆయన మమ్మల్ని టెరస్ మీదికి తీసికెళ్ళి భోజనాలకు ఆర్డరిచ్చారు.

ప్రతి దేశానికీ కొన్ని పాకశాస్త్ర సాంప్రదాయాలుంటాయి. నేపాల్ భోజనపదార్థాల్లో ఇటు భారత దేశం, అటు భూటాన్, చైనా పోలికలు కనిపించాయి. మొత్తానికి అన్నీ రుచికరమైనవే.

భోజనాలయ్యాక ప్రభుదాస్ సిగిరెట్ అంటించి, "ఈ ఆడవాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని యెక్కడెక్కడని తిరుగుతాం? ఆ మేకప్ ఆర్టిస్టునీ, ఫారెగ్జీ పాస్‌పోర్టులు తయారుజేసే వ్యక్తినీ మనం చూసొచ్చేవరకూ వీళ్ళు కింద రిసెప్షన్‌లో కాచుకుంటారు. అటువంటిచోట్లకి ఆడవాళ్ళని తీసికెళ్ళడం బావుండదుకూడా!" అన్నాడు.

సారథి తలూపారు.

బిల్లు చెల్లించాక, మమ్మల్ని రిసెప్షన్‌లో వదిలి మగవాళ్ళిద్దరూ కార్లో వెళ్ళిపోయారు. నేనూ, నమ్రతా సోఫాలో కూర్చుని కబుర్లలో పడ్డాం.

అంతలో, ఆమె వాంతి వస్తున్నట్టు అరచెయ్యి నోటి కడ్డం పెట్టుకుని వెక్కింది.

"ఏమైంది?" అడిగాను కంగారుగా.

అతి కష్టంమీద వస్తున్న వాంతిని ఆపుకుంటూ, నా దగ్గరికి వంగి, "వేవిళ్లు! ఇప్పుడేవస్తాను బాత్‌రూంకెళ్ళి" అని లేచి గబగబ బాత్‌రూం వెదుక్కుంటూ కేబిన్స్ వైపు వెళ్లింది.

నవ్వుకున్నాను. పెళ్లైన ఐదేళ్లకి నమ్రత కడుపులో ఓ నలుసు పడిందన్నమాట. మాతృత్వం స్త్రీ జీవితంలో ఓ చిత్రమైన మలుపు!

ఇంకా నా ఆలోచనలు తెగకముందే, ఓ పురుషకంఠం విని వులిక్కిపడ్డాను.

## 8

"ఈ విమాన ప్రయాణాలవల్ల నాకు వెంటనే జలుబు చేసుంది డోరీ!"

"ఐతే, వెళ్ళి గదిలో రెస్టు తీసుకో. ఆలోగా మేము బార్‌లో రెండు పెగ్గులు తాగొస్తాం!"

ఆ రెండో కంఠం ఎక్కడో విన్నట్టు తోచి, చటుక్కున తలెత్తి అటు చూశాను. అంతే! నా గుండె గుభిల్లుమంది!

ఆ రెండోవ్యక్తి యెవ్వరోకాదు. మొన్న వెస్టర్న్ బ్లూ నైట్‌క్లబ్‌లో సారధి చితక్కొట్టినతనే! వాళ్ళు నాకు అతి చేరువలో నిల్చునున్నారు.

జలుబు చేసిందన్న వ్యక్తి నీరసంగా నడుచుకుంటూ లిఫ్ట్‌వైపు వెళుతున్నాడు. మిగతా యిద్దరూ అక్కడే నిల్చునున్నారు.

ఈ కిరాతకులు ఇక్కడికెలా దాపురించారు? కొంపదీసి మమ్మల్ని వెంబడిస్తూ రాలేదు కదా? ఈ ఆలోచన రాగానే సోఫాలోంచి ఒక్క ఉదుటున లేచి, తలుపువైపు పరుగు తీశాను.

అప్పుడు పడింది. డోరీ దృష్టి నామీద.

"అరె! ఆ అమ్మాయే!!" పిడుగులా వినిపించింది అతని కంఠం నా చెవులకి.

శాలి సత్తువ కొద్దీ పరిగెత్తుతూ హోటల్లోంచి బైట పడ్డాను.

మరుక్షణం నా వెనక బూట్సుల శబ్దం వినిపించసాగింది. వెనుదిరిగి చూడకుండా పరిగెత్తుతూ మెయిన్ గేటుదాటి రోడ్డుమీదికి వచ్చాను.

సరిగ్గా అదే క్షణంలో, ప్రభుదాస్ కారు హోటల్ని సమీపిస్తూ కనిపించింది. అతనే నడుపుతున్నాడు కారు. బాక్ సీట్లో సారథి!

వాళ్ళని చూడగానే నా ప్రాణం లేచివచ్చింది.

నామీద దృష్టిపడ్డ మరుక్షణం ప్రభుదాస్ సడన్ బ్రేక్ వేశాడు.

"ఏం జరిగింది హేమా?" అడిగారు సారథి కంగారుగా.

"వెంటనే కారు పోనివ్వండి. ఆ నీచులు ఇక్కడికీ దాపురించారు." అన్నాను బాక్ డోర్ తెరిచి లోనికి దూరుతూ.

ప్రభుదాస్ వెంటనే కారు ముందుకు దూకించాడు.

దడదడంగాడే గుండెను అదుముకుంటూ వెనుదిరిగి చూశాను.

వాళ్ళిద్దరు ఓ టాక్సీ ఆపి ఎక్కుతున్నారు.

"వాళ్ళు మనల్ని టాక్సీలో వెంబడిస్తారు. ఇప్పుడేం చేద్దాం?" అడిగాడు ఖంగారుగా.

సారథి పలకలేదు. క్షణం ఆలోచించి, "ప్రభూ! నాకో పథకం స్ఫురిస్తోంది. కారు సిటీ పొలిమేరలు దాటించి, కొండ చరియలవైపు తీసికెళ్ళు. నేను చెప్పిన చోట స్పీడ్-స్లో చెయ్యి. నేను వాళ్ళు చూసేలా కార్లోంచి బైటికి దూకుతాను.

ఆ తరవాత మీరిద్దరూ మరో దారిన ఇంటికెళ్ళిపోండి. నేను వాళ్ళ కళ్ళల్లో కారంకొట్టివచ్చేస్తాను." అన్నారు.

ప్రభుదాస్ తలూపి, కారు స్పీడ్ హెచ్చించాడు.

నగరం వెలుపల దూరదూరంవరకూ ఎత్తైన రాతి కొండలు వ్యాపించి ఉన్నాయి. రోడ్డుకి చేరువలోనే ఓ కొండమీద శిథిలావస్థలో వున్న బౌద్ధ దేవాలయం

కనిపిస్తోంది.

ఎదురుగా రోడ్డు మలుపు తిరుగుతోంది. "ప్రభూ! కారు స్లో జెయ్." అన్నారు సారథి.

కారు వేగం తగ్గింది. అంతే! సారథి చటుక్కున డోర్ తెరిచి బైటికి దూకేశారు. దురదృష్ట వశాత్తూ ఆ ఊపుకు అనుకోకుండా నేనూ బైట పడిపోయాను.

ప్రభుదాస్ ఈ విషయం గమనించనట్టున్నాడు. కారు రివ్వున దూసుకుపోయింది.

ఆ టాక్సీ మాకు ఫర్లాంగుదూరంలో నేవుంది. కార్లోంచి నేనూ పడిపోడంతో సారథి నివ్వెరబోయారు. నా శరీరం అక్కడక్కడా గీరుకుపోయింది.

ఇహా గత్యంతరంలేదు, "హేమా! త్వరగారా!" అంటూ నా చెయ్యందుకుని, రోడ్డుపక్కనున్న రాళ్ళ వైపు పరుగు తీశారాయన.

పడుతూ లేస్తూ ఆయన్ని అనుసరించాను. బండల మాటున నక్కుతూ కొండమీద కనిపిస్తున్న బౌద్ధ దేవాలయం వైపు సాగుతున్నాం. పైకెళ్ళడానికి ఓ వైపు కొండ తొలిచి నిర్మించారు రాతి మెట్లు.

వడివడిగా ఆ మెట్లెక్కి పైకి జేరుకున్నాం. శిథిలావస్థలో వున్న ఆలయం అది. సూది పడితే వినిపించే నిశ్శబ్దం. సారథి ఓ స్తంభం చాటున నిల్చుని, కింద కనిపిస్తున్న రోడ్డు వైపు చూశారు.

వాళ్ళుగానీ, వాళ్ళ కారుగానీ ఎక్కడా కనిపించడం లేదు!

"కొంపదీసి, ప్రభుదాస్ కారును వెంబడిస్తూ వెళ్ళలేదు కదా?" అన్నాను అయోమయంగా.

"అదే జరిగుంటే మన శ్రమంతా వృధా అయినట్టే.

పద, ఆలయంలో కెళ్ళి చూద్దాం!'! అంటూ లోనికి నడిచారాయన!

లోపల ఎత్తైన రాతి దిమ్మెమీద పెద్ద సైజు బుద్ధ విగ్రహం వుంది. ధ్యాన ముద్రలో, గోడలమీద బుద్ధుడి జీవిత చరిత్ర చాటే అనేక బొమ్మలు చెక్కి వున్నాయి.

వాటిని చూసి, తిరిగి బైట మంటపంలోకి వచ్చాం. అంతే!

"ఢాం!" మన్న శబ్దంలో దిక్కులు పిక్కటిల్లాయి.

సారథి ఛెంగున ఓ స్తంభం చాటున తప్పుకున్నారు. దడదడలాడే గుండెతో, మెరుపులా వెనుదిరిగి ఆలయం లోకి దూరి, గుమ్మం పక్కన నక్కి చూడసాగాను.

అప్పటికే సారథి చేతిలోకి పిస్తోలు వచ్చేసింది.

వాళ్ళ ప్రభుదాస్ గారు వెంబడిస్తూ వెళ్ళలేదా? మా వెనకే గండు పిల్లుల్లా పైకి వచ్చారా?

ఆలయం ప్రాంగణంలో పెద్ద పెద్ద రాళ్ళున్నాయి. ఓ రాయి మాటున కనిపిస్తోంది మాడు నల్లని పిస్తోలు మొన. బహుశ, ఆ రాయి మాటునే నక్కి వుంటాడు శత్రువు!

ఆ విషయం సారథికూడా పసిగట్టినట్టున్నారు. నిలుచున్న వారల్లా మెల్లగా స్తంభం చాటున కూర్చుని, కొద్ది కొద్దిగా జరుగుతూ కాస్త ఎడంగా వున్న మరో స్తంభం వెనక్కి వెళ్ళారు. ఆయన పథకం ఏమిటో నాకర్థం కావడంలేదు.

చాలా సేపు నిశ్శబ్దం రాజ్యమేలింది పరిసరాలని.

సారథివైపునించి ఏ సమాధానమూ రాకపోవడంతో, బండ చాటున వున్న వ్యక్తి విసుగు చెందినట్టున్నాడు. ఆయన స్థితి ఏమిటో కనుక్కుందామని కొద్దిగా బండ

ఇవతలికి వచ్చాడు.

వెంటనే గుర్తించాను. అతను డోర్జి!

"ఢాం! ఢాం!!" పొగలు కక్కింది సారధి పిస్తోలు.

రెండో గుండు అతని కడుపులో దిగినట్టుంది. గావు కేక పెడుతూ అమాంతం నేల కూలాడు.

మళ్ళీ నిశ్శబ్దం!

"డోర్జి! క్షేమంగా వున్నావా?" ఎడం వైపునించి వినిపించింది ఓ కంఠం.

బహుశా, వాడతని అనుచరుడై వుంటాడు.

రెండు నిమిషాలైనా జవాబు రాకపోవడంతో, ఎడం వైపునించి సన్నగా బూట్సుల సవ్వడి వినిపించసాగింది. అడుగులో అడుగు వేసుకుంటూ దాగిన చోటునించి ఇవతలికి వచ్చాడు డోర్జి అనుచరుడు.

నేలమీద నిశ్చలంగా పడున్న డోర్జి శరీరాన్ని చూడగానే మెరుపులా వెనుదిరిగి వచ్చిన చోటికి పరుగుతీశాడు. అంతే!

మళ్ళీ రెండుసార్లు గర్జించింది సారధి పిస్తోలు.

గుళ్ళు అతని నడుంలో దిగినట్టున్నాయి. గాయపడ్డ జింకలా గావుకేక పెడుతూ ఎగిరి నేలకూలాడు.

నిశ్శబ్దం!

స్తంభం చాటునించి కదిలారు సారధి. నేను కుదుట పడ్డ గుండెతో బైటికొచ్చి ఆయన్ని అనుసరించాను.

ఆలయం ప్రాంగణంలో బోర్లాపడున్న డోర్జిని సమీపించి, అతను తొడుక్కున్న దుస్తులు వెదికారు సారధి. ఓ పర్సూ, తాళం చెవుల గుత్తి, పిస్తోలు గుళ్ళూ, కొన్ని కాగితాలూ బైటపడ్డాయి.

ఆ కాగితాల్లో ఓ ఉత్తరం కూడా వుంది. దేనికైనా మంచిదనుకున్నారో ఏమో, ఆ ఉత్తరాన్ని జాగ్రత్తగా చదివారు సారధి.

తరవాత దాన్ని నా కందించారు.

వుత్తరం టాంజూగ్ అనే ప్రదేశంనించి, థింఫూలో వున్న డోర్జీ పేర పోస్టు చెయ్యబడింది. వుత్తరం సంబోధననిబట్టి, అది టాంజూగ్‌లో నివసిస్తున్న డోర్జీ సోదరుడు డోర్జీకి రాసిన వుత్తరమని బోధపడింది.

పూర్తి వుత్తరంలో ఒకే ఒక విషయం న్నట్టుకుంది.

"......ఇక్కడ మన ఫారంలో పని చురుకుగా సాగుతోంది. బాస్ ఈ రోజే వచ్చారు. మా పని చూసి చాలా మెచ్చుకున్నారు......"

"ఉత్తరంలో ప్రస్తావించిన ఆ ఫారమ్ యేమిటో అర్థమైందా? బహుశా, వాళ్ళక్కడ ఆ మొక్కను పడించడానికి పెద్ద అగ్రికల్చరల్ ఫార్మ్ నెలకొల్పి ఉంటారు. టాంజూగ్ అనే ఆ ప్రదేశం థింఫూకు చేరువలోనే వుంది. ఈ ఉత్తరంవల్ల ఒకవిధంగా మన మార్గం సుగమమయింది.

రేపీపాటికి మనం నకిలీపాస్‌పోర్ట్‌లతో, మారు వేషాల్లో టూరిస్ట్‌బస్‌ద్వారా భూటాన్ సరిహద్దుల్లో ప్రవేశించాలి. ఆ బస్ టాంజూగ్ మీదుగా థింఫూ జేరితే మరీ మంచిది.

మనం టాంజూగ్‌లోనే దిగి, ఆ ఫార్మ్ గురించి ఆరా తియ్యొచ్చు. ఇక పద. రోడ్డుమీదికెళ్తే ఏ లారీయో ఐనా దొరకొచ్చు" అంటూ కొండ దిగే మెట్లవైపు నడిచారు సారధి.

# 9

మర్నాడు భూటాన్ వెళ్ళే టూరిస్ట్ బస్‌లో యెక్కాము.

మాకు వీడ్కోలు చెప్పడానికి ప్రభుదాస్ భార్య వచ్చింది. అతను రాలేదు. అడిగితే, అర్జంటు పనిమీద ఎక్కడికో వెళ్ళాడని చెప్పింది.

దాదాపు అరవైమంది ప్రయాణీకుల్ని మోసుకుంటూ ముందుకు సాగింది బస్సు.

ఆ రోజంతా ప్రయాణంలోనే గడిచిపోయింది.

మర్నాడు తెలతెలవారుతుండగా భూటాన్‌లో ప్రవేశించాం!

అదృష్టవశాత్తూ భూటాన్ రాజధానికి వెళ్ళే దార్లోనే తగిలింది మాకు టాంజుగ్ నగరం! సాయంత్రం నాలుగంటల ప్రాంతంలో మా బస్సు ఆ నగరంలోకి ప్రవేశించింది.

అది చాలా ప్రాచీనమైన నగరమనీ, చూడవలసిన కట్టడాలెన్నో వున్నాయనీ, ఆ రాత్రి అక్కడే బసచేసి, వుదయం వాటిని చూసి ప్రయాణమవ్వాలనీ చెప్పాడు టూరిస్టు గైడ్.

బస్సు ఓ లాడ్జింగ్ ముందాగింది.

టూరిస్టు కంపెనీ తరఫునించి, మా అందరికీ అక్కడ గదులు ఏర్పాటు చెయ్యబడ్డాయి.

కాలకృత్యాలూ, టిఫిన్ అయ్యాక, సారధిగారు నన్ను వెంటబెట్టుకుని, లాడ్జింగ్ మేనేజర్ దగ్గరికెళ్ళి కూర్చుని కబుర్లు ప్రారంభించారు.

కాసేపు ఆ ప్రాంతం విశేషాలూ, అవీ మాట్లాడాక, "బస్‌లో వస్తూ గమనించాను. మీ టాంజుగ్ చుట్టు

పక్కల భారీ వ్యవసాయక్షేత్రా లున్నట్టున్నాయి" అంటూ విషయం కదిపారు.

"ఔను. ఇక్కడి ప్రజలంతా దాదాపు వ్యవసాయం మీదే ఆధారపడి జీవిస్తారు. ఇక్కడి భూమి వరిపంటకు చాలా అనుకూలమైంది!" అన్నాడు మేనేజర్.

"ఐతే, ఇక్కడ పెద్దపెద్ద ఫారమ్స్ కూడా ఉండి ఉంటాయి!"

"ఔను."

"ఆ ఫారమ్స్ చాలా పాతవనుకుంటాను."

"ఒక్కటి తప్ప అన్నీ పాతవే!"

"ఆ కొత్త ఫారమ్ ఎప్పుడేర్పడింది?"

"సంవత్సరంకూడా కాలేదు. అది చాలా అధునాతనమైనది. దానిమధ్య పెద్ద భవనంకూడా కట్టారు. కొన్ని వందల ఎకరాల్లో వ్యాపించి వుంది ఫారమ్. దానిచుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ నిర్మించారు. అందులో కేవలం ధాన్యమే పండిస్తారుట!"

"ఐతే, తప్పకుండా దాన్నొకసారి చూడాలి. నిజానికి మా దేశంలో నాకూ పెద్ద వ్యవసాయక్షేత్రం వుంది. అందుకే వ్యవసాయంపట్ల నాకు ఆసక్తి ఎక్కువ. ఆ ఫారమ్ ఎక్కడుందో చెప్పగలరా?"

"ఇక్కణ్ణించి పది మైళ్ళదూరంలో వుంది. మీరు టాక్సీ తీసుకుని కొమింటాంగ్ గ్రామం వైపు వెళ్ళారంటే దార్లోనే వస్తుంది ఆ ఫారమ్."

మేనేజర్‌కు థాంక్స్ చెప్పి, నా చెయ్యందుకుని బైటికి నడిచారు సారధి. "మనకావలసిన ఫారమ్ అదే అయ్యుంటుంది. ఒకసారి వెళ్ళి చూడాలి. నాతో వస్తావా? ఇక్కడే వుంటావా?"

"గోళ్ళు గిల్లుకుంటూ నేనిక్కడ కూర్చోలేను. వస్తాను." అన్నాను, ఇద్దరం నగర వీధుల్లో పడి టాక్సీ కోసం గాలించాం. అదృష్ట వశాత్తూ కనిపించిందో టాక్సీ.

డ్రైవర్‌తో కొమింటాంగ్ గ్రామం వైపు తీసికెళ్ళమని చెప్పి, ఎక్కాం.

టాక్సీ బైలుదేరింది.

అప్పటికే పరిసరాలని చిరు చీకట్లు ముసురుకుంటున్నాయి.

నగరం వదిలి, ఓ నిర్మానుష్యమైన రోడ్డుమీద పరుగు తీస్తోంది టాక్సీ.

రోడ్డు కిరుపక్కలా పచ్చని పంట పొలాలున్నాయి.

అలా గంటసేపు ప్రయాణించాక, సుదూరంలో ఎత్తైన ఓ ప్రహరీ గోడ కనిపించింది మాకు. చాలా విశాలమైన ప్రదేశాన్ని ఆక్రమించి వుంది గోడ.

"డ్రైవర్! ఇక్కడ ఆపు!" అన్నారు సారధి.

టాక్సీ రోడ్డు పక్క ఆగింది.

సారధి నా చెయ్యి పట్టుకుని దిగారు. అప్పటికే బాగా చీకటి పడింది! డ్రైవర్ మీటర్ చూసి, బిల్లు చెప్పాడు. పర్సుతీసి బిల్లు చెల్లించారు సారధి. టాక్సీని వెనుదిరిగి వెళ్ళిపోయింది.

"ఆ ఫారమ్ అదే అయ్యుంటుంది. పద!" అంటూ అటు కదిలారాయన.

"అంత పెద్ద ప్రహరీగోడ వుండగా లోపలేముందో మనకెలా తెలుస్తుంది?" అడిగాను ఆయన్ని అనుసరిస్తూ.

"వీలైతే గోడ దూకాలి మరి! తప్పదు."

ఇద్దరం చకచక అడుగులు వేసుకుంటూ రోడ్డు దిగి,

ఆ ప్రహారీ వైపు నడవసాగాం. పావు గంటలో చేరు కున్నామక్కడికి, చుట్టూ మసక చీకటి, కీచురాళ్ళగోల!

సారథిగోడ ఎక్కడానికి ఆధారం మేదైనావుందేమో పరిశీలిస్తున్నారు. గోడలో అక్కడక్కడా గూళ్ళవంటి రంధ్రాలున్నాయి. అవి గోడ కట్టేటప్పుడు తాపీ వాళ్ళు నిలుచుని పనిజెయ్యడానికి నిర్మించే చెక్క దిమ్మల తాలూకవై వుంటాయి.

సారథి ఓ రంధ్రంలో కాలుపెట్టి, ఎగిరి పైన మరో రంధ్రం అందుకుని గోడ కత్తుకుపోయారు. చూస్తూనే ఆయన బల్లిలా గోడమీదకిచేరి, ఎక్కి కూర్చున్నారు. పైన గోడ విశాలంగా వుండివుంటుంది. అందుకే, ఆయన గోడమీద బోర్లా పడుకుని, నా వైపు చెయ్యిచాచారు.

ఆయన చెయ్యందుకుని, నేనూ అలాగే రంధ్రాలు ఎక్కుతూ నెమ్మదిగా గోడ పైకి చేరుకుని, ఆయన పక్కన కూర్చున్నాను.

లోపల ఎటు చూసినా వరినాట్లు కనిపిస్తున్నాయి. విశాలమైన ఆ వ్యవసాయ క్షేత్రం మధ్య మసక వెలుతుర్లో లీలగా ఓ భవనం కనిపిస్తోంది. మనుషులెవ్వరూ కాన రావటంలేదు!

సారథి దిగమన్నట్టు సైగజేసి మునుపటిలా రంధ్రాల్లో కాళ్ళుపెడుతూ సులువుగా దిగిపోయారు. నేను దిగడంలో కాస్త కష్టమయింది.

"ఇప్పుడు ఏం చేద్దామంటారు?" అడిగాను తగ్గు స్వరంలో.

"చీకటి మనకు సహాయకారిగా వుంది. ఆ భవనం లోపల ఏముందో, ఏం జరుగుతోందో వెళ్ళి చూడాలి," అన్నారాయన.

ఇద్దరం చీకట్లో చూసుకుంటూ రెండడుగులు ముందుకు వేశాం. మరుక్షణం ప్రహారీ నాలుగు వైపులా సెర్చిలైట్లు వెలిగాయి. భయంతో బిర్రబిగుసుకు పోయాను. ఆ కాంతిని నా కళ్లు భరించలేకపోతున్నాయి.

అప్పుడు కనిపించారు మనుషులు! చేతుల్లో స్టెన్ గన్స్ పట్టుకుని వస్తున్న నలుగురు మనుషులు!!

సారథి నా చెయ్యి నొక్కి భయపడకూడదని ధైర్యం చెప్పారు.

అప్పటికే ఆ నలుగురూ మమ్మల్ని సమీపించారు. అందులో పొడుగ్గా, దృఢంగా వున్నతను ముందుకువచ్చి, "ఎవరు మీరు? ఇక్కడేం జేస్తున్నారు?" అడిగాడు తీక్షణంగా.

సారథి కంఠం సర్దుకుని. "నా పేరు అబ్దుల్ అజీజ్. ఈమె నా భార్య జరీనా తాజ్! మేము పాకిస్తానీ యాత్రీకులం! నేపాల్ టూరిస్ట్ బస్‌లో భూటాన్ దర్శిం చడానికి వచ్చాం.

మా బస్సు ఈ మధ్యాహ్నమే టాంజాగ్ జేరింది. ఈ పరిసర ప్రాంతాలు చూసివద్దామని మేమిద్దరం విడిగా బైలుదేరాం. తిరిగిపోతూ దారి తప్పాం, ఈ రాత్రి ఇక్కడ తలదాచుకునే చోటు దొరుకుతుందేమోనని చూస్తే, ఈ ప్రహారీ గోడ కనిపించింది. ఈ వైపు గేటు లేనందువల్ల గోడ దూకి రావలసి వచ్చింది." అన్నాడు.

పకపక నవ్వాడతను. "నీ కల్లిబొల్లి కబుర్లు నమ్మ డానికి నేనేం పసివాణ్ణనుకున్నావా? మామూలు స్త్రీ పురుషు లెవ్వరూ ఇంత పెద్ద గోడను అవలీలగా దూకి రాలేరు. టాంజాగ్ ఇక్కణ్ణించి పది మైళ్ళుంది. ఇంత దూరం నడిచి వచ్చారా? నిజం చెప్పండి. ఎవ్వరు మీరు?"

అడిగాడతను కటువుగా.

"నిజమే చెప్పాను. నామాట నమ్మండి!"

"నిజం ఎలా రాబట్టాలో నాకు తెలుసు!" అంటూ తన వాళ్ళ వైపు చూసి,

"ఈ రాత్రి బాస్ రాబోతున్నారు. వీళ్ళని ఆయన ముందు ప్రవేశ పెడదాం! తీసికెళ్ళి ఆ చీకటి కొట్లో పడెయ్యండి." అన్నాడతను.

మిగతా ముగ్గురూ మమ్మల్ని తోసుకుంటూ ముందుకు సాగారు. తిరగబడటానికిగానీ, పారిపోడానికిగానీ బొత్తిగా అవకాశంలేదు. పైగా ఈ రాత్రి వాళ్ళ బాస్ రాబోతున్నాడుట. ఈ విధంగానైనా అతన్ని చూసే వీలుంటుంది మాకు.

వాళ్లు మమ్మల్ని భవనంలోకి తీసికెళ్ళి, ఓ గది ముందు నిలోబెట్టి, మా దుస్తుల్ని సోదా చెయ్యసాగారు. సారథి జేబులో పిస్తోలూ, గుళ్లూ బైటపడ్డాయి. వాటిని స్వాధీనం జేసుకున్నారు. గది తలుపుకు వేళాడుతున్న తాళం తెరిచి, మమ్మల్ని ఒక్క తోపుతో కారు లోనికి.

గదిలో కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి.

మరుక్షణం తలుపు మూసుకుంది.

"ఎవరు?" అన్న కంచు కంఠం గదిలో వినిపించి వులిక్కి పడ్డాను.

# 10

చీకట్లో ఓ మూలనించి వినిపించిందా కంఠం. అంటే, మాలాగే ఇంకెవ్వరో అక్కడ బంధించబడున్నారన్న మాట!

మరుక్షణం సారథి చేతిలో సిగిరెట్ లైటర్ వెలిగింది.

అదే క్షణం ఆ కంఠం వినిపించిన చోట అగ్గిపుల్ల వెలిగింది!

ఆ వెలుతుర్లో ఆ మూల ఒదిగి కూర్చున్న వ్యక్తిని చూడగానే దిగ్భ్రాంతితో నా బుర్ర గిరగిర తిరిగింది.

అతను ఎవ్వరో కాదు.

మా అన్నయ్య, గౌతమ్!

"అన్నయ్యా!" అంటూ పరుగు తీశానా వైపు.

"ప్రేమా! నా తల్లీ!!" అంటూ ఒక్క వుదుటున లేచి నిల్చున్నాను. అమాంతం అన్నయ్యని చుట్టేసి వెక్కి వెక్కి ఏడవ సాగాను.

ఆయన స్థితీ అలాగే వుంది.

పావు గంట తరవాత గానీ మా వుద్వేగం తగ్గలేదు.

అప్పుడడిగారు సారథి "గౌతమ్! నువ్వింకా బ్రతికే వున్నావా? ఐతే, నువ్విక్కడ హత్యజెయ్యబడ్డట్టు మాకు టెలిగ్రాం ఎందుకొచ్చింది?"

అన్నయ్య కళ్ళు తుడుచుకుని చెప్పసాగాడు, "మన డిపార్ట్‌మెంట్ పనిమీద నేనిక్కడకి వచ్చిన వారం రోజుల తరవాత తెలిసింది నాకీ ముఠా కార్యకలాపాల గురించి.

కాని, వీళ్ళస్థావరం ఎక్కడుందో అప్పుడు నాకు తెలీదు. నేనా ప్రయత్నాల్లో వుండగానే, వీళ్ళకు నా గురించి తెలిసిపోయింది. ఒక రోజు డ్రోరీ తన అనుచరులతో, నేను నివసించే అద్దె ఇంటికి వచ్చి, నన్ను బెదిరించి. ఇక్కడికి తీసుకొచ్చాడు.

నేను తెలుసుకున్న విషయాలు ఇంకెవరికి చెప్పానో, నేనెవర్నో, ఈ దేశానికెందుకొచ్చానో చెప్పమని

రోజూ చిత్రహింసలు పెట్టసాగారు. ఐనా నేను నోరు విప్పలేదు. అందుకే, ఇంతవరకూ ప్రాణాలతో వుండ గలిగాను. వీళ్ళ బాస్ ఎవరోకాని, ఇంతవరకు ఎదుట పడలేదు.

ఒక రోజు డోర్జ వచ్చి, నా ఒంటిమీది బట్టలన్నీ విడిపించి, వేరే బట్టలిచ్చి, వాటిని తీసికెళ్ళాడు. బహుశా, వాళ్ళ ప్రత్యర్థి నెవ్వరోన్నో చంపి, ఆ శవానికి బట్టలు తొడిగించి, గుర్తించకుండా మొహం చెక్కేసి, వీధిలో పడేసి వుంటారు.

ఆ బట్టల్లో వున్న నా ఐడెంటిఫికేషన్ కార్డూ, అవీ చూసి, అధికార్లు మరణించింది నేనే అనుకునుంటారు." అన్నాడు.

అంతలో, బైట తలుపు తాళం తెరుస్తున్న చప్పుడు వినిపించింది!

ముగ్గురం ఊపిరి బిగబట్టి చూడసాగాం!

తలుపు తెరుచుకుని, నలుగు రైదుగురు వచ్చారు గది లోకి. ఇప్పుడు వాళ్ళ చేతుల్లో గన్స్‌తోబాటు, టార్చి లైట్లు కూడా వున్నాయి.

"బాస్ వచ్చారు. ఆయనకు మిమ్మల్ని చూపించాలి. పదండి!" అన్నాడొకడు.

మారు మాటాడకుండా లేచి, వాళ్ళ ననుసరించాం!

నడవాదాటి, కొద్ది దూరం వెళ్ళాక ఓ గది ముందా గారు వాళ్ళు.

ఒకడు లోనికెళ్ళి, "బాస్! వాళ్ళను తీసుకొచ్చాం!" అన్నాడు.

"ప్రవేశ పెట్టండి!" వినిపించింది లోపల.

మమ్మల్ని లోనికి తీసికెళ్లారు. అంతే!

నెత్తిన పిడుగు పడ్డట్టు అదిరి పడ్డాను!!

మా ఎదురుగా, టేబిల్ ముందు కూర్చున్న వ్యక్తి ఎవ్వరో కాదు.

ప్రిన్స్ ప్రదీప్ కుమార్!! అన్నయ్యకు స్నేహితుడే.

"నువ్వా?" అన్నాను దిగ్భ్రాంతితో.

అతనూ మమ్మల్ని చూసి అదిరిపడ్డాడు.

"నీచుడా! ఈ ముఠా నాయకుడివి నువ్వన్నమాట. మానవ ప్రపంచాల్ని మరో మత్తుపదార్థానికి గురిచేసి, నీ స్వార్థానికి వినియోగించుకోవాలనే కిరాతకమైన ఆలోచన ఎలా వచ్చింది నీలో?" అన్నాడు అన్నయ్య వుద్రేకంతో.

పకపక నవ్వాడతను. "ఒకప్పుడు భారతదేశంలో మాకు స్వతంత్రరాజ్యం వుండేది. ఫ్రీడమ్ వచ్చాక, రాజరికాలన్నిటినీ రద్దు చేశారు. ఆనాటినించీ మాకు ముట్టజెబుతున్న రాజభరణాలు కూడా ఆ మధ్య అక్రమంగా రద్దు చెయ్యబడ్డాయి.

ఒకప్పుడు రాచరీవితో బ్రతికిన మేము ఆ ఠీవిని కాపాడుకోడానికి వున్న ఆస్తిపాస్తులు అమ్ముకుంటూ ఇంతవరకూ గడుపుకొచ్చాం! ఇప్పుడవన్నీ హరించుకుపోయాయి. ఏ ఆదాయమూ లేక ఇప్పుడెలా బ్రతకాలని సతమతమవుతున్న సమయంలో కాకతాళీయంగా నాకీ కొత్తపదార్థం గురించి తెలిసింది. ఈ దెబ్బతో ప్రపంచం యావత్తూ నా గుప్పిట్లో ఇమిడిపోతుంది!

ఈ రహస్యం తెలిసిన మిమ్మల్ని ఇక ప్రాణాలతో వుంచడం ప్రమాదం!" అంటూ తన అనుచరులవైపు చూశాడు.

అంతవరకూ మౌనంగావున్న సారధి చిన్నగా నవ్వి—"మిస్టర్ ప్రదీప్‌కుమార్! ఈ సమయంలో నువ్వూ, నీ అనుచరులూ ఎంతటి ప్రాణసంకట స్థితిలో వున్నారో తెలిస్తే నువ్వింత నింపాదిగా మాట్లాడేవాడివి కాదు." అన్నారు.

ప్రిన్స్ చటుక్కున ఆయనవైపు తిరిగి, "ఏమిటి నువ్వంటోంది?" అన్నాడు ముఖం చిట్లిస్తూ.

"ఇప్పుడు నీ స్థావరం చుట్టూ భూటాన్ సైన్యం మోహరించి వుంది. ఇక్కడ జరుగుతున్న సంభాషణంతా అవతలవాళ్ళు స్పష్టంగా వింటున్నారు."

"నీ పిచ్చిపిచ్చి మాటలు నమ్మడానికి నేనేం దద్దమ్మని కాను."

"ఐతే, ఇప్పుడే నమ్మిస్తాను చూడు...ప్రభుదాస్! కాస్త ప్రిన్స్‌గారికి నమ్మకం కలిగించు!" అన్నారు సారధి బిగ్గరగా.

అంతే! మరుక్షణం దూరాన పిడుగుపడ్డట్టు శబ్దమయింది! ఆ శబ్దానికి భవనంతోబాటు మేమూ అదిరి పోయాం!

ప్రదీప్‌కుమార్ చటుక్కున లేచి నిల్చుని, "ఏమిటా చప్పుడు?" అన్నాడు ఖంగారుగా.

సారధి నవ్వి—"బాంబు ప్రేలుడు! నా కోటుకున్న బటన్స్‌లో శక్తివంతమైన మైక్రోఫోన్స్ ఫిట్ చేసున్నాయి. వాటి రిసీవింగ్ సెట్లు బైటవున్న మిలిటరీ ఆఫీసర్ల దగ్గరున్నాయి. ఇక్కడజరుగుతున్న ప్రతి కదలికా వాళ్లు వింటున్నారు.

ఇప్పటికీ మించిపోయింది లేదు. మాకు లొంగిపో.

రక్తపాతం ఆగుతుంది! మొండికేశావో, చంపేస్తాను జాగ్రత్త!!" అన్నారు హెచ్చరిస్తూ.

"పరిస్థితి ఇంతవరకూ వచ్చాక రక్తపాతం జరక్కుండా ఊరుకుంటానా? మిమ్మల్ని ప్రాణాలతో వదలిపెట్టను." పళ్ళు పటపట కొరుకుతూ పిస్తోలుకోసం జేబులో చెయ్యి పెట్టాడు ప్రదీప్‌కుమార్.

సరిగ్గా అదే క్షణంలో భవనంలో కాల్పులు ప్రారంభ మయ్యాయి. కన్నుమూసి తెరిచేలోగా వచ్చేశారు గది లోకి, అరడజనుమంది సైనికులు!

ప్రదీప్‌కుమార్ చెయ్యి జేబులోనే వుండిపోయింది.

ఆ సైనికుల వెంట సారథి మిత్రుడు ప్రభుదాస్‌ని చూసి నా కళ్ళు పెద్దవయ్యాయి!

నిమిషాలమీద, ప్రదీప్‌కుమార్నీ, అతని పటాలాన్నీ లొంగదీసుకుని బైటికి లాక్కెళ్ళారు సైనికులు.

ప్రభుదాస్ చిరునవ్వుతో మమ్మల్ని సమీపించి, షేక్ హాండ్ ఇచ్చాడు.

"సారథిగారూ! నేపాల్‌లో వున్న ఈయన ఇక్కడి కెలా వచ్చారు? ఏమిటీ గారడీ?" అన్నాను ఆశ్చర్యంగా.

సారథి నవ్వి—"నీకు గుర్తుందా? మనం టూరిస్ట్ బస్‌లో బయలుదేరేటప్పుడు మనకు వీడ్కోలివ్వడానికి కేవలం యితని భార్య వచ్చింది. నిజానికి ప్రభుదాస్ మనతోపాటు మారువేషంలో అదే టూరిస్టు బస్సులో ఇక్కడికి వచ్చాడు.

నా కోటుకు బటన్స్ స్థానంలో మైక్రోఫోన్స్‌ను నేపాల్లోనే అరేంజ్ చేసుకొచ్చాను. వాటి రిసీవింగ్ సెట్లు ప్రభుదాస్ దగ్గరున్నాయి. మనం గోడమూకి లోప

లికి వచ్చాక, వీళ్ళు మనల్ని చుట్టుముట్టి అన్నమాటలు అక్కడ ట్రాన్స్‌మిటర్ ద్వారా ప్రభుదాస్ విన్నాడు.

మనం ప్రమాదంలో ఇరుక్కున్నామని గ్రహించి, వెంటనే అధికార్ల సహాయం కోరాడు. ఇప్పుడర్థమైందా?'' అన్నారు.

ఆ గొడవలన్నీ ఇప్పుడు నాకనవసరం!

మరణించాడనుకున్న నా అన్నయ్యా మళ్ళీ నాక్కని పించాడు.

అదే పదివేలు!

—: అయిపోయింది :—

సీరియల్

# అంగారక

శ్యాంబాబు




## (ద్వితీయ భాగము)

"పోలీసులకు తెలిసిందా?"

"ఏమో తెలియదు...అసలు చచ్చిపోయిందో బ్రతికుందో తెలియదు. ఆ కత్తిపోట్లకు ఎవరయినా చచ్చిపోతారు. ఇరుగుపొరుగువాళ్ళు తలుపులు బద్దలు కొడుతుంటే కిటికీలోనుండి దూకి తప్పించుకు వచ్చాను"— జయపాండ్యన్ బాధగా కళ్ళుమూసుకున్నాడు.

"ఏం చేద్దామనుకొంటున్నావ్?"

"ఏమో...ఇంకా తెలియదు. నిశ్చయించుకోలేదు. పోలీసులకు దొరికి శిక్ష అనుభవించడమా లేక పారిపోవడమా అని."

"ఇక్కడ నీకేం ఫర్వాలేదు. ఆ సూటు, బూటూ

విప్పేసి నాలాగా లుంగీ కట్టుకొని, తలకు గుడ్డ చుట్టు కుంటే ఈ చుట్టుప్రక్కల నిన్నెవరూ గుర్తించరు... తోటలోకి కూరగాయలు కోసుకెళ్ళేవాళ్ళు వచ్చినప్పుడు బయటకు రాకుండా వుంటేసరి.''

''ఎన్నో రోజులు అక్కరలేదు. రెండుమూడు రోజులు అంతే.''

''ఫరవాలేదన్నాగా, నువ్వు పడుకో'' అన్నాడు ముత్తు చాప, దుప్పటి తీసుకుని గుడిసె బయటకు పోతూ.

*　　　*　　　*

''లినీవాన్ అండ్ కో, షిప్ బిల్డర్స్ అండ్ డిజై నర్స్''—హాంకాంగ్ ఓడరేవు ప్రాంతంలోని ఓ పెద్ద భవనంముందు బోర్డది.

రిక్షాదిగి బోర్డువైపు పరీక్షగా చూశాడతను. రిక్షావాణ్ణి పంపేసి రిసెప్షన్ డెస్కు దగ్గరకు నడిచాడు.

''వాట్ కెన్ ఐ డు ఫర్ యు సర్'' రిసెప్షనిస్టు నవ్వుతూ పలకరించింది.

''యు ఆర్ లవ్‌లీ!'' అన్నాడు ఫెర్రిరా.

''ఓ...థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్. అయామ్ ఎట్ యువర్ సర్వీస్'' అందామె మళ్ళీ నవ్వుతూ.

''ఐ హావ్ ఏన్ అప్పాయింట్‌మెంట్ విత్ మిస్టర్ లినీవాన్.''

''మీ పేరు.''

''లుముంబా—విన్సెంట్ లుముంబా.''

''సెకండ్ ఫ్లోర్‌లోకి వెళ్ళండి...మిస్టర్ లినీవాన్ పి.ఎ. వుంటుంది ఎడమవైపు గదిలో...షీ విల్ అరేంజ్ ఎవిరిథింగ్''—

''థాంక్స్ ఎ లాట్'' చకచక మెట్లువైపు నడిచాడు

ఫెర్రిరా—

రెండవ ఫ్లోర్‌లో మెట్లకు ఎడమవైపు గదిలో లావు పాటి కళ్ళజోడు శాస్త్రీ కూర్చొని వుంది.

ఫెర్రిరా ఆ గదిలో అడుగుపెట్టేటప్పటికి ఆమె ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతోంది.

"ఎక్స్‌క్యూజ్ మి"—ఇంకా ఫెర్రిరా వాక్యం పూర్తి కాలేదు

"ప్లీజ్ గో ఇన్ మిస్టర్ లుముంబా"—అన్నది లావు పాటి శాస్త్రీ ఫోను పెట్టేసి.

బహుశా క్రిందనుండి రిసెప్షనిస్టు ఫోన్ చేసి వుంటుంది.

లిసీవాన్ అయిదడుగుల రెండంగుళాల ఎత్తు వుంటాడేమో. లిసీవాన్ షిప్ బిల్డర్స్ అండ్ డిజైనర్స్‌కు యజమాని అతను. ఆర్డరిచ్చిన పనిని సకాలంలో ఎంతో చాకచక్యంగా పూర్తిచేసి ఇవ్వగల సేర్పరి అని అతనికి సౌత్ ఈస్ట్ ఏసియా షిప్పింగ్ సర్కిల్స్‌లో మంచిపేరు వుంది. పరిచయాలు ముగిసిన మరుక్షణం బిజినెస్‌లోకి దిగారు ఇద్దరూ.

"ఏం కావాలి మీకు, ట్రాలర్స్, ఫిషింగ్ వెసెల్స్, ప్లెజర్ బోట్స్, హైపవర్ మోటార్ బోట్స్, క్రూజియర్స్ - ఏవైనాసరే మా రెడిమేడ్ స్టాల్ నుండి తీసుకోవచ్చు మీరు" అన్నాడు లీసీవాన్.

"నో, నో. ఐ హావ్ సర్టెన్ స్పెసిఫికేషన్స్ ఇన్ మై మైండ్"—అన్నాడు ఫెర్రిరా సిగరెట్ వెలిగిస్తూ.

"చెప్పండి మిస్టర్ లుముంబా. వుయార్ ఎట్ యువర్ సర్వీస్" అన్నాడు లీసీవాన్ నవ్వుతూ.

"ఫార్టీ ఇన్‌టూ ట్వెన్‌టీ హైసీస్ పవర్ బోటు, బీచ్ లాండింగ్ టైప్ కావాలి"—

లినీవాన్ సాలోచనగా చూశాడు. ఫెర్రీరా వైపు. "మిస్టర్ లుముంబా బీచ్ లాండింగ్ టైప్ బోట్స్ అవుటాఫ్ మాన్ ఫాక్చరింగ్ అని మీకు తెలిసే వుంటుంది. అలాంటి క్రొత్త బోటు నిర్మించడం సాధ్యపడదనుకొంటాను. మీకంతగా కావాలంటే ఎక్కువలోతు లేని నీళ్ళల్లో వెళ్ళే 'క్రౌడన్ సీల్' టైపు క్రూజియర్ తీసుకోండి"—

"సారీ! ఇటీజ్ నాట్ ఎనఫ్. ఐ వాన్ట్ ఎ బీచ్ లాండర్. సెకండ్ హాండ్ దయినా ఫర్వాలేదు."

లినీవాన్ రెండు నిముషాలసేపు దీర్ఘంగా ఆలోచించాడు. "ఓకే. వుయ్ విల్ సీ... సెకండ్ వరల్డ్ వార్ ఎక్సస్ స్టాక్ లోవి కొన్ని ఇంకా ఈ ప్రాంతాల్లోనే తిరుగుతున్నాయి. ఐ విల్ ట్రేసవుట్ వన్ ఫర్ యూ"—అన్నాడు చివరికి.

మనసులోనే నవ్వుకొన్నాడు ఫెర్రిరా. లినీవాన్ సొంత షిప్ యార్డ్ లోనే అలాంటి సీ వెసెల్ ఒకటుందని అతనికి తెలుసు. ప్రత్యేకంగా లినీవాన్ నే ఎన్నుకోవడంలో ఆంతర్యం అదే. అయినా తనకు తెలిసిన విషయాన్ని బయటపెట్టలేదు ఫెర్రిరా.

"బోట్ కు మినిమమ్ 18 వాట్స్ పవర్ వుండే రోడాల్ఫ డీసిల్ టర్బైన్ ఇంజన్స్ కావాలి. చిన్న డైవర్స్ కాబిన్ స్లీపింగ్ బంక్ తో సహా. వెసెల్ కు మధ్యలో 20 × 18 కొలతల్లో పెద్ద సెలూన్ కావాలి. ఎత్తు పదడుగులు వుండాలి. లోపల ఫర్నిషింగ్ అక్కర లేదు. పై టాప్ మాత్రం రిమూవబుల్ టైప్ కావాలి. అంటే డెక్ వించ్ ఆపరేట్ చేసి అవసరమైనప్పుడు తీసివేసి, కావాలంటే తిరిగి వేసుకొనే పద్ధతిలో కావాలి."

లిసీవాన్ గుడ్లప్పగించి చూడసాగాడు ఫెర్రిరావైపు.

"వెసెల్ హార్టింగ్స్‌లో రెండువైపులా త్రీ ప్లస్ త్రీ ఆరువందల గాలన్లు పెట్రోల్ టాంకులు వుండాలి. అది గాక ఆన్‌బోర్డ్ నాలుగువందల గాలన్లు రిజర్వ్ టాంకు ఒకటి రడ్డర్ వుండే వైపు ఏర్పాటు చెయ్యాలి. తరువాత నౌక రిజిస్ట్రేషన్ కెనడియన్ ఆరిజిన్‌తో కావాలి" అన్నాడు ఫెర్రిరా గుక్కతిప్పుకోకుండా.

లిసీవాన్ ఎదురుప్రశ్న వెయ్యకుండా ఫెర్రిరా చెప్పేవి చకచకా పాడ్ మీద వ్రాసుకొంటున్నాడు. వ్రాయడం ఆపి ఏదో అనబోయాడు.

"వన్ మోర్ థింగ్! ఈ ఏర్పాట్లన్నిటితో నెలరోజులలో నాకు నౌకను డెలివరీ ఇవ్వాలి."

"ఇంపాజిబుల్" అరిచాడు లిసీవాన్ కీచుగా—"అసలు మీకు కావలసిన టైప్ నౌక దొరకనేలేదు. దొరికింతరువాత దాన్ని పూర్తిగా షేప్‌లు మార్చేసి మీ స్పెసిఫికేషన్స్‌కు తగినట్లు చెయ్యాలి అంటే నెలరోజుల వ్యవధి ఇంపాజిబుల్."

ఫెర్రిరా అతని మాటల్ని వినిపించుకోనట్లు చెప్పుకుపోసాగాడు. "నా! ది ప్రైస్! ఈ వెసెల్ నేను చెప్పిన స్పెసిఫికేషన్స్‌తో నెలలో డెలివరీ ఇవ్వడానికి ఎంతవుతుంది."

"హూ కేన్ ఐ టెల్! బీచ్‌లాండింగ్ టైపు సీక్రాఫ్ట్ ఇప్పుడసలు దొరకడమేలేదు. దొరికినా దాని ఓనర్ ఎంత ఖరీదు చెపుతాడో ఏమో. అతనా ఓడను అమ్మదలచుకోకపోతే ఎక్కువధర ఆఫర్ చేసి అతన్ని ప్రలోభపెట్టాలి" చెప్పుకుపోనిస్తే గంటల తరబడి కామాలు, ఫుల్‌స్టాపులు లేకుండా మాట్లాడుతాడు లిసీవాన్.

"దట్స్ నాన్ సెన్స్! నీ షిప్ యార్డులో ఉపయోగం లేక తుప్పట్టి పోతున్న బీచ్ లాండర్ ను నాకు అంటగట్ట డానికి ఇంతకన్న మంచిఛాన్స్ లేదు నీకు. ఇంకా ఎందుకీ ముసుగులో గుద్దులాట. ధర చెప్పేస్తే త్వరగా బేరం సెటిల్ చేసేసుకుందాం" అన్నాడు ఫెర్రిరా లినీవాన్ వంక సూటిగా చూస్తూ.

ఫెర్రిరాను అమాంతం మింగాలన్నంత కోపంగా చూశాడు లినీవాన్. తరువాత చటుక్కున తలదించుకుని పెన్సిలుతో పాడ్ మీద ఏవో కూడికలు, తీసివేతలు చేశాడు. నవ్వుతూ ఫెర్రిరా వైపు చూశాడు చివరికి.

"మొత్తం నలభైవేల అమెరికన్ డాలర్లవుతుంది... మరో నెలరోజుల వ్యవధి ఇచ్చివుంటే ముప్పైవేలకేచేసి వుండేవాణ్ని. కాని నెలరోజులంటే డే అండ్ నైట్ పని చెయ్యాలి నా మనుషులు. వాళ్ళకు ఓవర్ టైమ్లు అన్ని కలుపుకొని..."

"కట్ ది క్యాష్ మాన్! ముప్పైవేలకు పైసా ఎక్కు విక్వను. అప్పటికీ పదివేలు పైచిలుకు లాభం మిగులు తుంది నీకు" అన్నాడు ఫెర్రిరా.

చివరకు ముప్పైరెండువేల డాలర్లకు ఒప్పందం జరి గింది.

ఫెర్రిరా లేచి వెళ్ళడానికి నిలబడ్డాడు.

"అన్నట్లు మిస్టర్ లుముంబా! మా ఓడకు పేరేం పెట్టమంటారు?" అన్నాడు లినీవాన్ తనుకూడా లేచి నిలబడుతూ.

"అదికూడా నేనే చెప్పాలా. 'పాడ్రో ఆఫ్ లుముంబా' అదే దానికి సరియైన పేరు" అన్నాడు ఫెర్రిరా అలియాస్ విన్సెంట్ లుముంబా బయటికి నడుస్తూ.

లిసీవాన్ గబగబ పేడ్ మీద పేరు వ్రాసుకోవడంలో మునిగిపోయాడు.

* * *

ఉదయం పదిగంటలవుతుంది.

పాకెట్‌లో చివరిసిగరెట్ వెలిగించి ఆలోచనల్లో మునిగిపోయాడు జయపాండ్యన్. ముత్తు బజారుకు వెళ్లాడు. అతను వచ్చేవరకూ ఇదే ఆఖరి సిగరెట్.

ప్రస్తుతం పాండ్యన్ కళ్ళ ముందు కదులుతోన్న దృశ్యాలు రెండే. పారిపోవడమా? చట్టానికి దొరికిపోవడమా?

ఇక్కడనుండి పోలీసులకు దొరక్కుండా పారిపోతే, పోలీసులవలలో చిక్కుకోకుండా బయట పడగలిగితే, జీవితాంతం మరోపేరుతో, మరోరాష్ట్రంలో, మారుమూలలో బ్రతకాలి. స్వయం శక్తిమీద ఆధారపడి బ్రతగ్గలననే ధైర్యంవుంది పాండ్యన్‌కు.

అలాకాక పోలీసులకు లొంగిపోయి నేరాన్ని ఒప్పుకుంటే ఏ ఏడేళ్ళో, పదేళ్ళో శిక్ష విధించవచ్చు. తను ఎక్స్‌మిలిటరీ కాబట్టి, పరిస్థితులనుబట్టి బహుశా శిక్ష తక్కువ పడవచ్చు. కాని, ఆ ఏడేళ్ళో, పదేళ్ళో తరువాత ఏమిటి? తనకిప్పుడు ముప్పయి అయిదేళ్ళు. జైలు శిక్ష పూర్తయి బయట పడేప్పటికి జీవితంలో ముప్పాతిక వంతు అయిపోతుంది. ఆర్మీలో ఉన్నంతకాలం తను అనుభవించింది ఏమీ లేదు. జైలుకు వెళితే జీవితమంటే ఏమిటో తెలుసుకునే అవకాశమే ఇక తనకు మిగలదు. అసలిలా జరగటానికి కారణం ఏమిటి? ఎందుకిలా జరిగింది?

సుమిత్ర!!! యస్! సుమిత్ర వలననే యిలా జరిగింది. సుమిత్రే గనుక అలా నమ్మకద్రోహం చేయకుండావుంటే

అంత నీచంగా ప్రవర్తించకుండా వున్నట్లయితే? సుమిత్ర గుర్తుకు రాగానే మళ్ళీ గుండెల మూలల్లోంచి కోపం తన్నుకు రాసాగింది పాండ్యన్ కు.

తను సుమిత్రను చంపడంలో అన్యాయం ఏమీ లేదు. అలాంటి నయవంచకి అంత త్వరగా, ఎక్కువ బాధ లేకుండా చనిపోవడమే అన్యాయం అసలు.

టపటప మోటారు సైకిలు శబ్దం వినిపించింది జయ పాండ్యన్ కి.

చెవులు రిక్కించి విన్నాడు.

సందేహంలేదు! మోటారుసైకిలే. జాగ్రత్తగా తడిక తెరచి గేటువైపు చూశాడు. గుండె ఆగినంత పనయింది పాండ్యన్ కు.

పోలీస్ ఇన్ స్పెక్టర్ తోట గేటుముందు మోటారు సైకిలు దిగుతూ కనిపించాడు. క్షణంసేపు మెదడు మొద్దుబారింది పాండ్యన్ కు. ఎలా తెలిసింది తను యిక్కడ వున్నట్లు? తడికసందులోనుండి కళ్ళప్పగించి అలానే చూడసాగాడు.

పోలీస్ ఇన్ స్పెక్టర్ గేటు తెరచుకొని ఇంటివైపే వస్తున్నాడు. పాండ్యన్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. మిత్రద్రోహి. ఆ ముత్తుగాడే వెళ్ళి పోలీసులకు చెప్పివుండాలి. కంగారుగా గుడిసంతా కలయజూశాడు. మొక్కలకు పాదులు తియ్యడానికి ఉపయోగించే ఇనుపగునపం కనిపించింది ఓమూల.

చటుక్కున దాన్ని అందుకొని తడిక తలుపుచాటున నక్కాడు.

గుడిసెవైపే వస్తున్నట్లు ఇన్ స్పెక్టర్ బూట్ల శబ్దం స్పష్టంగా వినిపిస్తోంది.

ఊపిరి బిగబట్టి ఆ శబ్దాన్నే వింటున్నాడు పాండ్యన్. ఇనుపగునపం చుట్టూ అతని చేతులు బిగుసుకున్నాయి.

దూరంగా జాగిలాలు మొరుగుతున్న శబ్దంవినిపించింది.

"ముత్తూ! ముత్తూ!" పిలుస్తున్నాడు పోలీసు యిన్‌స్పెక్టర్.

ఊపిరి పీల్చకుండా బొమ్మలా నిలబడ్డాడు పాండ్యన్.

మళ్ళీ పిలిచాడు ఇన్‌స్పెక్టర్. పాండ్యన్ బిగుసుకుపోయి నిలబడి వున్నాడు.

ఈసారి జాగిలాల అరుపులు దగ్గరగా వినిపించాయి. పోలీసు ఇన్‌స్పెక్టర్ వెనక్కి తిరిగి వెళ్ళిపోతున్నట్లు బూట్ల శబ్దం.

హమ్మయ్యా! గట్టిగా ఊపిరిపీల్చి వదిలాడు పాండ్యన్. అదే అతను చేసిన పొరబాటు. అప్పటివరకూ బొమ్మలా వున్న మనిషి ఒక్కసారి ఊపిరిపీల్చి కండరాలన్నీ వదులు చేసేప్పటికి అతని చేతిలోని పలుగు జారి నేలమీద పడి ఖంగ్‌న శబ్దమయింది.

వెనక్కి తిరిగి వెళ్ళిపోతున్న ఇన్‌స్పెక్టర్ తిరిగి వెనక్కి గుడిసెవైపుకు రాసాగాడు.

"ముత్తూ!" మళ్ళీ పిలిచాడు.

పాండ్యన్ చటుక్కున వంగి పలుగు చేతిలోకి తీసుకున్నాడు.

"లోపలున్నదెవరు?" ఇన్‌స్పెక్టర్ అరిచాడు.

పాండ్యన్ తడికె చాటునుంచి కదల్లేదు. పలుగును గదలా పట్టుకుని నిలబడ్డాడు.

ఈసరికి ఇన్‌స్పెక్టర్ మనసులో కావలసినంత అనుమానం బయలుదేరింది.

"ఇంట్లో ఎవరంటే పలకరేం?" కోపంగా అరిచాడు

ఇన్‌స్పెక్టర్ గుడిసె దగ్గరికంటూ వచ్చి.

పాండ్యన్ కదల్లేదు...అలాగే తలుపు చాటున సిద్ధంగా నిలబడ్డాడు.

ఇన్‌స్పెక్టర్ కోపంగా తడికను బూటుకాలితో ఓ తన్ను తన్ని ఇంట్లో ప్రవేశించాడు.

సంవత్సరన్నర పోలీస్ శిక్షణ మరచిపోయినందుకు ఇన్‌స్పెక్టర్ ప్రతిఫలం తీసుకున్నాడు.

పాండ్యన్ చేతిలోని పలుగు బలంగా ఇన్‌స్పెక్టర్ తలమీద పడింది.

సున్నితమైన తల ఎముకలు టపటపమన్న ధ్వని స్పష్టంగా వినిపించింది.

కుప్పలా కూలిపోయాడు ఇన్‌స్పెక్టర్. మరుక్షణం అతని తలచుట్టూ రక్తం మడుగుకట్టసాగింది.

ఇరవై నాలుగ్గంటలలో యిది తను చేసిన రెండవ హత్య!!!

జయపాండ్యన్‌కు నిముషంపాటు కాళ్ళు చేతులు ఆడ లేదు.

పాండ్యన్ కొట్టిన ఒకే ఒక దెబ్బకు ఇన్‌స్పెక్టర్ తల పుచ్చకాయలా బ్రద్దలయింది. మరుక్షణం ప్రాణంపోయి వుండాలి. పాకలో బోర్లాపడి వున్నాడు. తల వెనుక వైపునుండి రక్తం విశేషంగా కారి నేలలో యింకు తోంది.

జరిగిన సంఘటన షాక్‌నుండి తేరుకోగానే పాండ్యన్ మెదడు కంప్యూటర్లా పని చేయసాగింది. గుడిసె తలుపు దగ్గరగా లాగి తోట గేటు దగ్గరికి రేసు గుర్రంలా పరి గెత్తాడు.

ఇన్‌స్పెక్టర్ మోటార్‌సైకిల్ ఇంకా అక్కడే

వుంది. ఎవరైనా చూస్తే తప్పనిసరిగా కుతూహలం చూపెడతారు. పైగా యీ చావు తర్వాత ఇక పోలీసులకు వెళ్ళి లొంగిపోవడమనేది అవుటాఫ్ క్వశ్చన్. ఎవరికీ దొరకని మారుమూలకు పారిపోవడంకన్నా గత్యంతరం లేదు. వీలయితే ఈ మోటారుసైకిలును వుపయోగించుకోవచ్చు.

తాళం మోటార్ సైకిల్ కే వుండడంవలన కొంత శ్రమ తప్పింది. తాళం తీసి, ఇంజన్ స్టార్టు చేయకుండా అలాగే తోసుకొంటూ గుడిసె వెనకవైపుకు నడిపించుకు వెళ్ళాడు.

గుడిసె వెనక దట్టంగా పెరిగిన బటానీ తీగెలున్నాయి. మోటారుసైకిల్ని కింద పడుకోబెట్టి దానిమీద ఆ తీగెల్ని కప్పాడు. ఎన్ ఫీల్డ్ మోటార్ సైకిల్ అది. ఎన్ని తీగెలు కప్పినా ఏదో ఒక ప్రదేశం లోనుండి ఏదో ఒక భాగం మెరుస్తూ బయటికి కనిపిస్తూనే వుంది.

రక్తం వాసనకు జాగిలాలు రెండూ గుర్రుమంటూ గుడిసె తలుపుదగ్గరే తారట్లాడుతున్నాయి.

ఇన్ స్పెక్టర్ శవాన్ని పెద్ద కంబళిమీదకు లాగి, కంబళి మూటలా కట్టాడు.

గదిమధ్యలో రక్తంకారి నేలమీద గడ్డకట్టి కనిపిస్తోంది. అప్పుడే ఈగలు ఆ రక్తం మడుగుచుట్టూ మూగ సాగాయి. చటుక్కున ఏదో గుర్తొచ్చినట్లు ఇన్ స్పెక్టర్ శవందగ్గిరికి వెళ్ళాడు పాండ్యన్.

శవం జేబులోనుండి పర్సు, నడుముకున్న బెల్టులో నుండి పిస్తోలు తీసుకొన్నాడు. మాగజైన్ తెరిచి చూశాడు బ్రోచ్ లో వున్నదాంతో సహా ఎనిమిది బుల్లెట్లు వున్నాయి.

వెరీగుడ్ అనుకొన్నాడు మనసులో. ఎనిమిదిమంది చచ్చిం తరువాత గాని నన్నెవరూ పట్టుకోలేరు అనుకొన్నాడు.

మంచంమీద కూలబడి ముత్తుకోసం వెయిట్ చెయ్యసాగాడు.

## 4

"నేషనల్ ఎయిరోనాటిక్ రిసెర్చ్ సెంటర్" నల్లని బోర్డ్ మీద తెల్లని అక్షరాలు పెయింట్ చేయబడి వున్నాయి.

క్లెప్టెన్ విన్నర్ పెద్ద ఇనుప గేట్లముందు కారాపి రెండు సార్లు హారన్ ప్రయోగించాడు.

గేటు అవతలివైపునుండి సెంట్రీకారువైపు చూశాడు. పెద్ద గేటులోకి అమర్చబడిన మరో చిన్న గేటు తెరుచుకొని బయటికి వచ్చాడు.

డ్రైవర్స్ సీటువైపుకు వెళ్ళి "ఐడెంటిటీ ప్లీజ్" అన్నాడు.

ఇప్పటికి దాదాపు సంవత్సరన్నరనుండి అతను రోజూ క్లెప్టెన్ విన్నర్‌ను లోపలకు పోనిస్తున్నాడు. అయినా, ప్రొసీజర్ ప్రొసీజరే! దేశరక్షణకు వుపయోగించే యుద్ధ విమానాలను తయారుచేయడంలో ఎంతో రహస్యమైన పరిశోధనలు చేస్తున్న ప్రభుత్వ లాబొరేటరీ అది. అంచేత కేంప్ కమాండెంట్ నయినా సరే ఐడెంటిటీ చెక్ చెయ్యందే లోపలికి పోనివ్వరు.

"కోడ్ ఎ. ఆర్. పి. జీరో...జీరో...ట్వెంటీఫోర్" అన్నాడు క్లెప్టెన్ విన్నర్ యూనిఫారం కుడివైపు జేబులోనుండి ఐడెంటిటీ కార్డు తీస్తూ...

సెంట్రీ తన ఐడెంటిటీ చెక్ చేస్తున్నంతవూ గేటు

ప్రక్కనే వున్న టవర్ పైనుండి మరో ఇద్దరు సెంట్రీలు మిషన్‌గన్స్ గురిచేసి తమనే గమనిస్తూవుంటారని తెలుసు విన్నర్‌కు.

సెంట్రీ తలాడించి కెప్టెన్ విన్నర్ అందించిన కార్డ్ తీసుకొన్నాడు. తిరిగి గేటుదాటి లోపలకు వెళ్ళాడు. కెప్టెన్ విన్నర్ సిగరెట్ వెలిగించి సన్నగా పొగ పీల్చి వదుల్తూ కూర్చున్నాడు.

లోపలకు వెళ్ళిన సెంట్రీ కెప్టెన్ విన్నర్ ఇచ్చిన ఐడెంటిటీ కార్డును కంప్యూటర్లా వున్న చిన్న యంత్రం దగ్గరికి తీసుకెళ్ళాడు. ఐడెంటిటీకార్డు అల్యూమినియంతో చేయబడ్డ చిన్న లోహపుముక్క. దాన్ని కంప్యూటర్ స్లాట్‌లో వెయ్యగానే గిర్రున శబ్దం చేస్తూ ఒక అర నిముషంపాటు యంత్రాలు తిరిగాయి. తర్వాత కంప్యూటర్‌కు దిగువనున్న స్లాట్‌లో నుండి కార్డు బయటికి వచ్చింది...ఇండికేటర్ బల్బు పచ్చగా వెలిగింది...

"ఓకె ... ఓపెన్ ది గేట్స్—" అరిచాడు సెంట్రీ.

ఇనప తలుపులు రెండూ రిమోట్ కంట్రోల్‌తో పని చేస్తాయి.

గేట్లు తెరుచుకోవడం చూసి కారు స్టార్టు చేసి ముందుకు పోనిచ్చాడు కెప్టెన్ విన్నర్.

"గుడ్ మార్నింగ్ కెప్టెన్! గుడ్ డే టు యూ!" అన్నాడు సెంట్రీ ఐడెంటిటీ కార్డు తిరిగి యిచ్చి వేస్తూ...

"గుడ్ మార్నింగ్ బోయ్...కీప్ వాచింగ్" అన్నాడు విన్నర్ ఆక్సిలేటర్‌పై కాలుపెట్టి కారు ముందుకు వురికిస్తూ.

పది హేనువందల ఎకరాలమధ్య నిర్మించబడి డిఫెన్స్ రిసెర్చిసెంటర్ అది.

రిసెర్చి సెంటర్ చుట్టూ ఎంతో జాగ్రత్తగా, లోపలికి యెవరూ రావడానికి వీలులేకుండా ఎలక్ట్రానిక్ ఫెన్స్ వేశారు. ఫెన్స్ ప్రక్కనే వాసన పసికట్టే అల్సేషియన్స్‌తో ఎప్పుడూ సాయుధులైన సెంట్రీస్ కాపలా తిరుగుతుంటారు. ఫెన్స్‌కు లోపల పదిగజాల దూరంలో చుట్టూతా దట్టమైన చెట్లు పెంచారు. దట్టంగా, ఎత్తుగా పెరిగినచెట్లు అడ్డుండడంవలన లోపల మధ్యలో ఏముందో చూడగలగడం చాలా కష్టం.

మొదటిగేటుకు ఫర్లాంగుదూరంలో రెండవ ఫెన్సింగ్ వుంటుంది. రెండవ ఫెన్సింగ్ దగ్గర కారుదిగి గేటుదగ్గరకు నడిచాడు కెప్టెన్ విన్నర్.

గేటుకు రెండువైపులా ఎత్తుగా సెంట్రీ టవర్స్ వున్నాయి. వాటిపైనుండి రాత్రింబవళ్ళు సెంట్రీలు స్టెన్ గన్స్‌తో కాపలా కాస్తూంటారు. గేటుకు ఓ ప్రక్కన టెలిఫోన్ రిసీవర్‌లాంటి పరికరం తగిలించబడి వుంది.

రిసీవర్ హుక్ మీదినుంచి తీసి గొంతు సవరించుకొన్నాడు.

"కెప్టెన్ విన్నర్. ఎ. ఆర్. పి. జీరో...జీరో... ట్వంటీఫోర్...రిపోర్టింగ్ టు టెస్ట్ డ్యూటీ ఆన్ ఫస్ట్ షిఫ్టు. గ్రాంట్ క్లియరెన్స్."

నిజానికి కెప్టెన్ విన్నర్ ఎవరితోనూ మాట్లాడంలేదు. ఆ రిసీవర్ వైర్స్ లోపలెక్కడో ఒక ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌కు బిగించబడి వున్నాయి. ఆ కంప్యూటర్లో ఆ రిసర్చి సెంటర్లో పనిచేసే గొంతులన్నీ రికార్డయి వుంటాయి. లోపలకు వెళ్ళదలచిన వ్యక్తి రిసీవర్‌లో మాట్లాడగానే

కంప్యూటర్ మెమరీబాంక్‌లోని వాయిస్ టేప్‌తో మాట్లాడిన వ్యక్తి గొంతును పోల్చి చూస్తుంది. రెండు కంఠస్వరాలూ సరిపోతే గేట్లు ఆటోమేటిక్‌గా తెరుచుకొంటాయి.

గేట్లు తెరుచుకొన్నాయి. కెప్టెన్ విన్నర్ కారును తిన్నగా లోపలికి పోనిచ్చి పైలట్స్ చేంజ్ రూమ్స్ ముందు ఆపాడు. గబగబ లోపలికి వెళ్ళి తను వేసుకొన్న మామూలు దుస్తులు విప్పేసి ఫ్లయింగ్ సూట్ తొడుక్కొన్నాడు. హెల్మెట్ సరిచేసుకొని బ్రీఫింగ్ రూమ్ లోకి దారి తీశాడు.

అప్పటికే బ్రీఫింగ్ రూమ్‌లో మరో ముగ్గురు పైలట్లు సిద్ధంగా వున్నారు. కాంప్ కమండెంటు, మరో ఫుల్ సూట్‌లో వున్న వ్యక్తి బల్లమీద ఏవో డ్రాయింగ్స్ చూస్తూ చర్చించుకొంటున్నారు.

కెప్టెన్ విన్నర్ లోపలకు రాగానే కేంప్ కమాండెంట్ తలెత్తి చూసి చిన్నగా నవ్వాడు.

"ఓ...క...లాడ్స్ నా లెటజ్ గెటాన్ విత్ ది ప్రోగ్రామ్స్! మాడిఫై చేసిన డిజైనుతో ఈ రోజు మీరు మన సూపర్ సీక్రెట్ ప్లేన్‌ని టెస్ట్ చెక్ కు తీసుకెళ్ళాలి. డిటెయిల్స్ మీకు డాక్టర్...రామన్న చెపుతారు" అన్నాడు కమాండెంట్.

అందరి కళ్ళు డాక్టర్ రామన్నవైపు తిరిగాయి.

* * *

రాత్రి పదకొండయింది...

ఈరోడ్—మద్రాస్ హైవే దాదాపు ఖాళీగావుంది. రోడ్డుకు రెండువయిపులా దట్టంగా పెరిగిన చెట్లు కీచురాళ్ళ ధ్వనిలో మార్మోగుతున్నాయి...

జయపాండ్యన్ మోటారుసైకిల్‌ను స్టడీగా అరవై మైళ్ళ వేగంతో నడుపుతున్నాడు.

కొడైకెనాల్ వదలి దాదాపు రెండు గంటలవుతోంది.

చీకటిపడిన తరువాత కొడై వదలడం పెద్ద కష్టమేమీ కాలేదతనికి. ఎందుకంటే రాత్రి ఎనిమిది గంటలు దాటితే కొడై వీధుల్లో జనసమ్మర్దత పూర్తిగా తగ్గిపో తుంది. మెయిన్ రోడ్లే నిర్మానుష్యంగా తయారవుతాయి. దానికితోడు ఎనిమిది గంటల ప్రాంతంలో చిన్న వాన జల్లు పడడంతో ఎక్కడివాళ్ళక్కడ తలుపులు బిగించు కొని ఇళ్ళల్లో వుండిపోయారు.

ముత్తు బజారునుండి రాగానే జరిగిన విషయం తెలుసు కొని అరగంటసేపు నోటిమాటలేక నిలబడిపోయాడు.

అతి కష్టంమీద తనకు సహాయం చెయ్యడానికి ఒప్పించ కలిగాడు ముత్తును.

ఆ రోజు పేపర్లో సుమిత్ర హత్య వుదంతం ప్రముఖంగా ప్రకటించారు. భయంకరంగా వున్న సుమిత్ర మృతదేహం ఫోటోను చూసి తృప్తిగా నవ్వుకొన్నాడు జయపాండ్యన్. భర్తల్ని మోసగించే భార్యలు ఆ ఫోటో గుర్తొచ్చినంత కాలం నిద్రపోరనేది ఖాయం.

సుమిత్ర కేకలకు చుట్టుప్రక్కలవాళ్ళు తలుపులు పగలగొట్టి లోపలకు వచ్చారుగాని లేకపోతే ప్రాణం పోయేవరకూ కసిదీరా సుమిత్రను ఖండఖండాలుగా చేసివుండేవాడు తను.

ఎంత ప్రేమించాడు సుమిత్రను?

తనలాగా భార్యను అంతగా ప్రేమించిన మగవాడు ఎవ్వడూ వుండడేమో! కనీసం తన ప్రేమనుకూడా గుర్తు తెచ్చుకోకుండా మరోడితో కులకడానికి సుమిత్రకు మన

సెలా వచ్చింది...? పోనీ తను దగ్గర లేనప్పుడు శరీరపు వాంఛలను తట్టుకోలేక మరో మగాడితో సంబంధం ఏర్పరచుకోవడంలో అంగుళంకొంత జస్టిఫికేషన్ వుంది.

కాని; తను శాశ్వతంగా ఆర్మీనుండి డిస్చార్జ్ అయి తనతో వుండడానికి వచ్చేసిం తరువాతకూడా తనతో గిల్లి కజ్జాలు పెట్టుకొని ప్రియుణ్ని తన ఇంటికే రప్పించుకొని సుఖపడ్డం ఘోరం! భరించలేని అపరాధం...తన మగ తనానికే సవాల్!

పోలీస్ అంబులెన్స్లో, చనిపోతూ తన భర్తే తనను పొడిచి చంపాడని మరణ వ్యాంగ్మూలం ఇచ్చిందట... వలట! డామ్ డర్టీ షేమ్లెస్ బిచ్...

సుమిత్రేగనుక బ్రతికివుండి మరోసారి కలుసుకొనే అవకాశం వస్తే...!

అలాంటి అవకాశంవస్తే పూర్తిగా, ప్రాణం పోయేలా చంపడు తను...ఏ రహస్య మందిరంలోనో దాన్ని బంధించి, రోజూకో కండచొప్పున కోసి ఆమె బాధపడు తుంటే చూసి తృప్తిగా ఆనందించి వుండేవాడు.

ఇలా సాగుతున్నాయ్ జయపాండ్యన్ ఆలోచనలు... టూమచ్ ఎఫెక్షన్...అండ్ లాటాఫ్ ఎమోషన్...ఇవి చాలు మనిషిలోని పైశాచిక ప్రవృత్తిని బయటికి లాగ డానికి. వీటికితోడు డిజప్పాయింట్మెంట్, నమ్మక ద్రోహం, బాడ్ టెంపర్మెంట్ తోడయితే మనిషి దానవుడవడానికి క్షణకాలం పట్టదు.

ఎదురుగా ఏదో లారీ వస్తోంది. మోటార్సైకిల్ని కాస్త స్లోచేసి రోడ్డు వారగా పోనిచ్చాడు. ఏదో సరు కుల్ని తీసుకెళుతున్న లారీ...కనీసం హెడ్లైట్లు డిప్ చెయ్యనయినా లేకుండా వేగంగా దూసుకుపోయింది.

"సెన్స్‌లెస్ బాస్టర్డ్"—మనసులోనే గొణుక్కున్నాడు జయపాండ్యన్.

పాపం! ఆ ఇన్‌స్పెక్టర్‌ను తలుచుకొంటే ఓ రకంగా జాలేస్తోంది. తాజా కూరగాయల భోజనంచేసే అలవాటు అతనికి లేకపోయినట్లయితే ఈ సరికి ఇంట్లో హాయిగా నిద్దరోతుండేవాడు. ప్రస్తుతం ముత్తుతోటలో ఓ మూల భూమిలో ఆరడుగుల లోతున శాశ్వత నిద్రపోతున్నాడు.

అతని శవాన్ని కనుక్కోవడం పోలీసు కుక్కలకు కూడా అసాధ్యం. అతని సమాధిమీద చక్కటి జినియా పూలమొక్కలు పాతారు జయపాండ్యన్, ముత్తులు కలిసి.

ముత్తు పాక క్రొత్తపేడతో డి.డి.టి. పౌడర్ కలిపి ఎక్కడా పాత వాసనలు లేకుండా అలికారు. ఇన్‌స్పెక్టరు తిరిగిన ప్రదేశమంతా గేటుదగ్గరనుండి చెడు వాసనకొట్టే పురుగుల మందు స్ప్రే చేశారు.

ఇన్‌స్పెక్టర్ తోటలోకి వచ్చినప్పుడు చుట్టుప్రక్కల నిర్జనంగా వుండడం జయపాండ్యన్ అదృష్టం...అన్ని రకాల సాక్ష్యాధారాలు పూర్తిగా నాశనం చేసేప్పటికి సాయంత్రం ఆరయింది. ఎనిమిదింటికి వర్షం పడేవరకూ సిగరెట్లు త్రాగుతూ భవిష్యత్ కార్యాక్రమాన్ని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

ఎదురుగా వరుసగా నాలుగయిదు లారీలు వస్తున్నాయి. మోటారుసైకిలు వేగం బాగా తగ్గించి రోడ్డు ప్రక్కనుండి పోనిస్తున్నాడు పాండ్యన్.

ఈ రోడ్డుమీద లారీలు నడిపేవాళ్ళంతా వటి పొగరుబోతు వెధవల్లా వున్నారు. ఎవ్వరూ ట్రాఫిక్ రూల్స్ పాటిస్తున్నట్లు లేదు. ఎదురుగా వెహికల్ వస్తున్నప్పుడు

లైట్లు డిప్ చేయాలనే జ్ఞానమయినా వున్నట్లు లేదు.
"డర్టీ బాస్టర్డ్...బార్బేరియన్స్" — కసిగా తిట్టుకొన్నాడు గట్టిగా.

మోటారుసైకిలు రొదలో అతని మాటలు అతనికే వినిపించలేదు. మోటారుసైకిల్ని రోడ్డు మధ్యలోకి తెచ్చి స్పీడు పెంచాడు.

కొద్దిదూరంలో రోడ్డు వంకర తిరుగుతున్నట్లు ట్రాఫిక్ సైన్ చెపుతోంది.

"ది హుల్ విత్ ది బెండ్" — అనుకొన్నాడు పాండ్యన్ స్పీడు పెంచుతూ.

బాగా దగ్గరికి వచ్చేవరకూ చూసుకోలేదు లైట్లు లేకుండా వస్తోన్న లారీని. టర్నింగ్ తిరుగుతుండగా కనిపించింది. వేగంగా దయ్యంలా కనిపించింది హెడ్ లైటు వెలుతుర్లో. చేతులు అప్రయత్నంగా బ్రేకులు నొక్కాయి. లారీ ఆగలేదు.

"స్టాపిట్...స్టాపిట్" — పాండ్యన్ అరుపు.
పెద్ద శబ్దం...ఆక్సిడెంట్.
జయపాండ్యన్ గాలిలో ఎనిమిదడుగులు లేచి రోడ్డు ప్రక్కన గోతిలో పడ్డాడు. — ఒళ్ళంతా పెద్ద సుత్తితో బాదుతున్నట్లు బాధ. కళ్ళముందు రంగురంగుల నక్షత్రాలు కనిపిస్తున్నాయి.

"అడెడే...పయ్యా."
ఏవో మాటలు లీలగా వినిపిస్తున్నాయి.
స్పృహ తప్పింది జయపాండ్యన్కు.

* * *

ప్రొఫెసర్ రామన్న టై సవరించుకొని హాల్లోని పైలట్ ఆఫీసర్ల వంక నవ్వుతూ చూశాడు.

ప్రొఫెసర్ రామన్న నేషనల్ ఎయిరోనాటిక్ అండ్ స్పేస్ రిసెర్చ్ సెంటర్‌లో రిసర్చి డైరక్టరు. ఎర్రని వంటి రంగు, రింగుల జుట్టు, బలంగా, పొడుగ్గా తీగెలా వుంటాడతను. మెరుస్తున్న చూపులవెనక మేధస్సు తొంగి చూస్తూ వుంటుంది.

ప్రొఫెసర్ రామన్న అతి పేద కుటుంబానికి చెందిన వ్యక్తి. చిన్నతనం నుండి కష్టించి చదువుకొని పైకి వచ్చాడు. అప్లయిడ్ ఫిజిక్స్‌లో అతను యూనివర్సిటీ ఫస్ట్ వచ్చాడు. తర్వాత కొంతకాలం నేషనల్ రిసెర్చి లేబొరేటరీల్లో రిసెర్చి అసిస్టెంట్‌గా పనిచేసి పేరు సంపాయించాడు. పంతొమ్మిది వందల అరవైమూడులో అతను అడ్వాన్స్‌డ్ ట్రైనింగ్ కోసం కాలరాడోలోని అమెరికన్ రిసెర్చి ఫర్ పీస్ అని పిలువబడే డిఫెన్స్ లాబ్‌కు వెళ్ళాడు. మూడేళ్ళ తరువాత అతను ఇండియాకి తిరిగొచ్చాడు.

ఆ రోజునుండి ప్రొఫెసర్ రామన్న విజయ పరంపరకు తిరుగులేదు. ఎయిరోనాటిక్స్‌లోనూ, ఆర్మమెంట్స్ టెక్నాలజీలో అతనెన్నో క్రొత్త థియరీలు ప్రతిపాదించాడు. అతను ప్రత్యేకంగా రూపొందించిన 'పిగ్మీగ్రనేడ్' బంగ్లా స్వాతంత్ర్య యుద్ధంలో పాక్ సైనికుల పాలిటి కాలయముడయింది.

ఎయిరో డైనమిక్స్‌లో అతను క్రొత్తగా ప్రతిపాదించిన సిద్ధాంతాల ఆధారంగా భారతదేశం ఒక సరిక్రొత్త యుద్ధవిమానాన్ని తయారుచేయబోతోంది. దాని తాలూకు మొదటి రెండు ప్రోటోటైప్‌లు ఇప్పుడు ఈ లేబొరేటరీలో సిద్ధంగా వున్నాయి.

"గత నాలుగు నెలలుగా మనందరి సమిష్టి కృషి

ఫలితంగా ఈ రోజుకు నేను అనుకొన్న విధంగా సూపర్ జెట్ ఫైటర్ 'అంగారక'ను రూపొందించాను. పెర్ ఫార్మెన్స్ చెకింగ్ ఇక మిగిలింది. దాన్ని ఆకాశంలోకి తీసుకెళ్ళే థియరీ ఆధారంగా రూపొందించిన ఈ యుద్ధ విమానాన్ని ప్రాక్టికల్ గా నిరూపించాల్సిన బాధ్యత మీది. అంచేత మళ్ళీ ఓసారి ఈ సూపర్ జెట్ ఫైటర్ ప్రత్యేక లక్షణాలు, పనిచేసే తీరుతెన్నులు, ఆపరేటివ్ సిస్టమ్స్ మరొకసారి మీకు తెలియజేస్తాను."

అందరూ రామన్న వైపే తమ దృష్టి కేంద్రీకరించారు.

"ఈనాటివరకూ ప్రపంచంలో తయారైన శక్తివంతమైన విమానాలన్నీ జెట్ ఇంజనుతో తయారైన విమానాలని మీకందరికీ తెలుసు. అయితే యీ విమానాలన్నీ కూడా తమ బరువునిబట్టి పైకెగిరేప్పుడు కొంతదూరం రన్ వేమీద పరిగెత్తాల్సి వుంటుంది.

సీ హాక్, నాట్ లాంటి చిన్న జెట్ విమానాలు వందగజాలు మించి రన్ వే వుపయోగించవు. అదే విమానం బరువు పెరిగేకొలదీ, టేకాఫ్ కు వుపయోగించే రన్ వే దూరంకూడా పెరుగుతుంది. ప్రస్తుతం వుపయోగంలో వున్న జెట్ విమానాలన్నిటిలోకీ బరువైన ఎయిర్ బస్ ఆకాశంలోకి ఎగిరేముందు దాదాపు ముప్పై వేల అడుగుల రన్ వే వుపయోగిస్తుంది.

యుద్ధవిమానం దాదాపు ప్రతీదీ తేలికయిన విమానమే. అంచేత ప్రతీ యుద్ధ విమానం గాలిలోకి లేచే ముందు కొన్ని వందల అడుగులకన్నా ఎక్కువ రన్ వే వుపయోగించదు. అయినా, శత్రువుతో యుద్ధం చేసేప్పుడు ఇదీ ఒక సమస్యే. సరిహద్దులకు దగ్గరగా విమా

నాశ్రయాలు నిర్మించడం ఖర్చుతో కూడుకొన్న పని. పైగా పెద్దపెద్ద గన్ వేలతో కూడుకొన్న విమానాశ్రయాలను శత్రువులు తేలిగ్గా గుర్తిస్తారు.

హెలీకాప్టర్లలాగా ఎక్కడబడితే అక్కడ దిగి, తిరిగి రన్ వే లేకుండానే అమాంతం గాలిలోకి లేచే విమానాల్ని తయారుచెయ్యడానికి ప్రపంచంలోని ప్రతి అగ్రరాజ్యం కృషిచేస్తుందని మీకు తెలుసు, అలాంటి విమానం ఒక సూపర్ బ్యూటీ!

అలాంటి విమానాన్ని తయారుచెయ్యడానికి అవసరమైన సిద్ధాంతం కనుక్కొని, డిజైను తయారుచేసి, టెస్ట్ చెక్కు అవసరమైన ప్రొటోటైప్‌ను మీ ముందుంచగలుగుతున్నానని చెప్పడానికి సంతోషిస్తున్నాను'' అన్నాడు ప్రొఫెసర్ రామన్న తన మాటలు శ్రోతల మనసుల్లో పూర్తిగా ఇంకడానికి ఆగుతూ.

"ఆర్ యు ష్యూర్ సర్?"

"ఇటీజ్ అన్‌బిలీవబుల్!"

"ఫాంటాస్టిక్!"

"మై గుడ్‌నెస్...ఇట్స్ డ్రీమ్ జట్!"

ఇవి ఆ గదిలోని టెస్ట్ పైలెట్ల రియాక్షన్‌లు.

ప్రొఫెసర్ రామన్న ముఖంలో చెప్పలేని ఆనందం, తృప్తితో కూడిన చిరునవ్వొకటి కనిపించింది.

"ఇటీజ్ క్వయిట్ రియల్ మై బాయ్స్! మై బాయ్స్! ఈ అద్భుతమైన విమానాన్ని మొదటిసారిగా ఆకాశంలోకి ఎగిరించి పరీక్షించేందుకు వెతికి వెతికి మిమ్మల్ని ఎన్నుకొన్నాను. యువార్ ది లక్కీ వన్స్."

"థాంక్యూ ప్రొఫెసర్!" అన్నారు ఆ నలుగురు టెస్ట్ పైలట్లు ముక్తకంఠంతో.

ప్రొఫెసర్ రామన్న చిరునవ్వుతో తలాడించాడు...

"ఇటీజ్ నథింగ్ మై బాయ్స్! సూపర్ జెట్‌ను గురించిన మిగతా విషయాలు వింటే మరింత ఆశ్చర్యపోతారు. వర్టికల్ లాండింగ్, టేకాఫ్‌లతోపాటు ఈ విమానం నిముషానికి ముప్ఫై వేల అడుగులు క్లయింబింగ్ కపాసిటీ వుంది... అంటే నిలబడిన చోటునుండి సూటిగా రాకెట్లా ఆకాశంలోకి నిముషానికి ముప్ఫై వేల అడుగులు దూసుకుపోగలదు... మాక్సిమమ్ ఆల్టిట్యూడు అరవై వేల అడుగులు అంటే భూమినుండి అరవై వేల అడుగుల ఎత్తులో ఎగరగలదు. ఇక అన్నిటికన్న ముఖ్యమైనది...ఫ్లయింగ్ ఎండ్యూరెన్స్...మోర్ దేన్ టెన్ హవర్స్...అంటే దాదాపు పది గంటలకు మించి అది గాలిలో ఎగురుతూ వుండగలుగుతుంది."

"మైగాడ్! ఇట్స్ ది జైంట్ కిల్లర్!"

"ఇట్స్ సూపర్ ఫాస్టు మిస్టరీ జెట్!"

"యస్! దిసీజ్ ది అల్టిమేట్ ఇన్ వార్ ప్లేన్స్!"

"వెయిటెమినిట్ యంగ్ చాప్స్. నన్ను చెప్పనివ్వండి"—అన్నాడు రామన్న వాళ్ళ ఉత్సాహాన్ని చేతులతో వారిస్తూ. "ఇంత ప్రపంచానికి తెలిసిన యుద్ధ విమానాల్లో అమెరికాకు చెందిన పాంటమ్ ఎక్కువకాలం అంటే దాదాపు అయిదుగంటలు ఆకాశంలో వుండగలదు. కాని నా 'అంగారక' పదిగంటలు, డెఫినెట్‌గా పదిగంటలు, ఇంకా మించి...ఎంతో చెప్పలేని పరీక్షించి మీరు తేల్చాలి.

ఈ శక్తికి తోడు అత్యాధునికమైన రాడార్లు, కంపాస్, రేడియో కమ్యూనికేషన్ సెట్లు, కంప్యూటర్లు ఇందులో అమర్చాను. నో డౌట్ దిసీజ్ ఎ డ్రీమ్ జెట్

ఆఫ్ ఎ పైలట్."

గదిలోని అయిదుగురు చేతులు నొప్పులుపుట్టేలా చప్పట్లు కొట్టారు.

"అండ్ నా జంటిల్మెన్ — లెటస్ గెటాన్ విత్ ది బిజినెస్. ఇంత అత్యాధునికమైన విమానం నడపడం అంత తేలికయిన పనికాదు. ఈ విమానంలోని ప్రతి యంత్రం, ప్రతిమీట, ప్రతి స్విచ్, ప్రతిభాగం ఎలా పనిచేస్తుందో దాని నిర్మాణ క్రమమేమిటో, ఉపయోగమేమిటో, ఎప్పుడు ఏ పరికరాలు వుపయోగించాలో, అతి క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొంటేగాని ఈ విమానాన్ని నడపడం అసంభవం.

ముందు మీకు ఈ విమాన నిర్మాణం గురించి కొంత చెపుతాను" —

ప్రొఫెసర్ రామన్న గోడకు తగిలించిన డ్రాయింగ్ వైపు తిరిగాడు. అందరూ నిశ్శబ్దంగా వినసాగారు.

* * *

సెడ్రిక్ ఫెర్రిరా అలియాస్ విన్సెంట్ లుముంబా హాంకాంగ్‌లో హాలిడే స్ట్రీట్‌కు వెళ్ళాడు టాక్సీమీద.

హాంకాంగ్ హాలిడే స్ట్రీట్ ఒక సూపర్ బజార్ లెన్‌షిప్‌లాంటిది. ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే అన్ని రకాల ఫ్యాన్సీ వస్తువులు, వస్త్రాలు, స్పోర్ట్స్ గూడ్స్, నగిషీపని చేసిన నగలు ఆ వీధిలోని షాపుల్లో లభిస్తాయి.

తిన్నగా లైఫ్ సైజ్ రబ్బరు బొమ్మలమ్మే దుకాణం లోకి వెళ్ళాడు. చైనీస్ సేల్స్ గరల్స్ నవ్వుతూ ఆహ్వానించారు అతన్ని.

తనకు కావలసిన బొమ్మల్ని చకచకా ఎన్నుకొన్నాడు లుముంబా.

ఇద్దరు స్త్రీలు, ముగ్గురు మగవాళ్ళు దిగంబరంగా వున్న బొమ్మలవి. ఒక స్త్రీ బొమ్మ పొడుగ్గా, నల్లటి జుట్టుతో వుంది. రెండవ స్త్రీ బొమ్మ పొట్టిగా, బాబ్ డు హెయిర్ స్టెయిల్ లో వుంది. పురుషుల బొమ్మలుకూడా ఓ లావు పాటి మనిషిది, వృద్ధకాయుడైన మనిషిది, బట్టతల మనిషిది ఎన్నుకొన్నాడు.

ఈ బొమ్మలకు సరిపడే రెడీమేడ్ దుస్తులుకూడా కొన్నాడు.

"హౌమచ్!" అడిగాడు సెలక్షన్ పూర్తయిన తరువాత.

"ఒక్కొక్క మగబొమ్మ నూటయాభై డాలర్లు, ఆడ బొమ్మ రెండువందల డాలర్లు, డ్రెసెస్ తో కలిపి. మొత్తం వెయ్యి డాలర్లు" అన్నాడు షాపు యజమాని.

లుముంబా క్రూరంగా నవ్వాడు అతనివైపు చూసి. "ఎక్కువ బొమ్మలుకొంటే మీ షాపులో ఖరీదు ఎక్కువ చెపుతారనుకొంటాను" అన్నాడు.

"నో సర్! మీరు పొరబడుతున్నారు. హోల్ సేల్ రేటు చెప్పాను మీకు. ఆడబొమ్మను సాధారణంగా మూడువందల డాలర్లకు తక్కువ అమ్మము. ఆ బొమ్మను ప్రక్కనుంచుకొని పడుకొంటే స్వంత ప్రియురాలినైనా మరిచిపోతారెవరైనా."

"రబ్బిష్!" అన్నాడు లుముంబా చిరాగ్గా.

ఆ బొమ్మలు ప్రాణమున్న మానవుల్లాగే వుంటాయని లుముంబాకు తెలుసు. అందుచేతనే అతనసలు ఆ షాపు ఎన్నిక చేసుకొన్నది.

"పోనీ ఓ యాభై డాలర్లు తగ్గించుకోండి" అన్నాడు షాపు యజమాని చివరికి.

"ఎనిమిది వందలు ఇస్తాను. ఇష్టం లేకపోతే మరో షాపుకి పోతాను" అన్నాడు లుముంబా పర్సు బయటికి తీస్తూ.

యజమాని లుముంబావైపు కోపంగా చూశాడు. గిల గిల్లాడుతూ చేతులు గాల్లో ఆడించాడు. చివరికి లుముంబా చెప్పిన ధరకే అమ్మడానికి ఒప్పుకున్నాడు.

లుముంబా డబ్బు చెల్లించి, మరో ఇరవై డాలర్లు ఎక్కువిస్తూ ఆ బొమ్మల్ని జాగ్రత్తగా పార్సెల్ చేసి లినీ వాన్ షిప్ బిల్డర్స్ ఆఫీసుకు ఓ గంటలో పంపమని చెప్పాడు.

తరువాత అక్కడనుండి చిన్నపిల్లలు ఆడుకొనే సామాన్లు అమ్మే షాపులోకి వెళ్లాడు.

"వాట్ కెన్ఐ డూ ఫర్ యు సర్?" సేల్స్‌గరల్ చిరునవ్వు.

అద్దాల బీరువాలలో అందంగా అమర్చిన రకరకాల ఆట వస్తువులవైపు పరిశీలనగా చూశాడు. అందులో కొన్ని ఇండియాలో తయారైన వస్తువులు కూడా కనిపించి చిత్రంగా భుజాలు ఎగరేసి తనలో తానే నవ్వుకొన్నాడు.

"ఐయామ్ లుకింగ్ ఫర్ ఏన్ యానిమల్ వాయిస్ సెట్" అన్నాడు లుముంబా.

"లెట్ మి హెల్ప్‌యు సర్!" అన్నది సేల్స్‌గర్ల్ షాపులో ఓ మూలకు దారితీస్తూ.

చిన్న అట్టపెట్టెలోనుండి మౌత్ ఆర్గన్ లాంటి దాన్నొకటి బయటికి తీసింది. దాన్ని పెదిమల మధ్య ఇరికించుకొని మాట్లాడితే – మన మాటలు పక్షులు మాట్లాడినట్లు, కొన్ని జంతువులు మాట్లాడినట్లు వినిపిస్తుంది.

"మే ఐసీ యాన్ ఎలక్ట్రానిక్ సెట్?" అడిగాడు

లుముంబా.

"అఫ్‌కోర్స్" అన్నది మరో చిన్న పెట్టెలోంచి నల్లటి లోహపు పెట్టె ఒకటి బయటికి తీసి ఇస్తూ.

ఈ ఎలక్ట్రానిక్ సెట్‌ను మైక్ కనెక్షన్‌కు అమర్చి మాట్లాడితే మాటలు చిలుక పలుకుల్లానో, గాడిద అరుపుల్లానో వినిపిస్తాయి.

లుముంబా అది కొనుక్కొని బిల్లు చెల్లించి బయటపడ్డాడు.

లాగుసు రిక్షాలో సాయంత్రం అయేప్పటికి లిసీవాన్ షిప్‌యార్డు చేరుకొన్నాడు.

"రడీ మిస్టర్ లుముంబా! ఎవిరిథింగ్ ఈజ్ రడీ... యువర్ షాడో ఈజ్ బ్యూటిఫుల్" అన్నాడు లిసీవాన్ నవ్వుతూ.

"లెట్స్ గో అండ్ సీ!" అన్నాడు లుముంబా నిశ్చలంగా.

లిసీవాన్, లుముంబాని వెంటబెట్టుకొని తన ప్రయివేటు షిప్ యార్డులోనికి దారితీశాడు.

డ్రైడాక్‌లో బీచ్ లాండింగ్ టైపు పెద్దసైజు మోటారు బోటు కనిపిస్తోంది. నౌక చుట్టూతా బయటివైపు తుప్పు రంగు పెయింటు చేయబడివుంది. నౌక చుక్కానివైపు 'షాడో ఆఫ్ లుముంబా'అన్న పేరు తెల్లటిపెయింట్‌తో వ్రాసివుంది.

"టాంకులనిండా పెట్రోలు పోయించావా?"

"యస్! అఫ్‌కోర్స్!"

"ఎక్స్ట్రా టాంకులు?"

"అవికూడా నిండుగానే వున్నాయి"

"రిజిస్ట్రేషన్ సర్టిఫికేట్, లాగ్‌బుక్, వాయిజ్

మాప్‌లు?"

"అన్నీ కాబిన్‌లో వున్నాయి."

"రిఫ్రిజిరేటర్లో ఏం పెట్టించావు?"

"ఏమీ లేవు!"

"సిల్లీ. వెంటనే ఓ పాతిక బీరు డబ్బాలు, రెండు బాటిల్స్ విస్కీ, నాలుగు పౌన్‌లు ప్లమ్ కేక్, ఆరు బ్రౌన్ బ్రెడ్ లోవ్స్. నాలుగు కేజీలు రైస్ పాకెట్లు, టేస్టీ వెజిటబుల్స్ అసార్ట్‌మెంట్, టేస్టీ బీఫ్, కండెన్సడ్ మిల్క్ టిన్నులు, ఇన్‌స్టాన్ట్ కాఫీ పౌడర్ వెంటనే లోపల పెట్టించు" అన్నాడు లుముంబా చకచకా.

లిసీవాన్ వెంటనే చైనీస్‌లో గబగబా అరుస్తూ తన ఆఫీస్ బోయ్‌కి ఏదో చెప్పాడు.

వాడు తల వూపి ఆఫీసు వైపు పరిగెత్తాడు.

"లెట్స్ గో అండ్ సీ ది వెసల్ ఇన్‌సైడ్" అన్నాడు లుముంబా ఓడవైపుకి దారితీస్తూ.

నెలక్రితం షిప్‌యార్డ్ జంక్ కార్నర్‌లో తుప్పుపట్టిపోయి చూడ్డానికి అసహ్యంగా కనిపించిన బీచ్ లాండర్‌కూ, ఈరోజు క్రొత్త పెయింటుతో క్రోమ్‌తో తళతళలాడుతూ కనిపించే 'షాడో ఆఫ్ లుముంబా'కు పోలికే లేదు.

ముచ్చటయిన కేబిన్‌రూము. డ్రయివర్ సీటు వెనకే చిన్న స్లీపింగ్ బంక్ కూడా వుంది. ఓడ మధ్యలో లుముంబా చెప్పిన స్పెసిఫికేషన్స్‌కు తగినట్లు వున్న పెద్ద గది బయటికి కనిపించే కిటికీలకు మాత్రం చక్కటి ఫ్లోరల్ డిజైన్లతో నిండిన రంగు రంగుల కర్టెన్‌లు కట్టి వున్నాయి.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క-మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పైసలు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చేనెల మాస పత్రికలో చూడండి. •

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరుకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి. తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలి-వరీ' లో పంపగలము. •



## క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

### దొంగలున్నారు?

సినిమాహాలు ప్రేక్షకులతో కిటకిటలాడుతోంది___

హీరో ఒక్కదూకులో వచ్చి విలన్ను చిత్తుగా తన్ని పడేస్తున్నాడు.

ఒక్కసారి అందరూ విస్తుపోయారు. హాలంతా నిశ్శబ్దంగా మారింది; దానికి కారణం ఒకావిడ 'కెవ్వున' కేకేసింది. అందరూ ఆవిడ వంకే చూశారు.

ఫిల్మ్ ఆగిపోయింది. లైట్లు వెలిగాయి.

పోలీసు గంగరాజం ఒక్క ఊపున ఒక లాఠీతో హాల్లోకి వచ్చి ఆవిడను "ఏం జరిగిందమ్మా?!" అని పరామర్శించాడు.

"నా నెక్లెస్___నా నెక్లెస్___!!" అంటూ దిక్కులు చూడసాగిం దావిడ.

గంగరాజం అర్థం చేసుకున్నాడు ఎవడో దొంగవెధవ నెక్లెస్ కొట్టేశాడని. దిక్కులు చూడసాగాడు, ఎటూతోచక.

ఏమీ 'క్లూ'లు దొరకడంలేదు....

ఇంతలో ఒక వ్యక్తి అటుగా పరుగెత్తడం చూశాడు. గంగరాజం అతన్ని గట్టిగా పట్టుకొని తీసుకొచ్చాడు.

"ఈవిడ నెక్లెస్ కొట్టేశావా?!" గద్దించాడు గంగరాజం.

"లేదు!!..." అమాయకంగా జవాబిచ్చాడా వ్యక్తి.

"మరి యెందుకలా రేసు గుర్రంలా పరుగెత్తు తున్నావ్?!"

"నా జేబులో డబ్బుంది. ఎవరైనా కొట్టేస్తారేమోనని?" నీళ్ళు నమిలాడు ఆ ఆసామి.

—ఏ. మోహన్‌కుమార్, హైద్రాబాదు-44

## త్రాగిందెవరు?

"ఏమయ్యా, ఆచారీ! నిన్న ఈ హారాన్ని బంగారుది అన్నావు. ఈ రోజు బంగారుది కాదంటావేం?"

"నిన్న ఏ వేళప్పుడు చూపించారు మీరీ హారాన్ని!"

"నిన్న సాయంత్రం 6 గంటల టైంలో."

"అలాగ! అయితే ఆ టైంలో త్రాగి వచ్చింటారు!"

"నాకు త్రాగుడు అలవాటు లేదయ్యా!"

"అలవాటు నీకు లేకపోవచ్చు, వేరేవాళ్ళకు ఆ అలవాటు వుండచ్చుగా?"

—కె. నాగభూషణం, బత్తలపల్లి.

## నేనెవరినో తెలుసా?

"ఏవిటోయ్...నేనెవరినో తెలుసా?" అడిగాడు అప్పారావు, స్కూల్‌కి వెళుతున్న ఓ ఏడేళ్ళ అబ్బాయిని.

"ఓ...తెలుసు" అబ్బాయి జవాబు.

"అయితే చెప్పుకో చూద్దాం!"

"రాస్కెల్! బ్రూట్‌వి నువ్వు..."

"ఆఁ...అదేమిటి...??"

"అవును మరి. నిన్న మా అక్కయ్య నిన్ను 'రాస్కెల్! బ్రూట్!' అని తిట్టిందిగా.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

